# IDAA NAGARAKATHA ?

Telugu Version of the Hindi novel
CHHOTISEE BATH

*By* : RANGEYA RAGHAVA
*Translated by*: "BYRAGI"

First Edition : 5000 Copies
December : 1960
Price : Rs 1–25



---

Published Under the Auspices of . .
THE SOUTHERN LANGUAGES BOOK TRUST
M A D R A S
Second Series:Telugu 4.

---

PUBLISHED BY
ADARSA GRANDHA MANDALI
Vijayawada - 2

---

PRINTED AT VENKATARATNA PRINTERS, VZA 2.

# తొలిపలుకు

ప్రాంతీయ భాషలన్నిటింలోనూ ఒక భాష
లోని ఉత్తమ రచనలను ఇతర భాషలలోనికి
తర్జుమా చేయించుటకూ, దక్షిణ భాషలు
నాల్గింటిలోనూ మంచి పుస్తకములను
చౌకగా ప్రచురించుటకూ సంకల్పించి,
దక్షిణ భాషా పుస్తక సంస్థ కావించుచున్న
ప్రశంసనీయమైన కృషికి నే నాసంస్థను
అభినందించుచున్నాను. మన భాషలలో
చౌకధరలకు దొరుకు మంచి పుస్తకములకు
ఎంతేని అవసరమున్నది. ఈ అవసరములను
ఈ పుస్తక సంస్థ తీర్చగలదని నానమ్మకము.
ఈ సంస్థ తలపెట్టిన కార్యకలాపము ఫల
ప్రదముగా కొనసాగవలెనని నేను ఆశించు
చున్నాను.

హైద్రాబాదు,
26-9-1960.

డి. సంజీవయ్య
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ ప్రభుత్వం

హిందీలో ఈ నవలకు గ్రంథకర్త "ఛోటీసీ బాత్" (చిన్న మాట) అని నామకరణం చేశారు. నిజానికి నేడు మన సంఘంలో మధ్యవర్గం లోని పై తరగతుల స్త్రీ పురుషుల విచిత్ర జీవనానికి సంబంధించిన చాలా "గొప్పమాట" శ్రీ రాంగేయ రాఘవ ఈ నవలలో చెప్పారు.

# ఇదా నాగరకత ?

ప్రియమైన సోదరీ,

ఇన్నాళ్ళవరకూ నేను చాలా చీకాకులో ఉన్నాను. అందుచేత నీ ఉత్తరాలకు జవాబివ్వలేకపోయాను. నీవు నన్నుగురించి ఏమను కొంటున్నావో మరి! చిన్నతనంనించీ మనిద్దరం ఒకరికొకరు తోడునీడగా ఉన్నాం. సైన్యంలోఉన్న సిపాయిలుకూడా ఒకరికొకరు తోడుగాఉంటూ జీవితం గడిపివేస్తారు. కాని అలా తోడుగా ఉండటానికొక్క పెద్ద విలువ ఏమీ ఉండదు. జ్ఞాపకం ఉందా నీకు ? ఒకసారి మనిద్దరం వింధ్యపర్వత ప్రాంతంలోని అరణ్యాలు చూడడానికి వెళ్ళాం. అప్పుడు నేను నీతో అన్నాను, "ఈ చెట్లు చూడు. ఎన్నో సంవత్సరాలు అలా ప్రక్క-ప్రక్క-నే నిలబడి ఉంటాయి. కాని పాపం, ఒకదానితో ఒకటి మాట్లాడుకోలేవు. చిత్రంగదూ!" అని. అపుడు మనవెంట పోస్టుమాస్టరుగారు ఉన్నారు. ముసలివాడు. అప్పుడప్పుడు ఉర్దూ కవిత్వంకూడా వ్రాస్తూ ఉండేవాడు—ఆయన అన్నాడు—'పొరపాటు అమ్మాయిలూ! అవికూడా ఒకదానితో ఒకటి మాట్లాడుకుంటాయి.' అని.

"ఎలా మాట్లాడుకొంటాయండీ?" అని నేనప్పుడు అడిగాను. 'మీరిద్దరూ పాటలు నేర్చుకుంటున్నారుగదూ? నాదబ్రహ్మోపాసనే సంగీతంలో ముఖ్యమైన విషయమని మీకు తెలుసుగదా. ఆ నాదమే మన భాషామూలంకూడా. అదే ఈ సృష్టిఅంతటా నిండిఉన్నది. దానికి ఎన్నో రూపాలు ఉన్నాయి. చెట్లకుకూడా ప్రాణంఉంటుందని, అవికూడా ఊపిరి పీలుస్తాయని జగదీశ్‌చంద్రబోసువు నిరూపించాడుగదా! అలాగే అవి మాట్లాడుతాయికూడానేమో, ఎవరికి తెలుసు?" అన్నాడు ఆయన. అప్పుడు మనిద్దరకూ ఎంత ఆశ్చర్యంవేసింది! నా మెదడులో ఈవిషయం ఎన్నాళ్లో అలా తిరుగుతూనే ఉంది. అప్పటినుంచి చాలారోజులదాకా ఎక్కడున్నా

చెట్లగుబురు చూచినప్పుడల్లా నా మనస్సులో అతి విచిత్రమైన ఊహలన్నీ కలిగేవి. నిజం ! ఊహతెలిసినప్పటినుంచీకూడా ఎవరికో ఒకరికి మనస్సంతా విప్పిచెప్పటం నా కలవాటు. పూర్వం నీ కలా చెబుతూఉండేదానిని. నీతో నేను అన్నివిషయాలూ మాట్లాడేదానిని. అందుకనే మనిద్దరి స్నేహాన్ని నేను మిగతావాళ్ళందరి స్నేహంలాగా భావించాను.

ఆడది ఆడదాన్ని ప్రేమించలేదని జను లంటూఉంటారు. కాని నాకు తెలిసినంతవరకూ ఇది నిజంకాదు.నిజానికి ఒకవిధమైన ఔన్నత్యాన్ని చేరుకోవడాన్నే ప్రేమ అనాలి. ఆ ఔన్నత్యం సాన్నిహిత్యంవల్లా త్యాగంవల్లా వస్తుంది. శారీరికభోగవాంఛను తృప్తిపరుచుకోవడంవల్ల ప్రేమ తన పరాకాష్ఠను అందుకోగలదా ? లేదు-నీతో నేను ఎల్లప్పుడూ అన్నివిషయాలూ అతి స్పష్టంగా చర్చిస్తూవచ్చాను. ఈనాడుకూడా అంటే, ఏమీ మారలేదు. శారీరికతృప్తి ఒకొక్కసారి మానసికతృప్తిగా పరిణమిస్తుంది. కాని దానికంటేకూడా ఎక్కువైనది ప్రాణాలన్నిటినీ ఆవేదనలో ముంచివేయగల ఆ అనిర్వచనీయమైన ఆరాటం—నిజం చెబుతున్నాను—అది లేకుండా నేను ఒక్కక్షణంకూడా జీవించలేను. ఆ బాధ నా మనస్సుకు ఎంత బావుంటుంది! అది లేకుండా ఈ విశాల ప్రపంచంలో బ్రతకడం నాకు, తినుబండారాలతో నిండిన వంటగదిలో ఎలుక బ్రతుకులాగా అనిపిస్తుంది. తినడానికి ఎన్నో వస్తువులుంటాయి. కాని ఆ పాత్రలన్నిటిమీదా పెద్దపెద్ద మూతలుంటాయి. పాపం, ఆ ఎలుక క్రిందపడిన ఒకటీ అరా మెతుకులు ఏరుకుని తృప్తిపడవలసిందే. అన్నీ ఉంటాయికాని, అయ్యో నోట్లో శని, ఏంలాభం? నా మనస్సుకు ఎంతో తృప్తినిచ్చే నీ తోడుకూడా నాకు నేడు దుర్లభమయింది. నాకు ఆ పాతజీవితం ఇవాళ ఎంత జ్ఞాపకం వస్తున్నదీ ?

ఆహా! ఆ దట్టమైన క్రొమ్మావిచెట్లగుబురులక్రింద చిక్కని చీకటి అలముకునేది. తళుక్కుతళుక్కుమని మిణుగురు పురుగులు మెరుస్తూ ఉండేవి. రివ్వురివ్వున దూసుకుపోయే వాయుపీచికల్లో కోకిలకంఠం తేలి వచ్చేది. ఒక్కొకసారి చాతకపక్షి ఎడతెరిపిలేకుండా కూసేది. ఆవెనుక ఎక్కడో దూరంనుంచి లీలగా, మధురమైన పిల్లనగ్రోవి స్వరం చల్లగా వినిపించేది. రంగురంగుల జాలర్లు వ్రేలాడుతున్న మన టేబుల్ లేంప్ వెలు

తురుతో మనిద్దరం షెల్లీ, కీట్సుల కవిత్వాలు చదువుకుంటూ పోతుండే
వాళ్ళం. ఆ జీవితంలో ఎన్నిరకాల కలలు చెల్లీ! అప్పుడప్పుడు మీ నాన్న
గారు వచ్చేవారు. కొంచెంసేపు గమ్మత్తుగా మాట్లాడి "మంచి జత కుది
రింది మీ ఇద్దరికీ" అనేవారు. మనం నవ్వేవాళ్ళం. ఒకరోజున మీ
అమ్మగా రన్నారు—"ఇంకెన్నాళ్ళులే ఈ కలిసి ఉండటం, ఆడపిల్లలకు
వాళ్ళయిష్టారాజ్యంగా సాగాలంటే సాగుతుందా ? ఎక్కడ పుట్టి ఎక్కడి
కెళ్ళాలో" "సరేలే, ఇప్పుడునుంచీ ఎందుకు ఈ గోల-"అని నాన్నగారు
వెళ్ళిపోయారు. అవతల ఫోను మ్రోగినట్లున్నది.

కాని ఆరోజు మనిద్దరి మనస్సులూ విచారంతో నిండిపోయినయ్.
కాని నిజంచెప్పాలంటే మనిద్దరం విడిపోతామనే ఆలోచనవల్ల ఒకప్రక్క
దుఃఖం కలిగినా, మరోప్రక్క రానున్న భవిష్యత్తునుగురించి చిత్రవిచిత్ర
మైన యోచనలు కలిగేవి. వియోగదుఃఖంతోపాటు రానున్న ఇతర సౌఖ్యా
లను గురించి తీయతీయని ఊహలుకూడా కలుగుతూఉండేవి. కాని ఈ
విషయం మనం ఒకరికొకరు తెలియనిచ్చేవాళ్ళంకాదు. రాబోయే భర్త
లను గురించికూడా మనం ఊహించుకొంటూఉండేవాళ్ళం—ఏనాటికైనా
డాక్టరుభార్య నౌతానని నీ వనుకొన్నావా, సర్కారు ఉద్యోగిభార్య నౌతానని
నే ననుకొన్నానా ?

ఒకనికి భార్యనౌతాననే ఊహ స్త్రీజీవితంలో ఎటువంటి సౌఖ్యాన్ని
కలిగిస్తుంది! నిజానికి మన శరీరాలకంటే మన మనస్సులు ఎంత అంద
మైనవి ? అయితే, మనస్సులోని అందం, విలువ మగవాని కేం
తెలుసు ?

'ఆడపిల్లలకు వాళ్ళ ఇష్టారాజ్యంగా సాగ'దని ఆరోజున మీఅమ్మ
అన్నప్పుడు నాకు సరిగ్గా అర్థంకాలేదు. ఈనాడు నాకు అర్థమౌతున్నది.
అందుచేతే ఆమెను తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతున్నది. ప్రతి ఆడ
దానికీ తన పారతంత్ర్యాన్నిగురించి తెలుసన్నమాట. అయినప్పుడు అది
ఎందుకు తిరుగుబాటు చెయ్యదు ? ఈ ప్రశ్న వేస్తున్నదానిని నేనుమాత్రం
చేస్తున్నాను గనుకా? చేయగలుగుదును గనుకా? ఆ తిరుగుబాటుకు అసలు
అర్థమేముంది? ఆ తిరుగుబాటువల్ల స్త్రీలో ఉన్న అహంభావానికి దోహదం

కలుగవచ్చుగాని, దానితో ఆమెకు సుఖం ఏమి కలుగుతుంది? ఊఁహూఁ— స్త్రీకి సుఖమల్లా తన సంతానంతోనే.

నా కేమనిపిస్తూందంటే, స్త్రీకి మనస్సు ప్రధానంకాదు—శరీరమే. శరీరాన్ని, మనస్సునూ ఒకటిగాచేసి, ఆడది తనను తాను మోసగించు కొంటున్నది. పురుషుడు మనస్సుపేరుతో చలామణీఅయ్యే శరీరం. శరీరం మనస్సంత చంచలమైనది కాదు. పురుషుని మనస్సులోని ఆకలి అతనిశరీరంలో ఆవేశరూపంతో ఆవహిస్తుంది. మళ్ళీ వదిలిపోతుంది. గాలివిసురుకుమల్లే అలా వీచిపోతుంది, ఆడుదానిలో అలా ఉండదు. స్త్రీ శరీరమే ఆమె మనస్సుకు శత్రువు. అదే ఆమెను పారతంత్ర్యంపాశంలో కట్టివేసింది. నిజం—ఆడది ఒకవేళ తిరగబడాలన్నా ఎవరిమీద తిరగ బడుతుంది? భగవంతునిమీదనా?

ఆలోచించగా ఆలోచించగా అమ్మగా రానాడు చెప్పిన మాటకన్నా కూడా నాకు ఎక్కువ ఆశ్చర్యం కలిగించిం దేమిటంటే, ఈ అనుభవాన్ని పొందినవాళ్ళం మనమొక్కళ్ళమే కాదు. చదువుసంధ్యలు ఉన్నా, లేక పోయినా, మానవజీవితపు అనుభవాలు తరతరాలుగా అలావస్తూనేఉన్నవి. స్త్రీ స్వాతంత్ర్యమనే విషయం భావనకూ్కడా అందరానిదిగా ఉన్న రోజుల్లోకూడా మనకు స్వాతంత్ర్యం లభించడం అసంభవమనే సత్యం అలా ఉంటూనేవచ్చింది, మనం ఎంతకోరుకున్నా స్వాతంత్ర్యాన్ని పొంద లేము.

ఎందువల్ల ?

ఎందువల్లనంటే, ఈ స్త్రీస్వాతంత్ర్యమనే నినాదం మనం ప్రారం భించలేదు. ఇది పురుషుడు ప్రారంభించిందే. పెళ్ళయినతరువాత కొన్నాళ్ల నేను చాలా తీవ్రంగా ఆలోచించాను. 'ఆడపిల్లలు అసలు పెళ్ళెందుకు చేసుకోవాలో అని ? పుట్టినదగ్గరనుంచీ ఏ ఇంట్లో ఉంటూవచ్చిందో ఆ ఇంట్లో అలాగే ఉండిపోకూడదా ?

నే నొకరోజున మా అత్తయ్యతో ఈసంగతే అన్నాను. ఆమె విని నవ్వి ఊరుకుంది. నేను చాలా కించపరచుకొన్నానుకూడా. ఏమిటి ఈమె ఇటువంటి గంభీరమైన, విప్లవపూరితమైనభావాన్ని అర్థంచేసుకోలేక ఏదో చిన్నపిల్లలమాటలా నవ్వుతుంది ఏమిటా!—అని.

'పిచ్చిదానా! ఇలా ఎన్నడైనా జరిగిందా' అన్నదామె.

'ఏం! ఎందుకు జరుగదు?' అన్నాను నేను కోపంగా.

'చూడమ్మా! ఎవరి తల్లిదండ్రులూ ఎల్లకాలమూ బ్రతికిఉండరు. ఈ ప్రపంచం ఇలాగే ఒకరి కొకరిని ఆధారంగాచేసుకుని నడుస్తూ ఉంటుంది. తల్లిదండ్రులు కొడుకును ప్రేమగా పెంచుతారు. ఎందుకు? ముసలివాళ్ళయినాక వాళ్ళను పోషిస్తాడుగదా అని. కోడలిని ఇంటికి తెచ్చుకుంటారు. ఎందుకు? ఇల్లూవాకిలీ చక్కబెట్టుకుంటుందిగదా అని. కూతురును పరాయిఇంటికి పంపిస్తారు ఎందుకూ? అక్కడికి పోయి తన ఇల్లు తాను చక్కబెట్టుకుంటుందిగదా అని. ఇలాగే ప్రపంచం నడుస్తూ ఉంటుంది' అన్నది ఆమె.

"అదికాదు అత్తయ్యా—ఆడపిల్లల్నే పరాయిఇళ్ళకు ఎందుకు పంపించాలి? మగపిల్లల్ని ఎందుకు పంపకూడదూ!" అని అడిగాను నేను.

అత్తయ్య నవ్వుతూ అన్నది—"మీ మామయ్య మొట్టమొదట ఇదే ప్రయోగం చేసిచూశారు. మా యింటికి, అంటే తన అత్తవారింటికి వచ్చి ఉన్నారు కొన్నాళ్ళు. తరువాత అవమానంగాతోచి వెళ్ళిపొయ్యారు."

"అవమానమేముంది అత్తయ్యా ? ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళినప్పుడు అక్కడ అందరికీ అణిగిమణిగి ఉండటంలేదా ఏం? మగవాడు మాత్రం అలా ఎందుకు ఉండకూడదూ? కొమ్ములు పొడుచుకొచ్చాయా ?" అని అడిగాను నేను.

"అమ్మాయ్! నీతో ఎవరు బుర్రబద్దలుకొట్టుకోగలరు ? ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టారంటే, నీకే బుద్ధివచ్చేస్తుంది. పాతికేళ్లువచ్చిందాకా వడుచువాళ్ళందరికీ, ప్రపంచమంతా మనదే, మనమీదే నడుస్తూంది అని పిస్తుంది. నేనుకూడా ఇంటర్ ప్యాసైనదాన్నేగదా, నన్ను చూడు. పాతికేళ్లు వచ్చినతరువా తేమనిపిస్తుందో తెలుసా? ప్రపంచం అతి పురాతనమైనది. ఇది ఇలాగే నడుస్తూ ఉంటుంది. బ్రతికినన్నాళ్ళా ఇలా సుఖంగా బ్రతకటంతప్ప మనం చేయగలిగింది ఏమీలేదు అనిపిస్తుంది. ఆడవాళ్ళు రాజ్యమేలుతున్న దేశాలుకూడా ఉన్నాయిగదా ? అక్కడమాత్రం ఆడవాళ్ళకు కష్టాలు లేవా? దుఃఖం అనేది అనేకవిధాలుగా కలగటానికి అవకాశం ఉంటుంది. ఎందువల్లనంటే, మానవునికి అసలు ఎన్నడూ తృప్తిఅనేది

ఉండదు. చూడరాదూ! మా తాతమ్మకాలంలో ఆడవాళ్లు ఎంత ఘోషా పాటించేవాళ్ళు! మాకాలంలో ఆ ముసుగులు కొద్దిగా తీసివేశారు; మీ కాలంలో పూర్తిగా లాగివేశారు. సరే, ఇక ఈ కాలపు ఆడపిల్లలకు ఏమి తెలుకూడా అక్కరలేదు, ఇలా లోకాచారాలు ఫాషన్లు అన్నీ మారుతూనే వుంటాయి. అమ్మా! దుఃఖమే జీవితంలో సత్యం. ఆ దుఃఖాన్ని మాపు చేయటానికే కుటుంబం. ఆడవాళ్ళ రాజ్యం ప్రపంచంలో ఎందువల్ల సాగ లేదు? ఎందువల్ల సాగలేదంటే, ఆడది ప్రపంచంలో తనపిల్లలను ప్రేమించినంతగా మరి దేనినీ ప్రేమించలేదు, వేరుపడటమనేది ఆడదాని స్వభావం; మగవానిది కాదు. మగవాడు అసలు సంఘజీవి కానేకాడు. అతడు తనలోని కొన్ని ఆకాంక్షల ఆకలివలన వివశుడై స్త్రీకి దాసు డౌతాడు. అందువల్లనే ఆడది చక్కగా అలంకరించుకొని అతనిని తన పైపు ఆకర్షించుకోగలుగుతున్నది. నేను నీకు ఇంకా ఏమి చెప్పేది! నువ్వేమీ పరాయిదానివి కాదు. నా బిడ్డలాంటిదానివి. నీ కింకా ఎంతవర కని విడమరచి చెప్పేది? కాలమే నీకు నేర్పవలసిందంతా నేర్పుతుంది. నేర్పటంలో కాలాన్నిమించినవాళ్లు ఎవరూ లేరు." అని ఉపన్యసించింది అత్తయ్య.

"అత్తయ్యా, నేను నిన్ను ఇంకేమీ అడగను. ఒక్కవిషయం. నే నీ ఇల్లు వదిలిపెట్టననుకో, అప్పుడు?" అన్నాను.

"సరే. నీవు వదలవద్దు. నీ వదినలను రానీ—వాళ్ళే నిన్ను వదిలి వెళ్ళేట్టు చేస్తారు. వాళ్ళంతా ఏకమయ్యి నీకు వ్యతిరేకంగా కుట్రపన్ని, చుట్టుముట్టేస్తారు. అప్పుడు నీకు ఈ ఇల్లే పరాయిదౌతుంది. ఇక్కడినుంచి ఎంత తొందరగా బయటపడదామా అనిపిస్తుంది." అన్నది అత్తయ్య.

"ఎందువల్ల?" అని అడిగాను.

"ఇది నీకు అనుభవంవల్లకాని అర్థంకాదు. నే నెట్లా చెప్పేది?" అన్నది అత్తయ్య.

అత్తయ్యచెప్పిన అనుభవం కలిగిందో లేదో నేను నీకు నానోటితో చెప్పలేను చెల్లీ! ఏదో పెద్ద పురాణం వ్రాశాను. చదవటానికి నీకూడా విసుగ్గా ఉండవచ్చు. ఆయనా ఆఫీసుకు వెళ్ళిపోతారు. వంటకత్తె వంట చేసివేస్తుంది. ఇంట్లో పనులన్నీ పనివాళ్ళు చూసుకుంటారు. ఇక నే చేసేది ఏముంది?

పగలల్లా అలా పడిఉంటాను. ఇంగ్లీషుపేపర్లు, పత్రికలూ అన్నీ చదివేస్తుంటాను. హిందీపుస్తకాలుకూడా చదువుతూ ఉంటాను. తోచనప్పుడు రేడియో పెట్టుకొంటాను. వ్రాయవలసిందంతా వ్రాసివేశాను. నాకు ఇలా పనీపాటా లేకుండా ఎన్నాళ్ల సాగుతుందా అనుకుంటున్నాను. వచ్చేసారి మళ్ళీ వ్రాస్తాను. నా కో ఆలోచన తడుతున్నది. సరే నీ విషయంకూడా వ్రాయి. ఉత్తరం వ్రాయకమునుపు నీ మనసులో ఎన్నో విషయాలు ఉంటాయని, వ్రాయటానికి కూర్చుంటే అన్నీ మరచిపోతుంటానని నువ్వు ఇదివరకు అనేదానివి. సరే కానివ్వు. నీకు తోచినంత వ్రాయి. నీకు, నాకు ఇద్దరికీ సరిపడా వ్రాయటానికి నే నున్నాను.

నీ సుశీల.

ఇదిగో: ఉత్తరంత్వరగా వ్రాయి సుమా: నాకు ఇంట్లో బొత్తిగా పని ఉండటంలేదు. ఇక నీ ఉత్తరాలకోసం ఎదురుచూస్తూఉండటమే నా పని. నేను మనసులో అనుకున్నదానినిగురించి వచ్చేసారి తప్పకుండా వ్రాస్తాను. ఇవన్నీ చదివి నాకు పూర్వంనుంచీఉన్న పైత్యం ఇంకా వదలలేదని నీవు ఎలాగూ అనుకుంటావు. అయినా నేను వ్రాసేవి వ్రాయకుండా మానను ఉంటాను.

## 2

ప్రియమైన సోదరీ,

నీ ఉత్తరం వచ్చింది. నీవు ఇంతత్వరగా జవాబు రాస్తావని నే నెన్నడూ అనుకోలేదు; నీకు చాలా తీరికఉంటున్నది కాబట్టి, నాజీవితం నీకు స్వర్గతుల్యంగా తోస్తున్నదని నీవు రాశావు; కుటుంబం పెద్దదికావటంవల్ల నువ్వు బహుశా రాత్రింబవళ్లు పనిలో మునిగి తేలుతూఉంటావు. అయితే చెల్లీ, ఇంట్లో ఇన్నిగొడవలున్నా నీకు వాళ్ళందరంటే చాలా ఇష్టమని రాశావు. ఇదెలా సాధ్యం? మీ అమ్మగారు నీవు వెళ్ళబోయేటపుడు 'ఇక నీవు నీ పాతఇంటిని కాదు, కొత్తఇంటిని ప్రేమించాలని చెప్పారు గదూ—నీవు దానిని అక్షరాలా పాటిస్తున్నట్లున్నావు. నాకు ఇలాంటి

అడ్డంకులేమీ లేకపోవటం నా అదృష్టం. మీ అమ్మగారు ఒక పెద్ద పరివారంఉన్న ఇల్లుచూసి నిన్ను కట్టబెట్టారు. జీవితంలో ఆనందం మాత్రమే కాదు, కర్తవ్యంకూడా ఉన్నది. నీ భర్తప్రేమ నీకు సంపూర్ణంగా లభించింది. జీవితంలో నీకు శక్తినిస్తున్నది అదే. అందువల్లే ఎటువంటి పేచీ వచ్చినా, వాళ్ళందరంటే నీకు ఇష్టమేనని నీవు అనగలిగావు. కాని నలువైపులా ఇటువంటి బంధనాలు పెట్టుకొని నీ వెలా జీవిస్తున్నావో! సాయంకాలమౌతుందనుకో; నీకు భర్తవెంట షికారుకువెళ్ళాలని ఉంటుంది. సినీమాకి వెళ్లాలని ఉంటుంది. దాని కెన్నో అడ్డంకులు. మేంకూడా వస్తామని మరదళ్లు అంటారు. వాళ్ళందరూ వస్తే మజా ఏముంటుంది నువ్వే చెప్పు? ఆనందం, కర్తవ్యం తోడుతోడుగా ఉండగలవా? సరే, ఇక పెద్దవాళ్లు ముసలివాళ్ళు వెంటవస్తామన్నారంటే అసలు చెప్పనక్కర్లేదు. ఇదిగో, అలా నడవకూడదు. ఇలా చూడకూడదు. పెద్దగా నవ్వకూడదు. ఇలాంటివి అన్నీ నాకు తెలుసు. ఇలాంటి విషయాల్లో నాకు ఇంగ్లీషువాళ్ళే నచ్చుతారు. ఎంత తేడా వాళ్లకూ మనకూ!

మన సంఘంలో వివాహసమయాన, ఇకముందు నేను భర్తఇంటి వాళ్ళందరికీ సేవచేస్తానని వధువు ఒట్టుపెట్టుకొనవలసి ఉంటుంది. ఇంగ్లీషువాళ్ళల్లో దీనికి కేవలం వ్యతిరేకంగా జరుగుతుంది. అక్కడ తన భార్యకోసం అందరినీ వదిలిపెడతానని వరుడే ఒట్టుపెట్టుకుంటాడు.

ఎంత తేడా ఉందో చూడు. భారతదేశంలో మనం పాత పునాదుల మీద అటూయిటూగాని కొత్తకట్టడాలు కడుతున్నాం. విదేశీయులు ఆనందమని పిలిచేది నిజానికి విషయవాంఛ అనీ, మన సంప్రదాయాన్ని అనుసరించి ప్రేమకూడా కొన్ని కట్టుబాట్లకు లొంగివుండాలనీ నీ వాదన. ఇప్పుడు నీవు యిలాంటి వెన్నైనా చెబుతావు. "ఇప్పుడు" అంటే యింత జాగృతి కలిగిన తరువాత. అయితే, నేటికి ముప్పై సంవత్సరాల క్రితం యెలా వుండేదో జ్ఞాపకంతెచ్చుకో. అప్పుడు ఆడదాని యౌవనం రెక్కలు విరిచేసి పంజరంలో బంధించిన పిట్టలా వుండేది. భర్తను కూడ చీకట్లో రహస్యంగా కలుసుకోవాలసివచ్చేది, అదేదో మహాపాపమైనట్టు. ఇప్పు డన్ని బంధనాలు లేవు. ఆ రోజుల్లో ఆడదాని బ్రతుకొక బ్రతుకేనా! ముసలమ్మలు నేటికికూడా ఆ తమ బానిసత్వపు గాథలను

మహా గర్వంగా చెప్పుకుంటారు. వాటిని శీలం, గుణం, కట్టుబాటు అనే పెద్ద పెద్ద పేరులతో పిలుస్తారు. నిజానికి వాళ్ళ అజ్ఞానాన్ని చూస్తే, మహా మండుతుంది.

జీవితంలో ధర్మ, అర్థ, కామ మోక్షాలు నాలుగు భాగాలని నాకు మాత్రం తెలియదా ఏమిటి ? పాశ్చాత్య నాగరికత అంతా వాటిలో రెంటినే ప్రతిపాదిస్తుందని (అంటే మార్క్స్ అర్థాన్ని, ఫ్రాయడ్ కామాన్ని; వీటి పునాదులమీదే జీవితపు కట్టడం నిలబడి ఉందనివీరంటారు)మనవాదన. (ధర్మము, మోక్షమూ యివి రెండూకూడా తమ తమ స్థానాల్లో వాళ్ళిద్దరు ప్రతిపాదించిన యీ సత్యాలమీదే ఆధారపడివున్నవని మార్క్స్ ఫ్రాయడ్ల వాదన.)కాని అర్థం సంఘానికి సంబంధించినది. కామం వ్యక్తి గతమైనప్పటికి సంతాన కారణంగా సంఘానికి సంబంధించిన సత్యమే. అలాంటప్పుడు ధర్మానికి మోక్షానికి యింతటి ప్రాధాన్యమిచ్చిన భారతీయ దర్శనం జీవితంలో నిరాశకూ అభావానికీ యింత ముఖ్యమైన స్థానం ఎందుకిచ్చిందో చెప్పు. ఈ నాలుగు విభాగాలమధ్య బాలెన్సు యెలా కుదురుతుందో చెప్పు.

మావా రొచ్చిన తరువాత నీ వుత్తరం తీసి చూపించాను. చదివి "యీావిడ మహా కఠినమైన హిందీ రాస్తుందే" అన్నారు.

నాకు నవ్వు వచ్చింది. పాపం ! ఆయన యింగ్లీషు చదువుకున్నారు. హిందీ పదో క్లాసుదాకానే చదువుకున్నారు. సొసైటీలో నాలుగు ముక్కలు ఇంగ్లీషుతో పని జరిగిపోతుంది. యెప్పుడన్నా చదివినా యింగ్లీషు పుస్తకాలే ! యింగ్లీషులోకూడా ఆయనకు పెద్ద పాండిత్యం లేదు. జీవితంలో చాలా తక్కువగా ఆలోచించేవాళ్లు యెంతమంది వున్నారు ? అందులోనూ ఆఫీసర్లు. యీ విషయంలో నాకూ వారికీ బొత్తిగా పడదు, నేను అచ్చుగా యింగ్లీషు ఫ్యాషన్లలో మునిగితేలుతూ వుండాలని వారి వుద్దేశ్యం. ఒకసారి నన్ను బాల్‌డాన్సుకి తీసుకువెళ్లారు. నేనైతే తాగలేదులే. యింటికొచ్చి అన్నారు గదా "తాగకపోవటం మంచిదేననుకో ! కాని మన ఆడవాళ్ళకి మొండిపటు యెక్కువ.

"ఎందువల్ల" అని అడిగాను.

"చూడరాదూ, కల్చరనేది ఆడవాళ్ళమూలంగానే బ్రతికివుంది. మగవాళ్ళమందరం యింగ్లీషు దుస్తులు వేసేశాం. సిక్కులుకూడా గడ్డం

వుంచుకుంటారు. పాగా చుట్టుకుంటారు. అయినా వీళ్లుకూడా సూట్లు వేసు కుంటారు. కాని, ఆడవాళ్లు-హిందూస్తానీవాళ్లుగాని, పంజాబీవాళ్ళుగాని బెంగాలీవాళ్లుగాని వాళ్ళ వాళ్ళ దుస్తులు మాత్రం వదిలిపెట్టరు."

అసలు జరిగిన సంగ తేమిటంటే, క్రిస్టమస్‌నాటి సాయంత్రం మేము వేంగర్స్‌లో వున్నాం. న్యూఇయర్ డేనాటి రాత్రికూడా చాలా ప్రొద్దుపోయిందాకా అక్కడే వున్నాం. జనమంతా బెలూన్‌లు పట్టుకుని తిరుగుతున్నారు, నేను మనసులో అనుకున్నాను, "మన దేశానికి చెందిన వీళ్ళంతా యింగ్లీషులో మాట్లాడుకుంటూ సూట్లువేసుకుని చేతుల్లో బెలూన్లు పట్టుకుని యింగ్లీషుపాటలు వింటున్నారే, అమెరికాను అనుసరిస్తూ నీగ్రోలు వాయిస్తున్న ఫిడేళ్లు వింటున్నారే, వీళ్ళను ఏమనాలి ! అస లిది అమెరికా ? లేక హిందూదేశమా ?" యింతలోకి నా భర్తగారొచ్చి "లుక్ హియర్-వీరు...." నేను కళ్ళెత్తి చూచాను. బుజాలదాకా వేళ్ళాడుతున్న నా వుంగరాలజుట్టు చెంపలమీదకు వచ్చిపడితే సవరించుకున్నాను. నా పర్సులోవున్న అద్దంలో ఒకసారి నా దొండపండువంటి పెదవులు చూచు కుని చిరునవ్వు నవ్వి ఓరగా చూశాను. నా సమక్షంలో ఒక పెద్దమనిషి గంభీరంగా నిలబడివున్నాడు, గాంభీర్యమంటే యేమిటో నీకు తెలుసుగా! యెక్కువ డబ్బు, పెద్ద హోదా ! అతను నిజంగా మావారి పై ఆఫీ సరేనని తెలిసింది. షేక్‌హాండ్ యిచ్చాను. అతను కూర్చున్నాడు. ఏం తీసుకుంటారని అడిగారు మా వారు. "కాఫీ". కాఫీ వచ్చింది. సంగీతం సాగుతూనేవుంది.

ఆ పెద్ద ఆఫీసరు ఆయనపేరు 'మిష్టర్ శివపురీ' అట. ఎర్రగా వున్నాడు. ఖరీదైన సూట్ వేసుకున్నాడు. మహా గంభీరంగా ఆడ వాళ్ళతో మరీ ఎక్కువ నమ్రతతో మాట్లాడుతూవుంటాడు. యిటువంటి వాళ్లు మాటమాట్లాడితే కల్చర్ ! కల్చర్ ! ....అంటూవుంటారని నాకు తెలుసు. యింగ్లీషువాడి చెప్పుదెబ్బలు తగలకపోతే వీళ్లు కల్చర్ పేరుతో యూరోప్‌ను అసహ్యంగా అనుకరించటమే గొప్పతనమనుకొని, హిందూ దేశీయులమనిచెప్పుకొనేవాళ్లుకూడా కాదు.శాస్త్రజ్ఞానం వృద్ధిచెందిందంటే, అది మానవుని సహజ పరిణామమని తెలుసుకోక, వీరంతా అదియూరోప్ గొప్పదనమేననుకుంటారు.

కాఫీ త్రాగుతూ మేం ఆ నీగ్రోలను చూస్తూ కూర్చున్నాం. శివపురీ

గారు నన్ను రెండుమూడుసార్లు ఓరగా చూచారు. అంతే. యేమీ మాట్లాడ లేదు. తరువాత వారు వెళ్ళిపోయారు.

ఆయన గాంభీర్యంలో నాకు ఎందుకనో ఒకవిధమైన తక్కువ దనమే కనుపించింది. నేను ఆయనకింద పనిచేస్తున్నాయన పెళ్ళాన్ని గనుక, నేనుకూడా ఆయన కేదో లోకువైనట్లు. నాకు మనసులో మావారి మీద చాలా కోపంవచ్చింది. యిన్నాళ్ళవరకు ఆయన చాలా స్వాభి మానంగా బ్రతకటం చూశాను, యివ్వాళ ఆయన శివపురీవెనక తోకాడిస్తూ వెళ్ళటం చూశాను. భర్తనుగురించి యిలా అనటం తప్పనీ నాకు బుద్ధి లేదనీ నువ్వంటావు, అన్నా సరే. నేను యింటికి వెళ్ళాక వారితోనే అన్నాను—"ఏమండీ, యెందు కతని కింత అడుగులకుమడుగులొత్తు తున్నారు మీరు ?"

"నీ కేం తెలుసు ? నువ్వాడదానివి. సుఖంగా యింట్లో పడి వుంటావు. యింట్లో కొద్దిపాటి అధికారం చెలాయించటంకోసం మగ వాడు బయట ఎంతమందికి తలవంచాలో నీ కేం తెలుసు? కాలమహిమ! యీ శివపురీ-వీడూ నా తోటివాడే. షడన్‌గా ప్రమోషన్ వచ్చింది. ఎందు కని? వీడు కాశ్మీరదేశస్థుడు గనుక. మా పైవాడుకూడా కాశ్మీరు దేశస్థుడు. అదీ సంగతి. వీళ్లు హిందూదేశంలో ఎలా పాతుకుపోయ్యారో చూడు. యేం చెబుతాం. మళ్ళీ అంతా బాగా చదువుకున్నవాళ్ళే! వీళ్ళ స్థితే యిలా ఉన్నప్పుడు యిక చదువుకోనివాళ్ళ స్థితి అడగాలా! కాని పను లన్నీ చెయ్యాలి. ప్రతి మగవాడితోకా యెవడిచేతుల్లోనో ఒకడి చేతుల్లో చిక్కుకుని ఉంటుంది. గుమస్తాలతోక ఆఫీసరుచేతుల్లో. ఆఫీసరుతోక మినిష్టరుచేతుల్లో మినిష్టరుతోక దారినబొయ్యే సాధారణ మానవుడి చేతుల్లో" అన్నారు.

నాకు నవ్వువచ్చింది. వీళ్ళంతా మగవాళ్లు కాదా! తోకలున్న కోతులా! అనిపించింది. స్వాతంత్ర్యం వచ్చాక ప్రజాస్వామిక భారత దేశం అంతా కిష్కింధాపురం అయిపోయినట్లుంది.

అంతలోనే ఆయన ఇదంతా మరచిపోయారు. నైట్‌గౌన్ తీసు కుంటూ అన్నారు. "కాని, యీ శివపురీ పర్సనల్‌గా అంత చెడ్డవాడు కాదు. కల్చరున్నది. సూట్లువెయ్యటంలో విణ్ణి మించినవాడే లేడు.

ఎలాంటి సూక్తులు వేస్తాడో యే మడుగుతావు. ఇక అతని కారుంది, పెద్ద ఓడే ననుకో. కొత్తగా కొన్నా డది. జీతమా! నెలకు మూడువేల చిల్లర వస్తుంది. అయితే యింకా పెళ్ళిచేసుకోలేదు. యెద్యుకేటెడ్ గరల్స్ వాడిచుట్టూ యెలా తిరుగుతూవుంటారనుకున్నావు? కాని మావాడున్నాడే మంచి దిట్టమైనవాడులే. గడుసురకం. యెప్పుడూ అదే సీరియస్‌నెస్! మంచి దర్జాగా రోజులు గడుపుతున్నాడు."

విన్నకొద్దీ మండుకొచ్చింది నాకు. అయితే నేనుకూడా యేదో వాడిచుట్టూ తిరుగుతాననుకొనిఉంటాడు. అందుకనే నాముందుకూడా అలా మేకపోతుగాంభీర్యం చూపించివుంటాడు. యీ ఆలోచన కలగగానే నాకు చాలా అసహ్యం కలిగింది. నేను కసికొద్దీ మావారితో "ఏమండీ! వా దేమనుకొంటున్నాడో ఏమో! యిలాంటి ఆఫీసర్లని చాలామందిని చూశాం" అన్నాను.

"అరెరె! ఇదేమిటి డార్లింగ్! నేనేదో మెల్లిగా వాణ్ణి సరిచేద్దా మని చూస్తుంటే! ద్రాక్షపళ్లు పులుపనుకుంటూ కూర్చుంటే లాభంలేదు స్వీట్! యెనిమిదొందలంటే-యిదొక లెక్కా? నువ్వే ఆలోచించు. మూడువేల జీతం-సెక్రటరీ! యీ నాయకుల్ని పట్టుకుంటే పని జరుగు తుందనుకున్నావా! పని జరగాలంటే పై ఆఫీసర్లను పట్టుకోవాలి. ప్రభుత్వాన్ని నడిపేది వాళ్లు. అయితే దానికికూడా అదను కనిపెట్టాలి."

"అవునుగాని మీ రొకవిషయం గమనించారా? మనిషి యేడుస్తూ పుడ తాడు. కాని నవ్వటం నేర్చుకుంటాడు. ప్రపంచంలోని యే జంతువూ నవ్వలేదు. నవ్వటమనేది మానవుని కల్చర్. అదొక ప్రత్యేకత. మానవుణ్ణి నవ్వించలేని కల్చర్ — అది పశువుల కల్చర్" అన్నాను నేను. ఆయన తలయెత్తి నావంకచూస్తూ "వెల్! మంచి తిరుగులేని మాట చెప్పావు. అందుకనే నేను యెప్పుడూ నీ తెలివితేటల్ని పొగుడుతూ వుంటాను" అన్నారు. నాకు నవ్వు వచ్చింది. "ఏమండి! రాజునీ, చక్రవర్తినీ అంతా సింహంతో పోలుస్తారు. చక్రవర్తి అంటే చాలా గొప్పవాడే గదా! అలాంటివాడు తనను దేనితో పోలిస్తే గొప్పనుకుంటాడు? సింహంతో ఒక భయంకర క్రూరజంతువుతో పోలిస్తే. మానవుడు ఇన్నిరకాల మోసాలు టక్కులు, జిత్తులు యెక్కడనుంచి నేర్చుకున్నాడు. జంతువు జంతువునుంచి?

కల్చర్ పెరుగుతున్నకొద్దీ మానవుడు జంతువుల్ని అనుకరించటంలోనే తన గొప్పతనమనుకొని గర్విస్తున్నాడు" అన్నాను.

"కాని డార్లింగ్! యీ విషయంలో ఆడవాళ్ళను మించినవాళ్లు లేరు. చూడు. లేడిలా యెలా కళ్ళు తిప్పుతారో! అయితే యీ సొసైటీలో ఆడవాళ్లు అయినదానికి కానిదానికి "యిహాహి" అని నవ్వుతూ వుంటారే! అది నువ్వు చెప్పినట్టు, కల్చర్ అనవసరంగా పెరిగి పోవటంవల్లే నంటావా?"అని అడిగా రాయన-"వాళ్లు ఆడవాళ్ళు కాదు. సీతాకోకచిలుకలు." అన్నాను నేను. "అయితే, సీతాకోకచిలుకలు నవ్వుతయ్యి అన్నమాట, మేడమ్! నేనుకూడా నా పరీక్షలో రెండు షేక్ స్పియరు డ్రామాలు చదివాను. కాని వాటిలో సీతాకోకచిలుకలు నవ్వుతయ్యి అని యెక్కడా చదవలేదు. వాటిల్లో ఒకదాని కేదో మంచి పేరుండాలి కూడా. దాన్ని ఫిల్ముకూడా తీసినట్టున్నారు. బహుశా, ఎమ్. జి. ఎమ్. తీసిందనుకుంటాను. పిక్చర్లు తీయాలంటే అసలు వాళ్ళే తియ్యాలి. అందుకనే నే నసలు యిండియన్ ఫిల్ములు చూడనే చూడను."

"చూడకపోతే యెవరికేం నష్టం. మీకే నష్టం." అన్నాను నేను. ఆయనేమీ పలకలేదు. నేనుకూడా చీర మార్చుకోవటానికి వెళ్ళాను. ఆలోచిస్తూంటే ఖలీల్ జిబ్రాన్ చెప్పినట్టు మానసికదాస్యం అన్నిటికంటే నికృష్టమైనదని తోచింది. యిప్పు డాలోచిస్తూంటే నీ జీవితమే నాకు స్వర్గంలా తోస్తూంది. కాని యిదికూడా నిజం కాదు. ఆ లైఫ్‌లో స్వేచ్ఛ యెక్కడున్నది? నువ్వెలా వుంటున్నావో మరి అక్కడ! సరే, అదలా వుంచు. నేను నీకు నా ప్లానుని గురించి రాసినట్టున్నాను. కాని యింకా యేమీ చేయలేకపోయాను. అసలుసంగతేమిటంటే, యిది చలికాలం. రాజధానిలో యెటు చూచినా యేదో ఒక హంగామాయే. సాయంకాలం కనాట్....ప్లేస్‌లోనే కాలం గడిచిపోతుంది. బాగుంటుందిలే. కంపెనీ వుంటుంది. నేను తప్పకుండా యేదో ఒక బుక్‌స్టాల్‌కి వెళ్లుతున్నాను. యీమధ్య పోకెట్‌సిరీజ్‌లో మంచి మంచి పుస్తకాలు కొన్నాను. హిందీవి కొనలేకపోయాను, యీ హిందీ పుస్తకాలవాళ్ళకి దురాశ యెక్కువ. ధర లెక్కువపెడతారు. సాధారణంగా యింగ్లీషు పుస్తకాలు చదివేవాళ్ళ కంటే హిందీ చదివేవాళ్లు బీదవాళ్ళనికూడా వీళ్లు ఆలోచించరు. హిందీ

పుస్తకం యెప్పుడన్నా పట్టుకెళ్ళినామా.వారేమంటారోతెలుసా! "ఇదేమిటి నవలా లేకపోతే పురాణమా? అసలు నాకీ హిందీపుస్తకాలు నచ్చవు." అంటారు.

వారికి తన భాషమీదకూడా ప్రేమలేదని నాకు చాలా కోపం వస్తుంది. మీ డాక్టరుగారుకూడా హిందీ పుస్తకాలు చదవరని నువ్వుకూడా రాశావుగా. అసలీ కొత్త కల్చర్‌వాళ్ళకి తమ భాషకూడా అక్కర్లేదని తోస్తున్నది.నీ వుత్తరం చూసి వారు "నీ ఫ్రెండ్ యింగ్లీషు చదవలేదా?" అని అడిగారు. "అది యింగ్లీషు స్టడీచేసినట్టు యింకెవరు చేశారు? బాగా చదివినవాళ్ళకుకూడా అర్ధంకాని పాత యింగ్లీషుకూడా అర్ధంచేసుకుంటుందది" అన్నాను. ఆయనొక నిట్టూర్పువిడిచి అన్నారు. "ఇప్పుడు ఫారెన్ మినిస్ట్రీలో పరదేశభాషలొచ్చినవాళ్లు చాలామంది కావాలి. మంచి జీతాలిస్తారు. నీ మిసెస్‌క్కూడా వుద్యోగం చూడకపోయారా, అని ఒకాయన నన్ను అడిగారు. 'ఏదీ ఆమెకు యింగ్లీషు ఒక్కటే వచ్చు' అన్నాను నేను. డార్లింగ్ నీకు జపాన్, చైనా, జర్మన్. ఫ్రెంచి భాషల్లో యేదన్నా వచ్చుంటే ఎంత బాగుండేది? యిప్పుడసలు యింగ్లీషు వచ్చినవాళ్ళని అడిగే వాళ్ళెవరున్నారు" అని మళ్ళీ వారే "అయితే,హిందీ వచ్చినవాళ్ళకంటే నయమేలే! అచ్చగా హిందీ చదువుకున్న 'సాహిత్య రత్న'ల సంగతి అడుగుతావా యిక! వాళ్ళ పిలకలు- వాళ్లు" అని పెద్ద పెట్టున నవ్వసాగారు.

ఇదిగో, వారు రానే వచ్చారు. వెంట యింకెవరెవరో వున్నట్టున్నారు. యివాళ్టికి చాలు. మిగిలింది తరువాత రాస్తాను. వెంటనే జవాబివ్వు.

పి. యస్. వచ్చే వుత్తరంలో నా ప్లానునుగురించి రాస్తాను. నౌకరు నన్ను పిలవటానికి రానే వచ్చాడు.ఏదో టీ పార్టీ ఏర్పాటు ఉన్నట్లుంది. ఉంటాను. బై. బై.

నీ చెల్లి,
సుశీల.

# 3

ప్రియమైన సోదరీ,

నిన్ననే నీకొక ఉత్తరం రాశాను. ఇవాళ మళ్ళీ రాస్తున్నాను. ఎందువల్ల అని అడుగుతావు నువ్వు. విను.

షేక్స్పియర్ తన సాహిత్యంలో చాలాచోట్ల ఈ మానవజీవితాన్ని ఒక నాటకంతో పోల్చాడు. ఈ సంఘమనేది ఒక నాటకరంగం. దీని మీద అందరూ తమ తమ పాత్రల్ని అభినయిస్తుంటారు. కాని యీ ఇరవై య్యో శతాబ్దంలో షేక్స్పియర్ రాసినదాన్ని కొద్దిగా మార్చాలి. నేటి జీనితం నాటకం కాదు, నవల. ఇది యెంత గద్యమయమైపోయిం దంటే, నేడు యిక మహాకావ్యాలకు అవకాశమే లేదని విజ్ఞులు అంటు న్నారు.

అసలు జరిగిన సంగతి యిది: నిన్న నేను నీ వుత్తరాన్ని త్వర త్వరగా ముగించి వెళ్ళానా; సరే-డ్రాయింగ్‌రూంలోకివెళ్ళిచూస్తే వారు, వారితోపాటు కొంతమంది స్నేహితులు, స్నేహితురాండ్రు వున్నారు. అంతా తెగ నవ్వుకుంటున్నారు. విషయమేమిటో తెలియదు. ఆసలు నేనే మోడరన్ అని అందరు అంటుంటారు. గిట్టనివాళ్లు యింకా ఫేమో అంటుంటారుకూడా. కాని అక్కడికి వెళ్ళిచూస్తే నిజానికి నేను అంత మోడరన్ కాదనీ, కల్చర్‌కూడా నేర్వలేదనీ అనుకోవలసివచ్చింది.

ఒక కోచ్‌మీద తొమ్మిది పది సంవత్సరాలపిల్ల కూర్చునివుంది. నేను అక్కడికి వెళ్ళి నిలబడి "నమస్కారమండీ"అన్నాను."రండిరండి నమస్కారమండి" అన్నా రంతా. మా వారందరినీ పరిచయం చేశారు. "మిసస్ రైనా! మా సెక్రటరీ మిస్టర్ శివపురీ వున్నారు కదూ, వారి కజిన్. వీరు మిస్ రస్తోగి! సాంఘికసంక్షేమ కేంద్రానికి సెక్రటరీగా వున్నారు, వీరు మిస్టర్ సక్‌సేనా- యింజనీయర్. యిటీవలే అమెరికా కూడా వెళ్ళివచ్చారు. యిక వీరు మిస్టర్ —"

"నేనా అండి, డాక్టర్ నిమోలియాని...." అన్నాడు ఆ సజ్జనుడే స్వయంగా !

"నిమోనియా కాదు" అన్నది మిసెస్ రైనా నవ్వుతూ—మిగిలిన వారుకూడా నవ్వారు.

"సరే! యీపాటికి పిరెవరో మీరంతా తెలుసుకునే వుంటారు." అన్నారు మావారు.

"ఏమో ఎలా తెలుసు ? మీరే చెప్పండి" అన్నది మిసెస్ రైనా నవ్వి.

"నా వైఫ్ అండి"

"హో స్వీట్ ! పడుచువాళ్ళకు పెళ్లాంపేరెత్తి చెప్పటం అంతే చాలా సరదాగా వుంటుందనుకుంటా !" అన్నది మిసెస్ రైనా మళ్ళీ నవ్వుతూ.

"కాని మీకు చూస్తే మిష్టర్ రైనామీద యిప్పుడా సరదా వున్నట్టు లేదు?" అన్నాడు యిటీవలనే అమెరికా వెళ్ళి తిరిగివచ్చిన ఆ యింజనీయర్.

మిసెస్ రైనా కోచీమీద కూర్చునివున్న తన కూతురువంక చాలా విచారంగా చూచింది. తన యౌవనమంతా నాశనమైపోవటానికి ఆ పిల్లే బాధ్యురాలైనట్లు. తరువాత వానిటీ బ్యాగ్ తెరచి ముఖానికి పౌడరు అద్దుకొని, లిప్‌స్టిక్‌తో తన పెదవులపైన మరికొంచెం యెరుపెక్కించుకుంది. సన్నని వ్రేళ్లతో కాటుక పెట్టుకున్న తన కళ్ళెత్తి నావైపు ఓరగా చూచింది. ఆవిడ కళ్ల అంచులమీద ఒక సన్నని గీతగీసి అలంకారం చేసుకుందని నేను గమనించాను. ఆ గీతలవల్ల ఆమెకళ్లు సన్ననితోక లున్న పక్షుల జంటలా కనిపించాయి నాకు. ఆవిడ అసలే కొంచెం ఎరుపు. దానికితోడు మంచి తిండి తిని, పుష్టిగా వుండటంవల్ల బుగ్గలుకూడా ఎర్రగా వున్నాయి.

మిస్ రస్తోగిది నాలాగే కత్తిరించిన గిరిజాల జుట్టు. ఆమె కేశాలు పొడిపొడిగా బుజాలమీద రెపరెపలాడుతున్నాయి. కొద్దిగా పౌడరు కొట్టుకుంది. కళ్లల్లో కొంచెంగా కాటుక పెట్టుకుంది. పట్టుచీర కట్టుకుంది. ఆమె నాతో అన్నది—"చూడండి, మేమిద్దరం యివ్వాళ ఒక

పనిమీద వచ్చాం" అని ఆమె మెత యెత్తింది. యీలోగా ఆవిడ పమిట కాస్తా జారిపోయింది. ఎంతో కల్చర్‌గా పక్కవాళ్ళకు తెలియకుండా తన యవ్వనాన్ని విధిగా చూచిన పురుషులవంక ఆవిడ వాలుకన్నులతో చూచింది. తరువాత మళ్ళీ పమిటతీసి సరిగ్గా వేసుకుంది. అదిగూడ యెలాగ? గుండ్రటి వంపులు బయటకు చక్కగా కనిపించేటట్టు! నాకెందుకో యిదంతా బాగాలేదు. మావారుకూడా దానివంక చూడటం నే చూశాను.

యీలోగా నౌకరు టీ తీసుకొచ్చాడు. అప్పుడు నాదృష్టి మిసెస్ రయనామీద పడింది. వెంటనే మిస్ రస్తోగీపట్ల నాకు కలిగిన విరక్తి అంతా స్నేహంగా మారిపోయింది. యెందువల్లనంటే ప్లాస్టిక్ యుగప్రభావం వస్తునిర్మాణంలోనే కాదు, మిసెస్ రయనా యవ్వన ప్రదర్శనలో కూడా నాకు ప్రత్యక్షమయింది. యిది మరీ అసహ్యంగా తోచటానికి కారణం యేమిటంటే, యెంత తక్కువ లెక్కవేసినా ఆవిడ వయస్సు ముప్పై అయిదు సంవత్సరాలకు యేమీ తీసిపోదు. అంగుళం మందాన కొట్టిన పౌడరుకిందనుంచికూడా ఆమె కంటికిందనున్న ముడతలు సన్నని గీతల్లాగా కనిపిస్తూనే వున్నాయి. "మిస్ రస్తోగీ యెలావున్నా పరవాలేదు. ఆవిడ తనకోసం వరుణ్ణి వెతుక్కుంటుంది. కాని ముసలి దానికేమొచ్చింది పోయేకాలం. ఇంతకీ గమ్మత్తేమిటోతెలుసా? ఆడది వివాహం అయినతరువాతకూడా అలంకరణలో సింగారంలో వుపేక్షించ గూడదని విన్ననే నే నొక పుస్తకంలో చదివాను. ....

"మేమొక డ్రామా ఆడదల్చుకున్నాం. మీరుగూడా మాకు సాయం ఉంటారుగా మిష్టర్ రాజ్! మీరు చెప్పకూడదూ ఆమెతో?" అన్నది మిసెస్ రస్తోగీ.

"ఓహో! మీ రేదో హిందీనాటకమో సింధీ నాటకమో ఆడతారు. నేనేం సహాయంచేయగలను. మా ఆవిడన్నారూ బాగుంది! ఆవిడకు హిందీ బాగావచ్చు." అన్నారు మావారు.

"మీరు చెప్పేదేమిటో నాకే చెప్పండి. మావారిదంతా యింగ్లీషు పుటకలెండి" అన్నాను నవ్వుతూ.

"బలే ! బలే ! అహహహా" అని డాక్టర్ నిమోలియా నవ్వాడు. "ఏమోయ్, చదువుకున్న లేడీస్ యీ రోజుల్లో స్వదేశాన్ని నిందిస్తే భరించలేరోయి. దే లవ్ దెయిర్ కంట్రీ మోర్ దేన్ దెయిర్ హజ్ బెండ్స్."

"మంచిదేగా ! మావైపునండీ-హోషియార్‌పూర్‌లో-అంటే పంజాబులో ఆడవాళ్ళే రామాయణం, మహాభారతం చదివేవాళ్ళు. మహమ్మదీయులకాలంలోకూడా! అవునండీ, మొగవాళ్లు తమ మతంకూడా వదిలి పెట్టేశారు." అన్నాడు మిష్టర్ సక్‌సేనా.

ఆయన మాట్లాడుతుంటే విని హిందీకూడా నిజానికి యింగ్లీషు వంటిదేనని యింగ్లీషును ఒక్కొక్క-దేశంవాళ్లు ఒక్కొక్క రకంగా వుచ్చరించినట్లే హిందీనికూడా ఒక్కొక్క ప్రాంతంవాళ్ళు ఒక్కొక్క రకంగా వుచ్చరిస్తారని అనిపించింది నాకు. హిందీ యీవిధంగా వ్యాప్తి చెందటం నాకు బాగానే వుంది.

డాక్టరు నిమోలియా వుత్తరప్రదేశంవాడు. మిసెస్ రైనా మెల్లిగా నావైపు వంగి చెవిలో అడిగింది. "యీ డాక్టరు యే జాతివాడో మీరు చెప్పగలరా ?"

"చెప్పలేను" అన్నాను.

"మాదిగవాడు. యెలాంటిపేరు పెట్టుకున్నాడో చూడండి!" అని ఆమె నవ్వి మళ్ళీ అన్నది. "నీచజాతివాడు గదా అని గవర్నమెంటు యితనికి స్కాలర్‌షిప్ యిచ్చి చదివించింది" అని ఆవిడ చాలా తృప్తిగా నవ్వుకున్నది.

"ఒక నిమిషం, కొంచెం యిప్పుడే—" అని నిలబడింది. నేను కూడా లేచి నిల్చున్నాను. బేబికూడా లేచి నిల్చున్నది. నేను మిసెస్ రయనాకు బాత్‌రూమ్ చూపించటానికి వెళ్ళాను. బేబికూడా వచ్చింది. డాక్టర్ మెల్లిగా టీ త్రాగటం మొదలుపెట్టాడు. "చూశారా యీవిణ్ణి ! మిస్ రస్తోగీ, మీక్కూడా తెలుసుగదా !" అన్నాడు యింజనీయిర్ మెల్లిగా.

"పోనివ్వండి మనకెందుకు" అన్నది మిస్ రస్తోగీ.

"ఏమోయ్ రాజ్! యీ ఆడది సాధారణమైనది కాదు. శివపురిని శక్రట్రీ చేసింది యీవిడే. యీ వయస్సులోకూడా అంత శక్తి వున్నది. యీవిడ దగ్గిర" అన్నాడు సక్సేనా.

మిస్ రస్తోగి పళ్లు బయటపెట్టింది మళ్ళీ. అది ఆవిడ చిరునవ్వు. వెంటనే మళ్ళీ తన పమిట జారవేసి అన్నది. "యీ వయస్సులోకూడా ఆవిడ సింగారం చూడండి". మగవాళ్ళంతా "అవునవును" అన్నారు.

"ఏమైతేనేం, శివపురి శక్రటరీ అయ్యాడు. యెవరికి తెలుసు, యివన్నీ వట్టి పుకార్లేనేమో! యెందువల్లనంటే, యెవరైనా తొందరగా వృద్ధిలోకొస్తే చూసి అసూయపడటం న్యాచురల్ గదండీ! చూడండి, అసలు మన కంట్రీలో మోరల్ స్టాండర్డ్ వున్నదే అది యెప్పటిదో మాంధాతకాలంనాటిది." అన్నారు మావారు.

"నేనుకూడా వప్పుకుంటాను. చెప్పితే మీరు నమ్మరుగాని, అమెరికాలో సంఘం యెక్కడినుంచి యెక్కడికో వెళ్ళిపోయింది. యీ విషయాల్లో హిందూదేశమే అన్నిటికన్నా వెనకపడివుంది. నిజమండి, దీంట్లో సందేహమేమీ లేదు." అన్నాడు యింజనీయరు.

యీ మనిషి యిప్పుడేమన్నాడూ — యింతలోనే మళ్ళీ యేమంటున్నాడు! అనుకున్నాను నేను. మిస్ రసోగీ తన పమిటజార్చి అలాగే కూర్చున్నది. కాని, యిప్పు డెవ్వరూ ఆవైపు చూట్టంలేదు. యింతలో మిసెస్ రయినా తిరిగొచ్చింది. నే నావిడకుకూడా టీ కలిపి యిచ్చాను.

డాక్టర్ నిమోలియా కాల్చుకోవటానికి ఒక సిగరెట్ బయటికితీసి కేసు అందరిముందు పెట్టాడు. ఆడవాళ్ళు "థాంక్స్" అన్నారు. "మీరెవరూ తాగేటట్లులేరు. నేను తాగొచ్చా?" అని అడిగాడు.

"ఓ ష్యూర్! యిదుగో, గడిచిన సంవత్సరమే నేను స్విడ్జర్లాండ్ వెళ్ళాను. అక్కడికిపోయి చూస్తే, ఆడపిల్లలంతా సిగరెట్లు తాగుతారు. హిందూదేశంలో అది దురాచారమనుకోండి. యే దేశపు ఆచారాలు ఆ దేశానివి. సిగరెట్లవల్ల అంత పెద్ద నష్టం లేదనుకోండి. ఒకవిధంగా తాంబూలంకూడా అలాంటి అలవాటేగా." అన్నది మిసెస్ రయినా. మిస్ రస్తోగి మళ్ళా పమీట వేసుకుంది, మళ్ళీ అదేరకంగా అర్ధచంద్రుడు మేఘాలచాటునుంచి తొంగిచూస్తున్నట్లే. "యిదొక ఆచారం. అందాకా

యెందుకు? మిష్టర్ సక్సేనా యింత మోడరన్ గదా! యిటీవలే అమెరికా కూడా వెళ్ళొచ్చారు గదా, మిసెస్ సక్సేనా స్మోక్‌చేస్తే వారు వూరు కుంటారా? ఏం మిష్టర్ సక్సేనా, నేను చెప్పినది నిజమేనా?" అన్నది మిస్ రస్తోగి.

"నా సంగతి అలా వుంచండి. మా అంకు లొకాయ సున్నాడు ఐ సి యస్. యిప్పుడు రిటైర్ అయిపోయ్యాడనుకోండి. యింగ్లీషు వాళ్ళ రోజుల్లో తన పేరు సక్సేనా అని రాయకుండా 'శాక్సన్' అనే రాసేవాడు. పెళ్ళికూడా దొరసాన్నే చేసుకున్నాడు. కాని, ఆవిడ సిగరెట్ తాగు తుంటే ఆయనకూడా చూళ్ళేకపోయేవాడు. అవునండీ, ఒకొక్క దేశంలో ఒక్కొక్క కల్చర్. యెవడైనా యేంచేస్తాడు? యేమైనా యిండియా యిండియాయే. మన పాత కల్చర్‌కికూడా ఒక ట్రెడిషన్ వుంది గదండీ!" అన్నాడు మిష్టర్ సక్సేనా. నౌకరు మళ్ళీ టీ తీసు కొచ్చాడు.

టీ తాగటం అయిపోయి. మొగవాళ్లు వెళ్ళిపోతుంటే, మాఆయన వాళ్ళను పంపించటానికి గుమ్మందాకా వెళ్ళారు. అక్కడ వాళ్ల మాటల్లో పడిపోయారో లేక క్లబ్‌కి వెళ్ళిపోయారో తెలియదు. యింతలో మిసెస్ రయ్‌నాకు యేదో జ్ఞాపకంవచ్చినట్లుంది. "అరె! ఆ డాక్టరు వెళ్ళిపోయా డంటే, మళ్ళీ ఖం దిక్కడ దొరకదు. నేను తొందరగా యింటికెళ్ళి పోవాలి. మిస్ రస్తోగీ! కాస్త ఆయన్ని అపరూ!" అన్నది ఆవిడ.

"అలాగేనండి!" అని ఆవిడ బయటకు వెళ్ళగానే మిసెస్ రయినా నతో అన్నది. "యెందుకైనా మంచిది, కాస్త జాగ్రత్తగా వుండమ్మా! యీ పిల్లబుద్ధి మంచిదిగాదు. యిటీవల మీఆయనకోసం వల వన్ను తున్నది. దీని కిదే వృత్తి అయిపోయింది. పైగా, యేమంటుందో తెలుసా! "నే నొక గుదిబండ నెందుకు కట్టుకోవాలి? నే నసలు పెళ్ళే చేసుకోను, అంటుంది." యింతలో మిస్ రస్తోగి నవ్వుతూ వచ్చి "వెళ్ళండి, అంతా రెడీగా వున్నారు" అంది.

"అయితే నే వస్తాను. బై! బై! వదవే బేబీ! మీకు చాలా చాలా థాంక్స్! చాలా శ్రమిచ్చాను మీకు. మిస్ రస్తోగీ! కావటానికి నిమోలియా నీచజాతివాడైనా అతని బుద్ధిమాత్రం అలాంటిది కాదు.

మంచి పెద్దమనిషితరహా వుంది ఆయన దగ్గర. యివ్వాళ బస్సులో వెళ్ళాలిసొస్తుందేమో అనుకున్నాను. ఆ బాధ తప్పింది. అయినా మనదే ముంది. యీ రోజుల్లో పెద్ద పెద్ద ఐ. సి. యస్. లే బస్సుల్లో తిరుగుతూ వుంటారు." అని మిసెస్ రయనా యేదో గొప్పసంగతి చెప్పినట్లు, "యిహిహీ !" అంటూ పెద్దగా నవ్వింది. "వస్తాను మిసెస్ రాజ్ ! చీరియో !" అని వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళిపోయినతరవాత నేను కొంచెంసేపు అలా ఆలోచిస్తూ వుండిపోయాను. యెదురుగా మిస్ రస్తోగీ కూర్చున్నది. యిదేనన్నమాట మావారివెంటపడుతున్నది. నేను దీక్షగా దానివంక చూశాను.

చెల్లీ, నేను నిజంగా దానికంటె యేమీ తక్కువగాను. అయితే, యిది నా దౌర్బల్యమో, లేక స్త్రీస్వభావంలోని దౌర్బల్యమో తెలియదు కాని, నాకంటె తక్కువ అందగత్తె అని నే ననుకుంటున్నా. యీ స్త్రీని చూచికూడా భయంవేస్తోంది నాకు. పురుషుణ్ణి బంధించి వుంచటానికి రూపము, సౌందర్యము తప్ప స్త్రీలకు మరేమీ తెలియదా ? యెందుకనో నాకు మనసులో ఒకరకమైన బాధ కలిగింది.

మిస్ రస్తోగీ బల్లమీదపెట్టివున్న మాఆయన సిగరెట్టు ప్యాకెట్టులోని ఒక సిగరెట్టు తీసి నోటిలో పెట్టుకుంటూ అన్నది. "వెధవ గొడవ! వాళ్ళముందు తాగలేకపోయాను. కాలేజీ హాస్టలులోకూడా రహస్యంగా తాగేదాన్ని నేను. మగవాళ్ళే యెందుకు తాగాలి? మన మెందుకు తాగకూడదు ? సమత గిమత అని పెద్ద పెద్ద కబుర్లు చెప్పుతారు మళ్ళీ. యీ మిసెస్ రయనా చాలా బాక్ వర్డ్. చూశారుగా, నిమోలియాచేత పనులు చేయించుకుంటుంది, కాని, వాడి జాతిని తిడుతుంటుంది. తన లోపాలు తనకు తెలియవు. దీని ప్రదర్శిని శక్రట్రీ చేసినవాడెవడో తెలుసా మీకు ? మాదిగవాడుకూడా కాదు. అదోరకం పాకీవాడు. యీ రోజుల్లో యేముంది, మాలవాళ్లు మాదిగవాళ్లు అంతా మినిష్టర్లే! వాడిది చాలా నీచపు బుద్ధి. కొన్ని విషయాల్లో యీ నిమోలియాకూడా నీచుడే. ఒక రోజున వీడేమన్నాడో తెలుసా !" మిస్ రస్తోగీ పొగ వదుల్తూ అన్నది. "నేను బాత్ రూమ్ లో వున్నాను, యీ నక్సేనా యింట్లోనే, వీడికి నేనున్నసంగతి తెలియదు. 'యీ పైజాతులవాళ్లు మామీద దౌర్జన్యంచేశారు. యీ దౌర్జ

న్యాన్ని మేము మరచిపోయేటట్లు చేయాలంటే పై జాతుల స్త్రీలంతా మా జాతివాళ్ళని వివాహంచేసుకోవాలి." అన్నాడు. నాకు మండుకొచ్చింది. ఓరి తుచ్ఛుడా ! నీలాంటివాళ్ళని మేము పెళ్ళిచేసుకోవాలా అను కున్నాను."

మిస్ రస్తోగి మళ్ళీ పొగపీల్చి వుంగరాలు వుంగరాలుగా వదుల్తూ అన్నది, "ఈ యింజనీరు కొంచెం పెద్దమనిషే ! కాని డబ్బులదగ్గర కొంచెం కక్కుర్తి. చెయ్యిజాపే అలవాటుంది. యిటీవలే యాంటీకరప్షన్ వాళ్లు పట్టుకున్నారుకూడా! యెలాగో తప్పించుకున్నాడు. యాంటీ కరప్షన్ వాళ్ళకు యాభైవేలు లంచమిచ్చాడని చెబుతారు. పాపం పుణ్యం ఎవరికి తెలుసు. అయినా మనకెందుకు ? సొసైటీని బాగుచెయ్యడమే మనపని. మీరు మా సోషల్ వెల్ ఫేర్ సెంటర్ చూశారుగా !"

"ఏదీ ! మీరు తీసుకెళ్ళితే చూస్తాను." అన్నాను.

"అయితే పదండి యిప్పుడే"

"రెండు నిమిషాలు టైం కావాలి"

"అలాగలాగే ! ఆడవాళ్లు రెడీకావాలంటే యెట్లాగైనా కొంచెం టైంపడుతుంది." నేను లేచి బట్టలు మార్చుకోవటానికి వెళ్ళాను. మిస్ రస్తోగికూడా లేచి నావెంటగుమ్మందాకావచ్చి అన్నది."యిప్పుడు చూడండి మనం నిమిషాలమీద రెడీఅయిపోతున్నాం. కాని, పురాతనకాలంలో మీకు తెలిసేవుండొచ్చు. పురాతనకాలంలో ఈజిప్టులోనూ రోంలోనూ ఆడవాళ్ళు ప్రొద్దున్నే లేచి ముఖాలకు సున్నం పూసుకుని కూర్చునేవాళ్లు. సాయంత్రందాకా అలా కూర్చుంటే అప్పటికి వాళ్ళమొహాలు కొంచెం తెల్లబడేవట. యిప్పుడేముంది ? కొంచెం పౌడరు రాశామంటే చాలు — సరేగాని, మిసెస్ రాజ్, పురాణాలకాలంలో మన దేశంలోని ఆడవాళ్లు వక్షములమీద యేమీ ధరించేవాళ్లు కాదన్నమాట నిజమేనా ? అజంతా బొమ్మల్లోకూడా చూడరాదూ, నడుములపైన అన లేమీ వుండదే! బలే— యెలాంటికాలం నేటి అమెరికాకూడా అంత ముందుకి పోలేదే!"

నేను చీర మార్చుకుని నిమిషంలో వచ్చేస్తున్నానన్నాను.

"కానివ్వండి, అంత తొందరేముంది ? నిదానంగానే కానివ్వండి. ఏదీ, మీ కసలు రెండు నిముషాలుకూడా పట్టలేదే !" అని అన్న దామె.

నేను నౌకరు కేవో చెప్పవలసినవి చెప్పి, ఆవిడవెంట బయలుదేరాను. బస్‌స్టాండ్ దగ్గర పెద్ద క్యూ నిలబడివుంది. "అటెక్కడికండీ ! ఆటో రిక్షామీద వెళ్ళిపోదాం. యిదివరకు నేను టాక్సీమీదే వెళ్ళేదాన్ని. కాని ఈమధ్య కొంతమంది పత్రికల చరిత్రులు గవర్నమెంటు డబ్బంతా కార్ల కోసం, టాక్సీలకోసం ఖర్చైపోతున్నదని రాశారు. మీరే చెప్పండి ప్రొద్దున్నుంచి సాయంత్రందాకా పనిచేసి, పైగా కాలినడకను యెక్కడి కెళ్ళగలం ? యిలా మైళ్ళకొద్దీ యెవడైనా నడవగలడా ? మినిష్టరు నడుస్తారా చెప్పండి పోనీ !" అన్నది ఆమె.

మేము ఆటోరిక్షా దిగి సాంఘికసంక్షేమ కేంద్రానికి వెళ్ళేటప్పటికి అక్కడ ముగ్గురు వ్యక్తులున్నారు. ఒకావిడ వృద్ధురాలు. ముఖంమీద హుందాతనం కనుపిస్తున్నది. తెల్లటి ఖద్దరుబట్టలు కట్టుకున్నది. ఆమె కీర్తిశేషులైన సర్ రామదాసుగారి ధర్మపత్ని. తెల్లవాళ్ళ రాజ్యంలో ఆయనకు చాలా పలుకుబడి ఉండేది. చాలా డబ్బుగలవాడు కూడాను. లేడీదాసు ఆ రోజుల్లోకూడా దేశభక్తురాలే. కాంగ్రెసువాళ్ళకు అప్పుడు కూడా డబ్బిస్తూవుండేవి.. భర్త పోయింతరువాత ఖద్దరుకట్టటం మొదలు పెట్టింది. యిప్పుడసలు సంఘసేవలోనే మునిగితేలుతూ వుంటుంది. చాల తక్కువగా మాట్లాడుతుంది ఆమె. రెండవ ఆవిడ నడికారు. విలువ కలిగిన ఖద్దరు పట్టుచీర కట్టుకొని మమ్మలను చూడగానే "రమా, నీవు చాలా ఆలస్యంగా వచ్చా" వన్నది.

"మిసెస్ రాజ్‌ని తీసుకొచ్చాను. నన్ను మీరు కంగ్రాచ్యులేట్ చెయ్యాలి. నేను చెప్పగానే వచ్చేశారు. యెంత యిన్‌ట్రస్టో చూశారా !" అన్నది మిస్ ర గీ.

"పిల్లలు లేరనుకుంటాను" అన్నది వృద్ధురాలు నావంక దీక్షగా చూస్తూ. నాకు కష్టంతోచింది. కాని పెద్దవాళ్ళనేమీ అనకూడదని వూరుకున్నాను. ఆ నడికారు ఆవిడ అన్నది. "యిప్పుడేముంది, అంతా వస్తామంటారు. కాని, ఆ యింగ్లీషువాళ్ళరాజ్యంలో మేము లాటీ దెబ్బలు తింటున్న రోజుల్లో యెవరూ ముందుకొచ్చినవాళ్లుకారు." అని ఆవిడ గర్వంగా వృద్ధురాలివంక చూసింది. కఠినంగా కనుపించే వృద్ధురాలి

ముఖం మరింత కఠినమైపోయింది. "శ్రీమతి తారాదేవీ ! మీరు రపతో చెప్పారా ?" అని అడిగింది. "లేదండి, చెప్తాను" అన్నది తారాదేవి.

ఆ మూడో వ్యక్తి పురుషుడు. జుబ్బాలాల్చీ వేసుకున్నాడు. చిన్న పిల్లిగెడ్డం. ఫ్రెంచ్ కట్ మీసాలు. చికిలిస్తున్న కళ్ళు. వాటిపైన కళ్ళజోడొకటి. లక్స్ సబ్బులాగా మనిషి సున్నగా మెత్తగా ఉన్నాడు. తూచి తూచి మాట్లాడతాడు, నోటినుంచి ముత్యాలురాల్తాయేమో; లేక వారు పలికిన ప్రతిశబ్దం చరిత్రలో సువర్ణాక్షరాలతో రాస్తారేమో; అని జాగ్రత్త పడుతున్నట్లుగా. ఆయనొక రచయితట ! మిస్ రస్తోగిని చూచి, అతి మృదువుగా నవ్వుతూ "మీ ఫోన్ మెసేజ్ నాకు చేరిందిలెండి." అన్నాడు.

మిస్ రస్తోగి నన్ను అతనికూడా పరిచయంచేసింది. "చాలా గొప్ప రచయిత. మేం ఈయనరాసిన డ్రామాయే ఆడబోతున్నాం.-ఈమె మిసెస్ రాజ్."

ఆయన నాకు నమస్కారంచేశాడు — నే నేదో ఉపకారభావంతో కృంగిపోయేలాగా. "నేనుకూడా నమస్కారంచేస్తూ అదేవిధమైన భారత్ బ్లేడులాంటి చిరునవ్వుతో ఆ ఉపకారభావాన్ని కోసి అవతల పారవేశాను. ఆయన చాలా కళాపూర్ణమైన దృష్టితో నావంక గుచ్చిగుచ్చి చూశాడు. నేనుకూడా ఏ తాజమహల్ నో, హుమాయూంసమాధినో చూసినట్లు ఆయన వంక ఆశ్చర్యంగా ఆదరపూర్వకంగా చూశాను.

పోనిస్తూ ఈ వర్ణనంతా నీకు రాయడమెందుకు ? చెప్పొచ్చిందేమిటంటే, వాళ్ళేదో డ్రామా ఆడుతున్నారు. కరువుతో బాధపడేవారికోసం ఏదో నిధి పోగుచేస్తున్నారట. దానికోసం సంగీతకేంద్రంలో కొంతమంది ఆడపిల్లలు శిక్షణపొందుతున్నారట. వాళ్ళుకూడా దీనికి సహకరిస్తున్నారట. చిక్కెక్కడ వచ్చిందంటే, వాళ్ళకు నాట్యంవచ్చిన హీరోయిన్ కావలసివచ్చింది. నన్నడిగారు. చాలా ప్రాధేయపడి అడిగారు. చివరకు నేను ఒప్పుకొన్నాను.

ఇంటికొచ్చి చూస్తే ఆయననోటినుంచి సన్నగా మద్యంవాసన కొడుతున్నది. చూడగానే కనిపెట్టేశాను నేను.

"తాగివచ్చారా ?" అన్నాను.

"నువ్వుకూడా మా నాయనమ్మలాగా మాట్లాడుతున్నావేమిటి ? ఈ మాడర్న్ యేజ్‌లో ఆడపిల్లలుకూడా తాగుతున్నారు. సొసయిటీలో ఉన్నప్పుడు ఇలాంటివన్నీ చేయవలసిందే. లేకపోతే, అంతా మనను అన్ కల్చర్డ్ అనుకొంటారు. ఇవాళ నన్ను సెక్రెటరీకి పరిచయంచేసింది మిసెస్ రైనా. లోకు లేమన్నా అనుకోనీ, ఆవిడమాత్రం నా దృష్టిలో మహా యోగ్యురాలు." అన్నా రాయన.

"రమా రస్తోగీ నడగండి, ఆవిడగురించి ఏమి చెబుతుందో !" అన్నాను.

"పిల్లకాకి కేంతెలుసు ఉండేలుదెబ్బ!" అన్నా రాయన అతి నిర్లక్ష్యంగా. నాకు ఒళ్ళంతా మండుకొచ్చింది. చెల్లీ! నిజంగా మనం ఎక్కడున్నాం ?

అయన ఇంకా అన్నారు—"మిసెస్ రైనా నిన్నుకూడా చాలా పొగిడింది తన కజిన్‌దగ్గర. "చాలా మంచిపిల్ల. చూడడానికి ఎంత అందంగా ఉంటుందో, స్వభావం అంతకన్నా మంచిదిలా కనుపిస్తోంది," అన్నది. నీమీద చాలా గురికుదిరింది ఆవిడకు. నేను చూశానుగా, సెక్రెటరీ ఆవిడ ఎలా చెబితే అలా వింటాడు. మిసెస్ రైనా హజ్బెండ్ ఆర్మీలో కర్నల్‌గా ఉన్నాడట. చాలా మర్యాదగలవాళ్ళు. ఇటువంటివాళ్ల స్నేహం అందరికీ లభించదు. వాళ్ళతో పోల్చిచూస్తే మన మెక్కడ ? మనకి అంతా కలిపినా 7-8 వందలు రాదు. వాళ్ళను చూస్తేనో—రాజభోగాలే ననుకో. ఒక్కముక్కలో చెప్పాలంటే - దే లివ్! వీ ఎగ్జిస్ట్! "మిస్టర్ రాజ్ ! మీ ఇల్లు చాలా చక్కగా అలంకరించారు," అని ఆవిడ అన్నది. నేను వెంటనే 'నా వైఫ్‌కి గృహాలంకరణమంటే చాలా సరదా. ఇంగ్లండ్‌నుంచికూడా పుస్తకాలు తెప్పించి చదువుతూ ఉంటుంది, అని అబద్ధమే ఆడేశాను. ఆమె "భేష్! మనదేశంలో ఇటువంటి ఆడవాళ్లు చాలా తక్కువ. నాతమ్ముడికూడా ఇటువంటిపిల్ల దొరికి, ఇల్లంతా కలకలలాడుతూఉంటే బాగుండును" అన్నది.

ఆయన ఇంకా ఏమిటేమిటో మాట్లాడుతూనే ఉన్నారు. నాకు నిద్ర పట్టేసింది.

ఇప్పటికి దీనితో కట్టిపెడతాను. నేను డ్యాన్సు రిహార్సలుకి వెళ్ళే టైమయింది. నాట్యం-ఈత-సైకిల్ ఇలాంటివి ఒక్కసారి నేర్చుకొన్నాక బ్రతికిఉన్నంతకాలం మరిచిపోమనుకో. అయినా అభ్యాసం లేకపోతే నైపుణ్యం ఉండదు. ఈసారి డ్యాన్సునుగురించి అంతా నేనే ఆలోచిస్తు న్నాను. అప్పుడే చాలావరకు ఆలోచించాను కూడా.

ఇక నేను వేసుకొన్నప్లానుకి మార్గం ఏర్పడుతున్నది. ఆడవాళ్ళం దరినీ కూడగట్టుకొనిరావాలి చెల్లీ ! ఈ దేశం నిద్రనుంచి మేల్కొంటు న్నది. అయితే, దీనిని పూర్తిగా మేల్కొల్పవలసిఉంది. నీకు తీరిక దొరికినప్పుడే - నెమ్మదిగా తాపీగా జవాబిస్తావని నాకు తెలుసు. అయితే నా కొక మార్గం దొరికినందుకు నీవుకూడా చాలా సంతోషిస్తావనికూడా నాకు తెలుసు. నా కేదన్నా అనుమానముందంటే అది ఆ రమా రస్తోగిని గురించే. మావారికి అదంటే ఏదో ఆకర్షణ ఉన్నమాట నిజమే. నీతో నే నేమని చెప్పుకునేది. ఈ ఆలోచన కలగ్గానే నాకు తేలుకుట్టినట్లు బాధ కలుగుతోంది.

నీ సుశీల.

# 4

ప్రియమైన సోదరీ,

ఒకటేమో నీ ఉత్తరమే ఆలస్యంగా వచ్చింది. రెండవది; నాక్కూడా ఈమధ్య బొత్తిగా తీరికలేకపోయింది. అందువల్ల నీకు జవాబు రాయటానికి ఇంత ఆలస్యమయింది. నన్ను క్షమిస్తావుగదూ. చిన్నతనంలోకూడా నేను నీపట్ల అపచారాలు చేస్తూఉండేదాన్ని. నీకు కోపంవచ్చినప్పుడు కొన్నాళ్ల మాట్లాడటం మానేసేదానివి. కాని, నేను నీ ఎదుటబడి ఒక్కసారి బ్రతిమాలితే చాలు—ఫక్కున నవ్వేసేదానివి. ఇవాళ నేను నీదగ్గరకొచ్చి బ్రతిమాలలేను. అయినా నీవు నన్ను క్షమిస్తా వని నాకు తెలుసు.

నీకు తీరికలేకపోయింది గదూ - అందుచేతే నీ ఉత్తరంకూడా

ఏదో చప్పచప్పగా ఉంది. ఆ ఉత్తరం రాసేటప్పుడు నీకేదో చాలావిసుగ్గా ఉండిఉండాలి. అంతేనా? నీకు నామీద ఇలాంటి విరక్తి ఎందుకు కలిగిందో చెప్పు. నా ఉత్తరం చూసి, మీ డాక్టరుగారు 'నాకేమీ పనీ పాటా లేనట్టున్న'దని అన్నారని రాశావు. వారన్నది నిజమే. అయితే కాలేజి రోజులనుంచి కూడా నాకు కథలురాయటమంటే సరదా అని నీవు బావగారికి చెప్పలేదా? బాగా రాయగలిగేవాళ్లు ఎలాంటివాళ్లోఅని అప్పుడప్పుడు అనుకుంటూ ఉంటాను. ఏదీ, రాయడం నా చేతకావటంలేదే ? ఇప్పుడిక మన ఓపికంతా ఈ ఉత్తరాలకు పనికొస్తున్నది. ఇదికూడా నీవు చదివి ఆనందించగలిగేటంత మంచిదేంకాదు. అయినా నా సొదఅంతా భరించేవాళ్ళెవరున్నారు ? నువ్వొకదానివి ఉన్నావు. స్నేహితురాలివి గనుక, భరించొచ్చు. జ్ఞాపకంఉందిగదూ ! కాలేజీలో ఉండగా నేనొక కథ రాశాను. అది నిన్ను వినమని బలవంతంచేస్తే నీవు ఒకపేకెట్ చాక్లెట్లు లంచం తీసుకుని అప్పుడు విన్నావు. విని "ఫర్వాలేదు. ప్రయత్నిస్తూ ఉండు. ఎప్పటికైనా రాయగలవేమో" అన్నావు. ఆరోజున నాకెంత ఏడుపొచ్చిందో! ఇవాళకూడా అది తలుచుకుంటే బాధకలుగుతుంది. భగవంతుడు నాకు రచనాశక్తి ఇవ్వకపోవటంలో అన్యాయంచేశా డనిపిస్తుంది. అయితే చెల్లీ! పూర్వం నాకు రచయితలంటే ఉండేదే. ఆ పూజ్యభావం ఇప్పుడు లేదు. ఎందువల్ల అలా జరిగిందో చెబుతాను విను.

నాటకంవెయ్యబోతున్నామని నేను నీకు రాశానుగదూ? ఆనాటకం వేశాం. దాంట్లో నాకు మంచి పేరొచ్చింది. నా ఫొటో ఇంగ్లీషు పేపర్లలో అచ్చువేశారు. అదిచూసి నేను ఎంత పొంగిపోయానో! నాకే ఇలా ఉంటే, పేపర్లలో రోజూ ఫొటోలు అచ్చుబడుతుంటయ్యే. వాళ్ళ మనసులు ఎలా ఉంటాయో ? సరే, ఎవరెవరి అదృష్టం వాళ్ళది.

జరిగిన దేమిటంటే: రమా రస్తోగి నన్ను రోజూ తీసుకువెళ్ళి రిహార్సలు నిమిత్తం ఇతర వేషధారులవద్ద వదిలిపెట్టేది. ఒకరోజున డ్యాన్సు అయ్యాక నేను గజ్జెలు విప్పబోతూఉండగా ఆ కవి మహాశయుడొచ్చి 'ఉండండి. నేను విప్పదీస్తా'నని నా కాళ్ళవైపు చేతులు జాచాడు. నేను క్రిందకు చూసేసరికి ఆయనగడ్డంమీద వెంట్రుకలు తెల్లగా కను

పించాయి. 'మీరు పెద్దవాళ్ళు. నా కాళ్లు ముట్టుకోవడం ఏమంతబాగుంటుం దండీ!' అన్నాను.

అందరిలోనూ తన ప్రత్యేకత చాటుకోవడానికీ, ఇంకా ఎక్కువ రొమాంటిక్‌గా కనుపించటానికీ, ఆ కోడిపిట్ట తోకలాంటి గడ్డం ఆయన పెంచుకుంటే దాని తెల్లదనాన్ని గుర్తుకుతెచ్చి, ఆయన పెద్దరికాన్ని కాపాడుకోమని నేను సలహాఇచ్చాను. మనిషి నిలువునా నీరైపోయా డంటే నమ్మ.

నాముఖంవంక గుచ్చిగుచ్చి చూస్తూ "నేనంత ముసలివాణ్ణని ఫీల్ కావటంలేదే!" అన్నా డా మహాశయుడు.

'మీరు ముసలివాళ్ళని నే నెప్పుడన్నాను. పెద్దవాళ్ళనిమాత్రం అన్నాను. అన్నంతమాత్రాన మీరు పెద్దవాళ్లు కాదనుకోండి. అయినా ముసలితనం దేముంది? హిందీ రచయితల బాధలు ఎవరెరుగరు గనుక. అయినా ఈ దినదినగండపు బ్రతుకుమీద మీకు విసుగుపుట్టటంలా ? మీ పిల్లాజెల్లా ...."

"నా కింకా పెళ్ళికాలేదు." అని ఆయన కొంచెం తీక్షదృష్టితో నావంకచూస్తూ—'పెళ్ళినిగురించి నాకు కొన్ని స్వతంత్రమైన అభిప్రాయా లున్న'వని అన్నాడు.

నాకు కొంచెం మండుకొచ్చింది. 'అంటే పెళ్ళికాలేదా, చేసుకో లేదా?' అని అడిగాను.

ఆయన కొంచెం ఆవేశంగా, కొంచెం అసహ్యంతో పెదవులు ముడుచుకొని నన్నుచూస్తూ అన్నాడు, "ఆడది, అందులోనూ ముఖ్యంగా బూర్జువావర్గానికి చెందినది డబ్బు కావాలంటుంది."

'నిజమే, బూర్జువావర్గంలో అంతా ఆడవాళ్ళే. మగవాళ్ళంతా ప్రోలిటేరియట్లేగదూ!' అన్నాను.

ఆయన సిగ్గుపడుతున్నట్లు నవ్వాడు."మీరే ఆలోచించండి. మీ చెల్లెలే ఉందనుకోండి. ఒక దరిద్రుణ్ణి కట్టుకొని బ్రతికినంతకాలం ఉప వాసాలుచెయ్యటానికి సిద్ధపడుతుందా?" అని అడిగాను.

"నేను వారానికొకసారే తింటానని, మిగిలినప్పుడు వాయు భక్షణమేనని మీ రెందుకనుకోవాలి?" అని అడిగా డాయన.

"భగవంతుని దయవల్ల అలాంటిస్థితి రాకుండానే ఉండాలి. మిమ్మల్ని చూస్తే మీరు రెండుమూడు గంటలకంటే అకలిని తట్టుకో గలిగినట్లు కనుపించటంలేదు." అన్నాను. ఆయన నవ్వాడు—నేనూ నవ్వాను.

"మీ డ్యాన్సు చాలా బాగుంటుంది. నే నొక సాంస్కృతిక ప్రతి నిధిమండలితో వెళ్తున్నాను. మేం యూరోప్ వెళ్తున్నాం. నేను మిగత ఆర్టిస్టులపేర్లు ఏరి ఇవ్వవలసిఉంది—మీరుకూడా వస్తారా మావెంట?"

"మావారి సడగందే నే నెలాచెప్పను ?"

"మీ కామాత్రం స్వాతంత్ర్యం ఉంటుందనుకొన్నానే! అంతేలెండి. భారతదేశపు ఆడవాళ్ళే అంత. ఆ గీచినగిరి దాటి బయటకు రాలేరు. ఎటొచ్చీ వాళ్లు బ్రదుకుతెరువుకోసం భర్తమీద ఆధారపడవలసినవాళ్ళే గదా? అందుకనేగదా ఒక అపరిచితపు పురుషుణ్ణి వాళ్లు తమ సర్వస్వ మనేది ?"

ఇది వినగానే నాకు చర్రున మండుకొచ్చింది. "హద్దూపద్దూ లేకుండా ప్రవర్తించటమే స్వాతంత్ర్యమైతే మీ రిలాంటి ఉపదేశాలు మీ అక్కచెల్లెళ్ళకు నూరిపొయ్యండి." అన్నాను తీక్షంగా.

నేను నా గజ్జెల పట్టాలు విప్పేసి నిలుచున్నాను. ఆయన చాలా నమ్రతగా—"మీకు కోపం తెప్పించాను. నే నసలు మీ కొక విషయం విన్నవించాలని వచ్చాను." అన్నాడు.

అతని నమ్రత చూచి నేను కూడా—"ఏమిటో చెప్పండి." అన్నాను.

'చూడండి, మీరు ఆడబోతున్నారే—అది నే రాసిన నాటకం. అది ఆడటం కొంతమంది రచయితలకు కంటకంగా ఉంది. అందువల్ల వారు దానిని ఆపించాలని చూస్తున్నారు. నా నాటకం ఆడటం మానేస్తే ప్రభుత్వ వర్గంలో నాకు పలుకుబడి లేకుండాపోతుంది. నే నిక ముందుకుపోలేనని వారి ఉద్దేశ్యం," అన్నా డాయన.

"అయితే నే నేంచేసేది." అని అడిగాను.

"మీరా! ఏంచెయ్యాలన్నా చేయగలరు. హిందీలో అసలు మంచి నాటకా లెక్కడున్నయ్. ఉన్న నాటకరచయితల్లో నే నొకణ్ణే మంచివాణ్ణి.

మీకు సాహిత్యంలో బాగా పరిచయముంది కాబట్టి, ఇది మీకు తెలిసే ఉంటుంది. ఈనాటకానికి మీరు హీరోయినే. మీరు మొండికేసి,'నాటకం పోర్షనంతా భట్టీ పెట్టేశాను. ఇలా మాటిమాటికీ మారుస్తుంటే నావల్ల కా'దని అన్నారంటే, వాళ్లు చచ్చినట్లు ఒప్పుకొనితీరాలి. ఎందువల్ల నంటే, మరో హీరోయిన్ను వెదకటానికి వ్యవధిలేదు." అన్నా డాయన.

అంటూ ఆ ఏకాంతంలో నా కాళ్లుపట్టున్నాడు. ఇంతలో నాకు గుమ్మంవద్ద లేడీ దాస్ నీడబడ్డట్లు తోచింది. కాళ్లు వెనక్కు లాక్కొ న్నాను. "మీరు ఒక్కమాట చెబుతే చాలు— నాకు ప్రాణంపోసినవాళ్ళౌ తారు. మీకు నాయందు దయకలగకపోతే, నేనేంచేస్తానో నాకే తెలీదు." అని అతను వాపోతూనేఉన్నాడు.

ఇన్నాళ్ళదాకా అంత గంభీరంగా ఉన్న ఆ రచయిత ఇతనేనా— అనుకొన్నాను. వీడు నా కాళ్లు పట్టుకోవటం లేడీ దాసుకంటబడిందంటే ఏమనుకుంటుందోనని భయంకూడావేసింది.

ఇంతలో రమా రస్తోగీ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చింది. "అరె! నువ్వు రెడీఅయిపోయావా? మంచిపనిచేశావు సుశీ—ఇవాళ ఏం నాటకమాడాలో నిశ్చయించుకోవాలి." అని మళ్ళీ గొంతు కొంచెంతగ్గించి ఇలా అన్నది. "నాటకమేమో ఇదే మంచిది. కాని ఆ లేడీ దాస్ ఉన్నది చూడూ, ఆవిడకు వీరనిచూస్తే సరిపడదు. ఆవిడకు ఈ నాటకమాడటం ఇష్టంలేదు. ఆవిడ స్నేహితురాలెవరో ఉందట. ఆవిడగారి అన్నకొడు కెవరో ఒకనాటకం రాశాడట. అది ఆడాలని ఉం దామెకు."

'ఆవిడ మనమీద అధికారం చలాయించాలని చూస్తున్నది. కాని రచయిత ఎవరికీ బానిసకాడు. నన్ను నేను అంత చవుకచేసుకోలేను. అధికారమదం అంటే ఇదే, మిసెస్ రాజ్! నేను ఒకరికాళ్లు పట్టుకొనే వాణ్ణికాదు" అన్నాడు రచయిత మహాశయుడు. నేను నిర్ఘాంతపోయాను.

రమ అన్నది—"సుశీ! ఈ నాటకమే జరిగిపోవాలి. నువ్వుకూడా బలపరచు. ఈ ముసలిది తెల్లదొరతనానికి అలవాటుపడిందనీ, కాంగ్రెసు లోని ఆడవాళ్ళంటే చాలా నీచంగా చూస్తుందనీ, తన అధికారం చలా యించటానికీ, అన్నిటికీ అడ్డుతగులుతూ ఉంటుందనీ, మిగిలినవాళ్ళలా

పోయినా ఏమీ లెక్కచేయదనీ, తారాదేవికి నేను బాగా నూరిపోశానులే. నామాటలు తారాదేవికి బాగా నాటుకున్నాయి. 'కానీ, దీనిహాజం ఏమిటో నేకూడా చూస్తాను. ఇలాంటివాళ్ళనుగురించే కదా....మనం తెల్లవాళ్ళ తొత్తులు నశించాలి అని కేకలువేశాం. లాఠీదెబ్బలు తిన్నాం-మనం. ఈ ముసలిది ఎక్కువగా గొడవచేసిందంటే నేను ఆర్టిస్టులచేత చెప్పిస్తాను. ఈ ముసలిది చేసిందేమిటి ? కాంగ్రెస్‌వాళ్ళకు డబ్బిచ్చింది. అంతేనా ? దేశసేవనుబట్టి చూస్తే అసలు నాకూ దానికీ పోలికేమిటి ? దీనికి సలాములుకొట్టి చెప్పినట్టెల్లా చేయటానికి నాకంటే ఇదేంగొప్పని." అని ఎగిరిపడింది.' అని చెప్పి, రమ మళ్ళీ అన్నది—"చెప్పు సుశీ :— నీ అభిప్రాయం ఏమిటి? నేను నిన్ను ఇక్కడికి తీసుకొచ్చి హీరోయిన్ని చేసింది, నీ కేదో ఉపకారంచేద్దామని కాదు. నీవు దీనికి తగినదానివనే. దీనివల్ల ఇక్కడివాళ్ళకు కొంతమందికి నామీద ఆగ్రహంకూడా వచ్చింది. ఇపుడిక వ్యవధి ఎక్కువలేదు. నువ్వు వెనక్కు తగ్గకుండా ఉంటే, తారాదేవి నిన్నడ్డంపెట్టుకుని ఈ ముసలిదాని అధికారపు టుచ్చుల్ని త్రెంచి పారవేస్తుంది. లేకపోతే మెల్లగా నన్నుకూడా సాగనంపేస్తారు. నువ్వు అమాయికురాలవు. ఇక్కడ ఎన్ని ఎత్తులు ఎత్తితే మా పొట్ట గడుస్తుందో నీకేం తెలుసు? సిన్సియర్‌గా ఉంటే ఇక్కడేపనీ జరుగదు. ఎవరికి వాళ్లు ఎలాగోలా ముందుకు పోవాలని చూస్తుంటారు. మాకీ ఉపకారంచేసి పెట్టాలి నువ్వు. నువ్వూ నేనూ వీరూ కలసి ఒక టీంగా ఏర్పడదాం. కల్చరల్ డెలిగేషన్‌లో వెళ్ళి హాయిగా తిరిగివద్దాం. మంచి పేరొస్తుంది. అది అలా ఉంచు. ఇంతవరకు నీకున్న పేరు ప్రతిష్టలు, హోదా అన్నీ నీ భర్తద్వారానే. ఇకముందు నీ కొక ప్రత్యేక వ్యక్తిత్వం ఏర్పడుతుంది. ఈ రోజుల్లో కేవలం ప్రతిభనూ, పరిశ్రమనూ విశ్వాసాలనూ పట్టుకొని వేలాడుతూ కూర్చుంటే పనిజరగదు. ఏమంటావు ?"

"నే చెప్పవలసింది చెబుతాను. కాని నన్నెవరన్నా అడిగితే గదా చెప్పేది ?" అన్నాను.

రమ సంతోషంగా వెళ్ళిపోయింది. రచయిత మహాశయుడు కృతజ్ఞతతో నావంకచూసి వెళ్ళిపోయాడు.

చివరి కెలాగైతేనేం, ఆ నాటకమే ఆడాలనుకొన్నారు. నా సలహా

ప్రకారమే జరిగింది. లేడీ దాస్ కొంచెం నణిగింది. కాని, చేసేదేముంది? రమవెళ్ళి మినిష్టరును కలుసుకొచ్చింది. పాపం! ఆయన కేంతెలుసు? రమ ఊదరకొట్టేటప్పటికి చేసేదిలేక సెక్రటరీని అడిగాడు. సెక్రటరీ రమను పొగిడాడు. ఎందువల్ల పొగిడాడో తెలియలేదు. నేను రమను అడిగాను. ఆమె ముందు కొంచెం సిగ్గుపడింది.—"ఏమీలేదు. కాలం మారుతున్నది. ఇక ఆ పాత అన్యాయాలు సాగవు" అన్నది. రమకు డెలిగేషనుతో వెళ్ళాలనే పిచ్చ బాగా పట్టుకొన్నది.

నాటకం ఏర్పాట్లన్నీ అయ్యాయి. టిక్కెట్లుకూడా అమ్మేశారు. రమ ఈ విషయంలో చాలా శ్రమపడింది.

నేను గ్రీన్‌రూంలో మేకప్‌చేసుకుంటూఉండగా కవి మహాశయులు దయచేశారు. "మీకోసం నేను ఏం చేయమన్నా చేసిపెడతాను. మీ మేలు ఎన్నటికీ మరువలేను. మీరే నా పరువు నిలబెట్టారు. రమ కూడా చాలా శ్రమపడిందనుకోండి. నిజానికి సెక్రటరీని మన పక్షాన ఉండేట్టుచేసిందికూడా ఆవిడే...."

"ఏం? ఏంచేసిందేమిటి?" అని అడిగాను.

"సెక్రటరీకి హిందీ రాదని మీకు తెలుసుగా? వెళ్ళి ప్రసాద్ రాసిన నాటకం ఒకటి రెండు మూడు పేజీలు వినిపించింది. వెంటనే సెక్రటరీ "ఇది ఎవడికి అర్థమౌతుంది" అన్నాడు. రమ అదనుచూసి, "ఇదిగో ఇలాంటి నాటకమే ఏరారు వాళ్ళు. అదంతా ప్యూర్ హిందీ కావాలనే ముఠా. ప్రజలకర్థమైతే వాళ్ళకేం—కాకపోతే వాళ్ళకేం?" అన్నది. "సరే నేను మినిష్టర్‌గారికి చెబుతాలెండి" అన్నాడు సెక్రటరీ. అసలు రహస్యమేమిటంటే, పండిత్‌జీకి ఇలాంటి హిందీఅంటే గిట్టదు" అన్నాడా రచయిత.

"పండితజీ అంటే ఆయన ఉద్దేశం జవహర్‌లాల్ నెహ్రూ అని. ఇంకేం, పని జరిగిపోయింది. రమ ఆయనతో ఇంకొకటి చెప్పింది. "మీరు చెబితే షా నాటకమేదన్నా ఆడేస్తామన్నది." "ఎందుకండీ, ఆ ఇంగ్లీషు చాలా కఠినంగా ఉంటుంది. ఎవడి కర్థమౌతుంది?" అన్నాడాయన. "పోనీ, ప్రసాద్‌నాటకం ఆడమంటారా?" అని అడిగింది రస్తోగీ. "బాబోయ్! ఆ హిందీ నాకే సరిగ్గా అర్థంకాదు" అన్నా

డాయన. అని ఆ రచయిత నవ్వి మళ్ళీ అన్నాడు—ఈ ఆఫీసర్ల విషయం ఏమడుగుతారులెండి. ఇంగ్లీషు కష్టంగాఉంటే నేర్చుకుని అది అర్థం చేసుకోవాలి. హిందీ కష్టంగాఉంటే నేర్చుకోనక్కర్లేదు. అసలు సంగతి ఏమిటంటే, అది భారతదేశపు భాష కదూ—జనులందరికీ చెందిన భాష ఆయె, కామన్ ఇంటరెస్టున్న భాష ఆయె. మీరే చెప్పండి ; ఏ దేశంలో నైనా రాష్ట్రభాష నిలా అవమానిస్తారా ?"

పరిస్థితుల ప్రభావంవల్ల యిదే రచయిత ఆనాడు యెంత దిగజారి మాట్లాడాడా అనుకున్నా. ఒకరకంగా యితను చెప్పేది నిజమే ! హిందీ రచయిత కావటంవల్ల తను కోరిన సన్మానాలన్నీ లభించకపోయేటప్పటికి అతనిలో గడ్డకట్టుకునివున్న అహంభావం యెటువంటి వక్ర మార్గాలుపట్టిందీ ! నిజానికి ఇది అసలు విజ్ఞానయుగం. హిందీలో విజ్ఞాన విషయాలు లేవు. ఆధ్యాత్మికవిషయాలు వైన్నా. విజ్ఞానం గొప్పదనమంతా చూసినతరువాత అది ఓడిపోయిన తరువాత మనం ఆధ్యాత్మికాన్వేషణ మొదలుపెడతాం. రైల్లో యెక్కకముందు మన కెంత వుబలాటంగా వుంటుంది. రైల్లో యెన్నడూ యెక్కనివాడెవడిదగ్గరికన్నా వెళ్ళి రైల్లో యెక్కి ప్రయాణంచెయ్యటం యేమంత గొప్ప విషయం కాదంటే అతడెన్నడూ ఒప్పుకోడు. ఒప్పుకున్నా మనస్సింకా పీకుతూనే వుంటుంది. రైల్లో ఒకసారి ప్రయాణంచేసొచ్చినతరువాత యిదే సంగతి అతనికి చెపితే రైలుకూడా ఒకరకమైన వాహనంమాత్రమేనన్న విషయం అంటు తప్పకుండా వప్పుకోవచ్చు.

చెల్లీ ! నేటియుగంలో మనం సాధనానికి, సాధ్యానికీ మధ్య భేదం గమనించలేకపోతున్నాం. మార్గానికి గమ్యానికి మధ్య భేదం కనుక్కోలేకపోతున్నాం. నేను యివాళ యెందువల్లో పెద్ద పెద్ద మాటలన్నీ వాడేస్తున్నాను. నా మనసులో వచ్చిన భావాలన్నీ వచ్చినవి వచ్చినట్లే రాస్తున్నాను.

అప్పటికి నా మేకప అయిపోయింది. రచయిత మహాశయుడు చాలా అమాయికంగా "యిక్క టొక పుట్టుమచ్చ పెట్టండి బాగుంటుంది." అన్నాడు. నేను అవునని కాదని యేమీ అనకముందే ఆయన కాటుకపుల్ల తీసి నా బుగ్గలమీద మచ్చ పెట్టనే పెట్టేశాడు. ఆ మనిషిని నేనుమాత్రం

తాకలేదు. అయినా ఆ పుల్ల నా చెంపను తాకగానే అతడు అనవసరంగా నాకు చేరువకావాలని ప్రయత్నిస్తున్నాడని యెందుకో అనిపించింది. నేను గంభీరంగా వూరుకున్నాను.

నాటకం ప్రారంభమైంది. నా నృత్యం మొదలుపెట్టేటప్పటికి జనమంతా వూపిరి బిగబట్టి దీక్షగా చూడసాగారు. చెల్లీ, నిజం చెప్పు తున్నాను. ఒక్కొక్కసారి నిజంగానే నేను రాధనేమోనన్న భ్రమ నాక్కూడా కలిగింది. నా వెనుకనున్న దట్టమైన మొఖమల్ పరదాలు, రంగురంగుల వెలుగునీడలు, అతి మధురమైన ఆర్కెస్ట్రా, మాటిమాటికి మ్రోగుతున్న నా కాలిగజ్జెలు—అంతా మంత్రముగ్ధులైపోయారనుకో. నాటకం అయిపోయింది. నేను దుస్తులు మార్చుకుని బయటకు వచ్చే టప్పటికి మొదట కనిపించింది రచయిత మహాశయుడు. లేడీ దాసుకూడా సరిగ్గా అప్పుడే అక్కడికొచ్చారు. ఆ రచయితకు నాతో మాట్లాడే అవకాశం యేమాత్రం యివ్వకుండా ఆమె నవ్వుతూ నాతో మాట్లాడసాగారు, "నువ్వు నిజంగా అద్భుతంగా నాట్యంచేశావు సుశీ! ఈ చెత్తనాటకానికి కూడా యెవరూ వేలెత్తి చూపటానికి వీల్లేకుండా అభినయించావు." అన్నారు. యింతలో శ్రీమతి తారాదేవి వచ్చింది. రమా రస్తోగీకూడా వచ్చింది. పైమాట వాళ్ళిద్దరూ విన్నారు. రచయితముఖం యెర్రబడి పోయింది. ఆయన రమా రస్తోగీవంక చూశాడు. కాని రస్తోగీ అప్పుడున్న ఆనందంలో యివన్నీ పట్టించుకునేటట్టులేరు. ఆమె రచయిత దగ్గరకు వెళ్ళి రహస్యంగా యేదో చెప్పింది. అతనిముఖంకూడా కళకళ లాడింది. వాళ్ళిద్దరూ బయట నిలబడియున్న అతిధుల గుంపువైపు వెళ్ళారు. లేడీ దాసు మనసులోకోర్కె పూర్తికాలేదు. ఆమె యిదంతా అర్థంకానట్టు చూడసాగింది, శ్రీమతి తారాదేవి నన్ను కౌగలించుకుని "నిజంగా సుశీ, నీవు యివ్వాళ అద్భుతంగా నాట్యంచేశావు" అన్నారు. ఆవిడ సంతోషానికి పట్టపగ్గాలు లేకుండావుంది. చాలా గర్వంగా లేడీ దాసువైపు తిరిగి అన్నది. "చూశారా, నేను చెప్పలేదా? యిలాంటి సంఘ సేవలోనే నా వయస్సంతా గడిచిపోయింది. యింగ్లీషువాళ్ళ రోజుల్లో కూడా మేము యెన్నో అపాయాల నెదుర్కొని యిలాగే కృషిచేస్తూ వుండేవాళ్ళం.

ఇది లేడీ దాసుని దెబ్బతీయటం అన్నసంగతి తెలుస్తూనేవున్నది. కాని, ఆవిడ నవ్వుతూ నవ్వుతూనే ఈ దెబ్బ నెంత చక్కగా తట్టుకున్న దంటే, నాకు యిదిచూసి ఆశ్చర్యంకలగడమే గాకుండా ఆ ముసల్దాని యందు ఒకవిధమైన గౌరవభావంకూడా కలిగింది.

"నిజమే ! మంచి కళాకారులు యేమైనా చేయగలరు" అన్నది లేడీ దాసు. వాళ్ళిద్దరూ నన్ను తమ తమవైపుకి తిప్పుకోటానికి పోటీ పడసాగారు. శ్రీమతి తారాదేవి కొత్తయెత్తు యెత్తింది. "శక్రటరీగారు కూడా యిదంతాచూచి చాలా సంతోషించారు. విదేశాలకువెళ్ళే ప్రసంగం వచ్చింది. ఆయన రమను చాలా అభినందించారు. ఆ రచయిత మహాశయుణ్ణిగూడా పిలిపించారు. వాళ్ళిద్దరికి యీసారి విదేశాలకువెళ్ళే అవకాశం తప్పకుండా లభిస్తుందని నా వుద్దేశం. మన శక్రట్రీపని యెవరు చేస్తారా అని నా కిప్పటినుంచి దిగులు పట్టుకుంది." లేడీ దాసు యెత్తుకు పైయెత్తువేసింది. "ఏం, మన సుశీ యెందుకు చెయ్యగూడదూ ? శక్రట్రీ స్వయంగా కళవిషయం తెలిసిందైతే మరీ మంచిదిగదా ! మీ అభిప్రాయం యేమిటి?" అని అడిగిందామె. తాను వెనుకబడిపోతున్నానని అనుకున్నది శ్రీమతి తారాదేవి. వెంటనే "నేను సరిగ్గా అదే చెప్పబోతున్నాను. మీరే చెప్పేశారు" అంది.

"హలో, వండర్‌పుల్, మైగాడ్!"

"ఓ మై ఓ మై! నేను వెనక్కి తిరిగి చూశాను. యింజనీయర్ సక్సేనా, డాక్టర్ నిమోలియా. నేను వాళ్ళనుచూచి నవ్వాను.

"బలే! బలే!మీ రివాళందర్నీ మాయజేసేశారు. అవునండీ, యివ్వాళ మీరండీ, భారతీయసంస్కృతి అంటే యేమిటో అందరికి చూపించేశారండి" అన్నాడు యింజనీయర్ సక్సేనా.

"అసలు మీరు యివాళదాకా యెక్కడ దాక్కొని వున్నారండీ !" అని అడిగాడు డాక్టరు నిమోలియా.

ఇవన్నీ వినివిని నాకక్కడా కొంచెం విసుగెత్తింది. నేనువాళ్ళిద్దరికి కృతజ్ఞత తెలిపి వింగులోనుంచి బయటకొచ్చాను. మామా రెక్కడున్నారో చూడాలనివుంది నాకు. చూస్తే వారు శక్రటరీ శివపురి సోఫావెనక చేతులుకట్టుకున్నట్టుగా నిల్చున్నారు. మనిషి మెహర్బానీకోసం మాట్లాడే

టప్పుడు ఒకరకమైన కృత్రిమమైననవ్వు నవ్వుతాడు. మా ఆయన అలాగే నవ్వుతున్నారు. వారి మాటలు విని మధ్యమధ్య శివపురికూడా నవ్వుతున్నాడు. మిసెస్‌రైనాకూడా ఏదోచెప్పుతూ నవ్వుతున్నది. బహుశా ఆవిడ మావారినిగురించి శివపురి కేదో చెప్పుతున్నట్లుంది. యింకేం!—మా ఆయనకు జన్మ ధన్యమైనట్లు కనిపిస్తున్నారు. నన్ను చూడగానే "సుశీ" అని పిల్చారు. మిసెస్ రైనా నవ్వింది. మిష్టర్ శివపురికూడా యెంతో దయతో నన్నొకసారి కన్నెత్తి చూశారు. శ్రీమతి తారాదేవికూడా నా వెంట వున్నది. అలాంటప్పు డాయన నా దగ్గరకొచ్చి హడావిడిగా "ఏంటున్నావా! పద-పద, వాళ్లు నీకోసం కాచుకుని వున్నారు" అన్నారు.

సర్కారు వుద్యోగి భార్య కావటం చాలా అవమానకరమైన విషయమని, భర్తతోపాటు ఆవిడకూడా బానిసత్వం అనుభవించాల్సివుంటుందని నాకప్పుడు మొట్టమొదటిసారి అనిపించింది. చెల్లీ! మా జీతగాడు రాము వుండేవాడు గాదు ? వాడిభార్య లచ్చి మనదగ్గరకొచ్చి యెలా అనవసరంగా పొగడిపోతూవుండేది? నేనుకూడా అంతేనా అనిపించింది. మనందానిలోయెంతదర్జాగాగర్వంగా యేదోపెద్దవాళ్లుచిన్నవాళ్ళతోమాట్లాడుతున్నట్లుగా మాట్లాడేవాళ్ళం. యిప్పుడు నాతోగూడా అలాగే మాట్లాడతారా వాళ్ళు! నేనుకూడా అలాంటి బాధనే భరించాలా! "పదండి!" అన్నాను.

నా గొంతులో యేమీ వుత్సాహం లేకపోవటం చూచి, ఆయన కొంచెం విసుక్కుంటూ నెమ్మదిగా అన్నారు. "మిసెస్ రైనా నిన్ను గురించి, నన్నుగురించి చాలా బాగా చెప్పిందిలే! నిజంగా యివ్వాళ మనం లేచినవేళ చాలా మంచిదనుకో!"

నాకు మండుకొచ్చింది చెప్పొద్దూ! యెలాంటి మనిషైనా, తాను ఉద్యోగంచేస్తున్నారు, చెయ్యమను. పై వుద్యోగియెదుట యికిలిస్తూ నుంచోటానికి వీరితోపాటు నేనుకూడా నౌకర్నుకాదే. యింతలో మరొక యోచన వచ్చింది. భర్త గొప్పదనంలో నాకు హక్కు వున్నప్పుడు ఆయనదాస్యం అనే భారాన్ని నేనుకూడా మోయవద్దా మరి ? పూర్వకాలంలో రాజుగారిసమక్షంలో మంత్రి ఒక్కడేకాదు, మంత్రిభార్య, ఆతని పరివారం—అంతా తలవంచేవారుగాదా ? సంఘంలో తరగతులు

యెలాగూ తప్పవు. నా కొక్కడానికే యీ అహంకారం యెందుకు! మేము వెళ్ళాం. "యిదిగోనండీ!" అన్నారు మాఆయన నవ్వుతూ. నేను నమస్కారంచేశాను. మిసెస్ రైనా నా చేయి పట్టుకుని నన్ను తన ప్రక్కన కూర్చోపెట్టుకున్నది. మిష్టర్ శివపురి నన్నుచూచి మనం ఆ నాడు లచ్చినిచూచి నవ్వినట్టుగా అతిగర్వంగా ఒక చిరునవ్వు నవ్వాడు.

"డ్యాన్సులో బాగా ట్రైనింగు పొందటానికి అపర్ట్యునిటీయే దొరకలేదు. కాలేజీలో యెడ్యుకేషన్ సిస్టమ్ యెలాంటిదో మీకు తెలుసు గదా! ఆర్టు డెవలప్కానేకాదు" అన్నారు మావారు.

"అఫ్ కోర్స్ ది సిస్టమ్ నీడ్స్ యె చేంజ్" అన్నాడు మిస్టర్ శివ పురి నావైపు చూడకుండానే, తన దొరచుట్టమెల్లగా పెదవుల్లోంచి తీస్తూ. బహుశా వాళ్ళంతా అందరికి అర్థమయ్యే హిందూస్థానీ మాట్లాడుతున్నా మని అనుకునివుంటారు.

"యీవిడ యింగ్లీషులో ఎం. ఏ. ప్యాసైందండి" అన్నారు మా వారు. మిష్టర్ శివపురి తన నొసటిమీద ముడతలుపడేలాగ యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లుగా అతినాజూగ్గా నవ్వి తలవూపి నా వీపు చరిచి శభాష్ అంటున్నట్లుగా నటించాడు. నా కక్కడ వూపిరాడక మనసంతా వుక్కిరి బిక్కిరి కాసాగింది.

"మిసెస్ రాజ్! మీరు దీంట్లో యింకొంచెం ప్రాక్టీసుచెయ్యండి" అన్నది మిసెస్ రైనా. మళ్ళీ గుసగుసలాడుతూ నా చెవిలో రహస్యంగా చెప్పసాగింది. "ప్రాక్టీసువల్ల యెంత గొప్పపనైనా చేయవచ్చు. మొదట్లో కొంచెం కష్టంగానే వుంటుంది. కాని దాంట్లోకూడా ఒకరకమైన ఆనందం లభిస్తుంది. ఆ ఆనందంవల్లనే అభివృద్ధి కలుగుతుంది. దానికోసం ప్రయత్నించని మానవుడు మూర్ఖుడన్నమాట. ముందుకు సాగిపోవటాన్నే జీవితమంటారు" అన్న దావిడ. నావైపు ఆదోరకంగా గుచ్చిగుచ్చి చూచింది. నే నేం జవాబుచెప్పాలో నాకే తెలియలేదు. యెవరన్నా యేదన్నా సలహాయిస్తే అతివినయంగా వారికి కృతజ్ఞతతెలిపి "మీ సలహా చాలా గొప్పది. మేము దీనిని అమలుజరపటానికి తప్పకుండా ప్రయత్నిస్తాం. మా పరిస్థితి బాగుచేసుకోటానికికూడా ప్రయత్నిస్తాం."—అని వాగ్దానంచేస్తూ "మా లోపాలు మాకూ్కడా తెలిసినవి గనుక మీరు యిదే

విధంగా ప్రోత్సహిస్తూవుంటే మే మింకా ముందుకు సాగిపోగలమని నమ్మకంగా చెప్పగల"మని. చెప్పాలని మాఆయన నాతో ఒకసారన్నారు. నా కా విషయం యిప్పుడు గుర్తుకొచ్చింది. అయితే నే నివన్నీ చెప్పలేకపోయాను. యెందుకంటే, నాకు యీమాటల్లో ఒక్కటికూడా సహజమైనవిగా తోచలేదు.

"సొసైటీలో వుండటంకూడా ఒకరకమైన ఆర్టే సుశీలా!" అన్నది మిసెస్ రైనా నాతో మళ్ళీ.

మిష్టర్ శివపురి యిప్పటిదాకా నిశ్శబ్దంగా వున్నారు. ఆయన నా వైపు చూడకుండానే, "నీకు డ్యాన్సులో టేస్ట్ వున్నదా ? లేక యిది హాబీయా?" అని అడిగారు.

"నాకు డ్యాన్సులో లైఫ్‌లోని థ్రిల్—అంటే నా వుద్దేశం యేమిటంటే, దాని లయలో నా సంపూర్ణమైన వికాసం గోచరిస్తున్నది" అని అన్నాను నేను. తొందరలో యింగ్లీషుమాటలు సరిగా పడలేదు. థ్రిల్ శబ్దం నాకే చాలా చౌకబారుగా కనుపించింది.బహుశా,పొరపాటువల్ల నేనది ప్రయోగించివుంటాను. కాని, ఆయన నామాటలువిని,నావంక చిరునవ్వుతో చూచి అన్నారు. "మీరు యేమన్నారు ? సంపూర్ణం గోచరించటం-ఆహా! ఐ లవ్ దిస్ గుడ్ హిందీ. ఓన్‌లీ ఐ హావ్ యెట్ టు లెర్న్ యిట్— మై స్వీట్ నేషనల్ లాంగ్వేజ్" ఛా! నన్నెవడో గొంతుపట్టుకుని నొక్కినంతపనైంది.

"హిందీలో యీవిడ పండితురాలే అనుకోండి. కవిత్వంకూడా రాస్తుందండి" అన్నారు మావారు. "ఓ! వెరిగుడ్!" అన్నారు మిష్టర్ శివపురి. మిసెస్ రైనా తన సోదరునివంక చూచింది.

"కవిత్వం నేను రాయలేనుగానండి! యితరులు రాసినది చదవాలనే సర్దా మాత్రం వుంది" అన్నాను నేను.

"సర్దావల్లనే మనం యేమి నేర్చుకోవాలన్నా సులభంగా వచ్చేది. మిసెస్ రాజ్,మా యింటి కొకసారి రాగూడదూ.నా హజ్‌బెండ్‌కి సంగీతమంటే చాలా యిష్టంలెండి. ఆయన యే రాగాన్నైనా యిట్టే గుర్తుపట్టెయ్యగలడు. నా కసలు ఆ తేడాలే తెలియవు. అన్నీ ఒకలాగే వుంటయి." అన్నది మిసెస్ రైనా.

"ఆయనను కలుసుకొని మీరుగూడా చాలా సంతోషిస్తారు" అన్నాడు మిష్టర్ శివపురి. కొంచెంసేపటికి వాళ్ళంతా వెళ్ళిపోయారు. తారాదేవి వచ్చి "యిక వెళ్దాం వస్తారా సుశీ" అన్నది. రమారస్తోగి తిరిగి వచ్చింది. వెంట యెవరూలేరు. "మిసెస్ రయనా యీమెను తన యింటికి టీకి పిలిచింది" అన్నది తారాదేవి.

త్రోవలో రమ నాతో అన్నది—"చూశావా! ఆ రోజున మీ యింటికికూడా వచ్చిందికదూ యిది. దీని మొగు డొక పనికిరాని గాడిద. యిదేం చేస్తున్నదీ వాడికి తెలియనే తెలియను. అయినా యిది నివురు గప్పిన నిప్పులే. దీని మొగుడికేం తెలుసు దీనిగుణాలు! శివపురికి కొంచెం తెలిస్తే తెలిసుండవచ్చు. అతనికి యిది వుద్యోగంలో ప్రమోషన్ యిప్పించినమాట నిజమేగాని, అతనిదగ్గ రెప్పుడూ డబ్బుగొరుతూ వుంటుంది. మాట మాట్లాడితే యింట్లో యిబ్బందిగా వుంది, జరగటం లేదని మొత్తుకుంటుంది." అని మళ్ళీ గొంతుమార్చి వుత్సాహంగా అన్నది. "అయినా యెందుకిప్పుడివన్నీ! నేనెలాగో విదేశాలకెళ్ళుతున్నాను. బహుశా కవి మహాశయుడుకూడా వస్తాడు. నేనుమాత్రం ఖాయమనుకో, నాబదులు నిన్ను శక్రటరీని చేసిపోతాను డార్లింగ్. యిదంతా నీ మహిమే ననుకో. నే నిది మర్చిపోతానా? దీనికి జీతం భత్యం యేమీ లేదనుకో. వుద్యోగం ఆనరరీ అయినా, పైపైన చాలా మిగుల్తుందిలే! తారాదేవిని మాత్రం మంచిచేసుకో. యీ లేడీ దాసు అంతా తనే తినేయాలని చూస్తూ వుంటుంది. యిప్పుడు దాని కింత మంటగా యెందుకుందో తెలుసా? నేను, తారాదేవి క్యాషంతా మా చేతుల్లో వుంచుకున్నాం. అసలు సంగతి యిదీ" అన్నది. నే నలా చూస్తూనే వుండిపోయాను. చెల్లీ! నేను యింటికొచ్చే టప్పటికి మావారు "సుశీ! నీకు మాటలుగూడా సరిగా రాలేదే, ఆయన్ని చూసి అంత అదిరిపోయావే?" అన్నారు.

"అదిరిపోయేది నేను గాదు. నే నదిరిపోవటానికి వాడెవడూ!" అన్నాను. వారు వులిక్కిపడ్డారు. నేను పట్టెమంచంమ్మీద పడుకున్నాను. వారు కొంచెంసేపు అలా చూచి "యేమిటి సంగతి—యేమి టివాళ యిట్లా మాట్లాడుతున్నావు! నాకు ప్రమోషన్ రావటం నీ కిష్టంలేదా?" అని

అడిగారు. "ఎందుకు లేదు. మీకు ప్రమోషన్ వస్తుంది. నాకూ వస్తుంది" అన్నాను. వారి కర్థంకాలేదు.

"ఏమిటీ! యెక్కడికన్నా ఫారిన్‌వెళ్ళే యేర్పాటుచేసుకొచ్చావా యేమిటి? యీ ఆర్ట్‌కూడా బలే చిత్రమైందిలే! పెద్దపెద్దవాళ్ళు దీనిని చూచి తలవంచుతారు. కాస్త అదృష్టం బాగుండి, స్నేహితులంతా పూనుకుంటే పద్మశ్రీకూడా సంపాదించవచ్చు" అన్నారు మావారు. నేను ప్రక్కకు తిరిగి రమా రస్తోగీ ఫారిన్ వెళ్ళుతోందన్నాను.

"నిజం? అయితే, యిక ఆమె పైకి వచ్చేస్తుంది. యీ రాజధాని కూడా జూదగాళ్ళ స్థావరంలాంటిది. నిజంగా సుశీ! మెరిట్ నెవరూ అడిగేవాళ్ళే లేరు" అన్నారు మావారు.

"ఎందుకు లేరూ? ఆమె బాగా కృషిచేసింది. సాంస్కృతిక విషయాల్లో మంచి పట్టువున్నది. సంఘానికి సేవచేస్తున్నది. అందుకనే అవకాశంవచ్చింది" అన్నాను.

"ఆవిడ ఎలాంటిదో నాకు చెప్పనక్కర్లేదులే. ఆడదై పుట్టటంలో చాలా లాభాలున్నై. యిప్పుడా పాతభావాలను అడిగేవాడెవడున్నాడసలు? మోడరన్‌లైఫ్‌విధానమే మారిపోయింది. రమ యెక్కడికీ, యూరప్ వెళ్లుతున్నదా? మంచి ఛాన్సుకొట్టిందిలే! వెధవబ్రతుకు—మందికూడా ఒక బ్రతుకేనా! యెలా వుందంటే, మన ముందునుంచి వూరేగింపు వెళ్ళిపోతున్నది. మనం అంచున నిలబడి యితరులకు జై అంటున్నాం. యిలా యెంతసేపు యితరులకు జై అంటూవుండాలో కూడా మనకు తెలియదు. వాడున్నాడు—ఆ మాదిగాడు—డాక్టరు నిమోలియా! మొదటి నెలలో రెఫ్రిజరేటర్ కొనుక్కొచ్చాడు. రెండోనెల టేప్ రికార్డర్ కొనుక్కొచ్చాడు, వచ్చేనెల కారు కొంటానంటున్నాడు పైగా. సరే, యిక మనం వున్నాం—బస్సు దొరక్క చస్తూవుంటాం. రాజధానిలో యేడెనిమిదివందలంటే పల్లెటూళ్ళో వందరూపాయలన్నమాట. సివిలిజేషన్ యీజ్ యె కర్స్—వినోభా శిష్యుణ్ణి ఐనా లాభంలేదే! నేను సిగరెట్టు యెట్లా వదిలిపెట్టేది? పైగా, యే లీడర్లున్నారే—అంతా దొంగలు. వీళ్ళకు నాకూ యెక్కడ కుదురుతుంది. దే ఆర్ హిపోక్రిట్స్. స్వైన్స్! యేం చేస్తాం? యిప్పుడు గవర్నమెంటు మందిగనక, వుద్యోగం వదిలిపెట్టినా

లాభంలేదు." త్యాగమూర్తి" అని మన్నెవడూ పొగడ్డు. యీ నిమోలియా గాడున్నాడే-నిమోలియా, వీ డసలు మాదిగాడుకూడా అయ్యుండడు. పాకీ వెధవ అయ్యుంటాడు. యిలాంటిపేర్లు వాళ్ళకేవుంటై. వీడి కింత డబ్బు యెక్కడినుంచి వస్తుందో నువ్వే చెప్పు. అస లీ డాక్టర్లని యెట్టాగొట్టా కంట్రోలు చేసిందాకా మనదేశం అభివృద్ధిచెందలేదు"

ఆయ నొక సిగరెట్టు వెలిగించి, మంచంమీద కాళ్లుజాపి రెండు తొడలమీద దిండుపెట్టుకుని గుప్పుగుప్పుమనిపొగవదుల్తూఅన్నారు. "సుశీ యీ దేశంలో మనం గాంధీగారిమార్గంలో నడుస్తున్నాం. వీళ్ళంతా రాత్రింబవళ్లు కల్చర్, కల్చర్ అని తెగవాగుతూవుంటారే—యీ కల్చ రేమిటో నా కింతవరకు అర్థంకాలేదు. గాంధీగారు అహింసాసిద్ధాంతం బోధించారు. కాని, మనం సైన్యాన్నేమీ తగ్గించలేదన్న విషయం అంద రికి తెలిసిందే. మన పెద్ద పెద్ద లీడర్లంతా గాంధీగారిలాగా గుడిసెల్లో వుండటంలేదు. దర్జాగా పెద్ద పెద్దబంగాళాల్లో వుంటున్నారు, కారుల్లో విమానాల్లో ప్రయాణాలుచేస్తున్నారు. వారి పిల్లలు కాన్వెంట్స్‌లో చదువుతున్నారు. యెవరు నోరువిప్పినా యింగ్లీషుతప్పితే యింకోటి మాట్లాడరు. వీటన్నిటికి అర్థం యేమిటి ? మనం యెక్కడున్నాం? మళ్ళీ భూదాన్ గీదాన్ అని కేకలేస్తారు. నాకేమీ బుర్రకెక్కటంలేదు" అన్నా రాయన వుపన్యాసధోరణిలో. నాకు విసుగుపుట్టింది. ధోరణిమార్చటానికి "రమ సిగరెట్లు తాగుతుందిటే ?" అన్నాను.

"నేనుగూడా తాగించా నావిడచేత, మంచివుషారైనదిలే" అని నవ్వారు. నే నసూయతో మండిపోయాను.

"యీవిణ్ణి లేడీ దాసుకి పరిచయంచేసింది నేనే. లేకపోతే యీవి ణ్నెవరెరుగు ?" అన్నారు వారు. నేను అదోలా చూచి కళ్లుమూసు కున్నాను. చెల్లీ ! నీవే చెప్పు. యిదంతా యేమిటి ? వారు తరచుగా అంటూంటారు. "మోడర్నిజం నేర్చుకో సుశీ. మోడర్నిజం,నువ్వుకూడా పురాతన ఛాందసురాలిలాగా మాట్లాడతావేమిటి?" నువ్వు చెప్పు. యీ మోడ ర్నిజం యేమిటో ; యింతలో వారు పిల్చారు. "వింటున్నావా ?" "ఏమిటని" అడిగాను,

"మిసెస్ రయినా టీకి పిల్చింది. నిజంగా ఆవిడ చాలా మంచిదిలే" అన్నారు మావారు.

"అయితే ?" అన్నాను.

"వెళ్దామా ?"అని ప్రశ్నగా అడిగినట్టడిగి, సమాధానంకూడా వారే చెప్పుకున్నారు.

"వాడుకూడా వస్తాడా ఆ హిందీ రచయిత ?" అని అడిగారు. ఆయనస్వరంలో యెంత అసహ్యం ! యెంత వేళాకోళం ధ్వనించింది! "వస్తే రావచ్చు" అన్నాను.

"చూశావా,హిందీ రచయిత అంటే—వాడొక మనిషికింద లెక్కే కాదు, అయినా, వాడికీ ఆయన సోర్సెస్ వున్నై. మనిషనేవాడు ఒంటరిగా యేమీ చేయలేడు. చెట్టుమీది కెక్కాలంటే యేదో ఒకకొమ్మ పట్టుకోక తప్పదు. ఆ కొమ్మతో అవసరంవున్నంతవరకు దాన్నిచూచి తలవంచ వలసివుంటుంది. ఒకసారి పైకియెక్కి దానిమీద కాళ్లుపెట్టి నిలబడ్డామా, ఆకొమ్మే మనపాదాలను ముద్దుపెట్టుకుంటుంది.క్రిందనుంచిచూస్తే కొమ్మ లన్నీ సమానంగానేఉన్నట్టు కనిపిస్తుంది. కాని, కొమ్మలమధ్యకు వెళ్ళి చూస్తే,కిందవున్న కొమ్మ పై కొమ్మనుచూసి యెలా తలవంచుకుందో మనకే అర్థమవుతుంది. హిందీ రచయిత అట ! ఉహూ !" అన్నారు. "వట్టి శుంఠ అనుకో వాడు. కాస్త పేరు సంపాదించాడు. యిప్పుడు పెద్ద బుద్ధిమంతుడై పొయ్యాడు. నన్నడిగితే యిప్పుడుగూడా వెర్రివెధవే నంటాను. యెలాగైతేనేం, విదేశాలకు వెళ్ళివస్తాడు. పిచ్చివెధవ ! బొంబాయి వెళ్ళగూడదూ ? సినిమాలకు రాయగూడదు. సాహిత్యాన్ని పట్టుకుని కూర్చున్నాడు. దమ్మిడీకి పనికిరాని వెధవలంతా బొంబాయిలో సినిమాలద్వారా లక్షాధికారులైపోయారు. ప్రొడ్యూసర్లయిపోయారు. అయితే, ఒకటిమాత్రం నిజం సుశీ !"

ఆయనేదో చాలా గొప్పవిషయం చెప్పబోతున్నారని నే ననుకున్నాను. చివరి కేమన్నారో తెలుసా ? "అదృష్టంఅనేది తప్పకుండా వున్నది. యివ్వాళ సైన్సుకి యిది అంతుపట్టకపోవచ్చు. కాని, యేనాటికైనా దీన్నంతా వప్పుకోక తప్పదు. లేకపోతే, యిన్నియుగాలు గడచిపోయినయి. మానవుడు దీనిని వూరికే నమ్ముతున్నాడంటావా ? షేక్స్పి

యర్ కూడా వప్పుకునేవాడుగదా దీనిని. అత నేం తెలివితక్కువవాడా?" అని ఆయ.నింకా యేమేమి చెప్పేవారో తెలియదుగాని,నేనే అడ్డుతగిలాను. "మీకూ రమా రస్తోగికి యెక్కడ పరిచయం?" అని అడిగాను.

"ఇక్కడే" అన్నారు ఆయన.

"మరి యింత గాఢమైన స్నేహం యెలా కలిసిందీ?"

వారు నా కళ్ళల్లోని జిజ్ఞాసను చూచి కొద్దిగా సిగ్గుపడ్డారు. తట పటాయిస్తూ "అబ్బే! యేంలేదే! యెందుకూ?" అని అడిగారు.

నేను చిన్న అబద్ధంఆడాను. "ఆమె యేం చెప్పిందంటే —"

ఆయ నులిక్కిపడ్డారు. "ఏమిటీ! ఏమిటీ! యేం జెప్పిందేమిటి? యేదన్నా చెబితే అది అబద్ధమనుకో!" అన్నారు.

నేను దిండులో మొఖం దాచుకున్నాను. ఆయన చూస్తూవుండి పోయారు. నిజంగా ఆడవాళ్ళ కింత ద్వేషం యెందుకో! నా తనువూ, మనస్సూ అంతా మంటలుమండినట్లయింది. అయినా నాకు ఆవిడమీద కలిగినంత అసహ్యం నా భర్తమీద కలగలేదు, యెందువల్లో?

"సుశీ, నువ్వేమిటేమిటో అనుకుంటున్నావు!" అన్నారు వారు. మళ్ళీ నవ్వి "హవ్ బాక్‌వర్డ్! హవ్ స్ట్రేంజ్! నువ్వస లేమనుకుం టున్నావు?' అరె! యిది మామూలు సొసైటీ పరిచయం. నువ్వేమను కుంటున్నావో మరి!" నేను తల పైకెత్తాను. నా కళ్ళల్లో నీరునిండింది. వారు నవ్వి "అయితే యింకేం! రేపటినుంచి నువ్వు ఘోషా మొదలు పెట్టు. మోడరన్‌గా వుండాలంటావు, మళ్ళీ లేనిపోని అనుమానాలన్నీ పెట్టుకుంటావు. నువ్వు కాలేజీలో మగపిల్లలతోకలసి ఎం. ఏ చదివావు. కాని నీమీద నే నెన్నడూ యెలాంటి అనుమానాలు పెట్టుకోలేదు. పైగా నువ్వు ఆడదానివి కూడాను. మగవాడి కస లిలాంటి కళంకా లంటనే అంటవే" అన్నారు. నేను లేచి కూర్చున్నాను.

"ఏమిటి దీనర్థం! మీకు నామీద అనుమానమా?"అని అడిగాను.

"నువ్వు నిద్రపో యిక.యివాళటి సక్సెస్‌తో నీ మూడే చెడిపోయి నట్టుంది" అన్నారు వారు. నేను మెదలకుండా పడుకున్నాను. మెల్లగా నిద్రపట్టింది.

నా వుత్తరానికి వెంటనే జవాబివ్వు. నా మనస్సు యింకా చాలా అశాంతిగా వుంది. యిదేమి టసలు! యీ ఆధునికత అనే దేమిటి? మన విషయవాంఛల్ని మరో రూపంలో వెళ్ళగక్కటం కాదుగదా యిది! ఆలోచించి రాయి.

వుంటాను,

నీ సుశీల

# 5

ప్రియమైన సోదరీ!

నీ వుత్తరంవచ్చి యెన్నాళ్ళనుంచో అలా పడివుంది.కాని, నేను జవాబివ్వలేకపోయాను. జరిగిందేమిటంటే, రమ పోవటంతో బాధ్యత అంతా నా నెత్తిన పడింది. యీ బాధ్యత అనేది ఒక పెద్ద గండంలాంటిది. దీన్నిగురించి నీ కేం చెప్పేది! చిన్న పనివచ్చి నెత్తిమీద పడినా నేను వూరికే గాబరాపడిపోతానన్న సంగతి నీకూ్కడా తెలిసిందే! యెందు కిలా గాబరాపడతానో నాకే తెలియదు. యిదొక పెద్ద లోపమన్నసంగతి నాకూ్కడా తెలుసు. కాని, సవరించుకోలేకపోతున్నాను. దృఢమైన మనస్సులేకపోతే మనిషి వూరికే హైరానైపోతాడు. వేలకొలదీ, లక్షలకొలదీ జనం గుమిగూడివున్న సభలో యేమాత్రం తడుముకోకుండా టకటకా మాట్లాడేవాళ్ళను చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది. యిది వచ్చినా నావల్లకాదు. నాకన్న తెలిసినవాళ్ళు, యోగ్యులైనవాళ్ళు ఆ జనంలో చాలామంది వుంటారు, వారిముందు నోరువిప్పటానికే నాకు సిగ్గువేస్తుంది. జనులేమనుకుంటారో అని భయమేస్తుంది. అంటే వుపన్యాసాలిచ్చేవాళ్ళంతా సిగ్గులేనివాళ్ళని నదురు బెదురులేనివాళ్ళని చెప్పటం నా అభిప్రాయం కాదు. సరే, యివన్నీ యెందుకులే. నా గొడవే రాస్తాను నీకు, విను. నే నింట్లో కూర్చునుండగా వారొచ్చారు, అప్పుడు నేనేదో అల్లుకుంటున్నాను.

"యీమధ్య నీకు బొత్తిగా తీరికలేకుండావున్నదే స్వీట్ !" అన్నారు వారు. నాకర్థం కాలేదు. "అంటే మీ వుద్దేశం ఏమిటసలు ?" అని అడిగాను.

"వాడున్నాడే, ఆ డాక్టరు నిమోలియా ?" అని నవ్వారు మావారు. నా కెందుకనో మండుకొచ్చింది. మంచిసంగతేమన్నా చెప్పుతారేమోనని నేను కూర్చుంటే, నా దృష్టిలో బొత్తిగా విలువలేనివాణ్ణిగురించి మళ్ళీ యేదో చెప్పబోతున్నారు గదా అనుకున్నాను. నేనేమీ ఉత్సాహం చూపించకపోయేటప్పటికి వారుకూడా విసుక్కున్నారు. "యీమధ్య నీ కసలు సొసైటీలో బొత్తిగా యింట్రస్టే లేనట్టుందే ?" అన్నారు. "సొసైటీ!సొసైటీ అంటే డాక్టరు నిమోలియాఒక్కడేనా మీ వుద్దేశం?"

వారు కొంచెం సిగ్గుపడి నవ్వుతూ—"అబ్బెబ్బే ! అదిగాదు, నే నలా యెందుకంటాను ?" అన్నారు. అని సిగరెట్టు వెలిగించి వుంగరాలు వుంగారాలుగా పొగవదులుతూ వాటివంక చూస్తూ కూర్చున్నారు. నా కా వుంగరాలను చూస్తూంటే, అకస్మాత్తుగా రమ జ్ఞాపకంవచ్చింది, మన సంతా బాధతో నిండిపోయింది, "యిది విన్నారా!" అని అడిగాను. వారు మెల్లిగా నావైపు తిరిగారు. ఏమిటన్నట్టు చూశారు "రమ వెళ్ళటం ఖాయ మైంది" అన్నాను.

"మరి నువ్వో ! నీవుండిపోయావే !" అని అడిగారు. యిలాంటి ప్రశ్న వేస్తారని నే ననుకోలేదు. "నన్నుకూడా వెళ్ళరమ్మని మీ వుద్దే శమా !" అని అడిగాను. "మళ్ళీ అదే పాతపాటా ? సరే నా ఉద్దేశం అదేననుకో. నాకు ఉద్దేశంవున్నంతమాత్రాన నువ్వెళ్ళగలుగుతావా !" అని అడిగారు. నాకు దెబ్బ తగిలినట్లయింది. "నాకు ఛాన్సులేకే వూరు కున్నాననుకున్నారా ?" అన్నాను.

"అయితే, మరెందుకు వెళ్ళలేదూ ?"

"నేను వెళ్ళటం బహుశా మీకు యిష్టముండదేమో ననుకున్నాను"

"ఎందుకుండదనుకున్నావు ?"

"ఏమీలేదు, పెళ్ళైనాక భర్తని"—

"ఛా ! ఆబ్సర్డ్ యిండియన్స్! దీనికేమైనా అర్థముందా ! పెళ్ళి ! పెళ్ళి ! పెళ్ళికాగానే కెరియరంతా పాడుచేసుకోవాలని యెక్కడన్నా

రాసుందా ! యీ ఆడవాళ్ళు—యీమాత్రం యెందు కర్థంచేసుకోలేరో తెలియదు" అన్నారు వారు. వారిమాటలు విని నాకు మరింత మండు కొచ్చింది. నేను చాలా తీక్ష్ణంగా అన్నాను. "యిదెట్లావున్నదంటే, అత్తను గొట్టి మొగుడుతో మొత్తుకున్నట్టుంది. అసలు మీ మగవాళ్లున్నారే—మీ బుద్ధే అంత. ఆడదాన్నిగురించి అణుమాత్రంకూడా ఆలోచించరు." ఇలా మాటమీదమాట పెరిగిపోయింది. "అయితే నేను చేస్తున్నదంతా నాకోసమే నంటావు ?" అని అడిగారు ఆయన. "కాక ! న్యాకోసమా ? యిక మా ఆడవాళ్లున్నారు. యెప్పుడూ భర్త నెలా సంతోషపెడదామా, యేమి సేవ చేద్దామా అనే ఆలోచిస్తూవుంటారు" అన్నాను.

"ఏంసేవచేస్తున్నావు నువ్వు నాకు ? కనీసం నా చొక్కాలకు ఊడిపోయిన బొత్తాములుకూడా కుట్టవే !....అన్నారు.

"నే నేం టైలర్ ననుకున్నారా !

"అయితే యిక నువ్వు చేసేదేమిటి ? యేనాడన్నా వంటచేశావా? యిల్లువూడ్చావా ? బట్టలుతికావా ?" అని అడిగారు.

"అవునవును ! నేన్వు మీ దాసీదాన్నికదూ! యిలాంటి చాకిరీఅంతా చేసిపెడుతుంటాను పాపం !"

"అయితే నువు నాకుచేసే సేవేమిటి మరి ?"

"నేను నా సర్వస్వం మీకు ధారపోశాను" అన్నాను. నా కేడు పొచ్చేసింది. వా రలాగే చూస్తున్నారు. "అయితే నే నేం చెయ్యటం లేదన్నమాట? నా జీవితం వ్యర్థంఅన్నమాట. నేను మీ కళ్ళకొక గుది బండలా కనిపిస్తున్నానన్నమాట. నావల్ల మీ కేమీ వుపయోగంలేనప్పుడు నే నిక్క డెందుకు ? అసలు మగవాళ్లు పెళ్ళెందుకు చేసుకోవాలి ? నేను పుట్టింటినుంచి వచ్చేటప్పుడు యెన్నెన్నో కలలుకన్నాను" అన్నాను యేడుస్తూ. వారు విసుగ్గా అలాగే నిలబడి ఉన్నారు. "నాకు యీ యేడుపులు మొత్తుకోళ్లు యిష్టంలేదు. నా కిలాంటివంటే అసహ్యం" అన్నారు. పెద్దపులి పంజాతో కొట్టినట్లయింది నాకు. మొట్టమొదట కొంచెం భయం వేసింది. మళ్ళీ వళ్లుతెలియని కోపంవచ్చింది. కోపంలో నే నేం వాగేదీ నాకే తెలియదని నీకూ్కడా బాగా తెలుసు. అలాంటప్పుడు అసలు నా మెదడు పనిచెయ్యదు. నేను వెంటనే ఒక నిర్ణయానికొచ్చేశాను. "సరే,

మంచిది. యిక నేను మిమ్మల్ని అనవసరంగా శ్రమపెట్టను. మీకు నేనంటే అసహ్యంగదూ! ఇహనుంచి మీకు అసహ్యంకలిగే అవకాశం యివ్వనులెండి" అన్నాను. వారు నిర్ఘాంతపోయారు. నన్నలాగే చూస్తూ వుండిపోయారు. నా మొహంలో వారి కేం కనిపించిందో తెలియదుగాని, భయపడినట్లయిపోయి మెల్లిగా రాజీకొచ్చినట్టు"నేను ని న్నేమన్నానని:— యెందుకిలా అనవసరంగా కోప్పడుతున్నావు?" నా యేడుపాగలేదు. ఏడుస్తూ వున్నాను. చివరి కలాగే నిదురపట్టింది. యెందుకో మెలుకవచ్చి చూచేసరికి వారు సోఫాకానుకుని అలాగే కళ్లుమూసుకున్నారు. వేళ్ళమధ్య సిగరెట్టు యింకా అలా కాలుతూనేవున్నది. యెదురుగా యాష్ట్రేలో సిగరెట్టుపీకలు కుప్పలుతిప్పలుగా పడివున్నాయి. నేను వేళ్ళమధ్యనుంచి ఆ కాలుతున్న సిగరెట్టు లాగివేశాను. వారికి మెలకువవచ్చింది. "శుభ్రంగా పడుకోరాదా?" అన్నాను నేను. వారు కొంచెం కోపంగా, కొంచెం ఆశ్చర్యంగా నావైపు అలాగే చూడసాగారు. నాకు మనసులో యెలాగో వుంది. "పడుకోరాదూ" అన్నాను. ఆయన మాట్లాడకుండా వెళ్ళి పడుకొన్నారు. నేను మెల్లిగా తల ఒత్తసాగాను. "నా నిద్ర చెడిపోతుంది. నన్ను ముట్టుకోకు" అన్నారు ఆయన. నాకు కరెంటుషాక్ తగిలినట్లయింది. యేంమనుషులీ మగవాళ్లు! నేను వీరికాళ్ళకింద చెప్పులా పడిఉండాలన్నమాట. వీరు చెప్పినపనులన్నీ చెయ్యాలన్నమాట. వీరి దాసీదానిలా పడిఉండాలన్నమాట! ఎందువల్ల? పెట్టి పోషిస్తున్నారనేగా? ఏం, నేను ఆమాత్రం సంపాదించుకొని బ్రతకలేనూ? "నేను ముట్టుకుంటే ఇక మీకు నిద్రకూడా పట్టేటట్లులేదు. మంచిది. ఇక నేను మిమ్మల్నిముట్టనేముట్టను" అన్నాను కసికొద్దీ.

నేను లేచివెళ్ళి పక్కమీద పడుకున్నాను. వెక్కివెక్కి ఏడుస్తున్నాను. కాని ఆయన లేచిరాలేదు. నేను మెల్లగా లేచి మొఖంకడుక్కున్నాను. తువ్వాలుతో తుడుచుకుని, కాస్త పౌడరుఅద్దుకున్నాను. ఒకసారి మావారివంక చూసి,చీరమార్చుకోవటానికి వెళ్ళాను.వారికి నిజంగానే నిద్రపట్టినట్టుంది. నా కేంచెయ్యాలో తోచలేదు. పనివాడితో చెప్పి వెళ్ళిపోయాను.

అప్పటికి చీకటిపడిపోయింది. నేను సాంఘికసంక్షేమక్షేత్రానికి

చేరుకొనేటప్పటికి అక్కడ అంతా గందరగోళంగాఉంది. నన్నుచూసి శ్రీమతి తారాదేవి—"మంచిసమయాని కొచ్చావు. నిన్ను పిలుచుకు రావటానికి ఇప్పుడే మంజును పంపించబోతున్నాను" అన్నది.

"ఏమిటి సంగతి?" అని అడిగాను. నా మనస్సులో ఇంకా బాధ గానేఉన్నది. అయితే, ఇక్కడి కొత్తవాతావరణంలో నా మనస్సు కొంచెం తేలికయింది. "మొగుడూపెళ్ళాలమధ్య ఇలాంటి తగాదాలు ఎప్పుడూ వస్తూనేఉంటాయి. ఇది సహజం. నేనే కొంచెం సహనం చూపించిఉండవలసింది," అనుకున్నాను. ఏది ఎలాగున్నా ఆయన నా స్వామి. సమానత్వం అంటే నెత్తికెక్కి కూర్చోటంకాదుగదా ? అయితే, ఇందులో నా తప్పుమాత్రం ఏముంది ? ఆయనచొక్కాలకు బొత్తాములు కుట్టలేదని అంటారా ? ఇంట్లోపనిఅంతా పనివాళ్లు చేస్తున్నమాట నిజమే. అయితే; నాకోసం పెట్టుకున్నారా వాళ్ళందరినీ ? నౌకర్లున్నది వారిపనులకోసమే- నాకోసం కాదు. నేను వచ్చిందగ్గరనుంచీ నాకోసంగా వారుచేసిన దేముంది? నావల్ల వారిఖర్చు ఏమన్నా పెరిగిందా ? మహా అయితే, నా పౌడర్లు, స్నోలు—అన్నీ కలిపి నెలకో 20 రూపాయలు ఔతాయేమో ? పైగా, అవి నేను ప్రతినెలా కొనటంలేదు. ఎప్పుడన్నా కొన్నాకూడా, చవుకబారు చీరలే. 'ఈ చీరలు చాలా ఆర్టిస్టిక్‌గా ఉన్నా యని కొన్నానని చెప్పి, కళాత్మకమైన డిజైన్లనెపంతో వాటి చవుకబారు తనాన్ని దాస్తాను. ఖరీదుగలచీరలన్నీ మా నాన్నగారు కొనిపెట్టినవే. మరి వీరి దబాయింపులు దేనికి ?' ఇలాగే ఎన్నో అనుకుని నా మనస్సును తృప్తిపరచుకున్నాను.

తారాదేవి నన్ను తనగదిలోకి తీసుకువెళ్ళింది. నన్ను కుర్చీలో కూర్చోబెట్టి—కూర్చో అమ్మాయీ ! నీతో కొన్ని ముఖ్యమైనవిషయాలు మాట్లాడాలి" అన్నది. "చెప్పండి ," అన్నాను. నా కంఠంలో ఏమన్నా విసుగుగానీ, కోపంగానీ ధ్వనించాయోఏమో, ఆవిడ కొంచెం ఉలిక్కి పడింది. "ఏమిటి సంగతి ? ఇవాళ ప్రొద్దున్నే ఎవరిమొఖంచూసి లేచా వేమిటి !" అన్నది. "నామొఖంమాత్రం కాదు" అన్నాను. ఆవిడ నవ్వింది. ''లేదు,ఏదో జరిగింది, ''నన్ను చెప్పమంటావా! జీవితంలో నా కున్న అనుభవాన్నిబట్టి నువ్వు ఇవాళతప్పకుండా నీ భర్తతో పోట్లాడివచ్చా

వని చెప్పగలను నేను. కావాలంటే పందెంకాయమన్నా కాస్తాను" అన్నది. నేను నిర్ఘాంతపోయాను. ఈవిడ కెలా తెలిసింది ? నా కేమీ మాట్లాడేఅవకాశం యివ్వకుండానే ఆవిడ చెప్పటం మొదలుపెట్టింది. "యీ మగవాళ్ళది చాలా విచిత్రమైనస్వభావం. ప్రపంచంలోని పరాయి స్త్రీలందర్నీ వాళ్లు చాలా గౌరవంగాచూస్తారు. కాని తనభార్యనుమాత్రం దబాయిస్తారు. అధికారంచెలాయించాలని చూస్తారు. బేబి ! తన భార్యవిషయం వచ్చేటప్పటికి పురాతనకాలపు భూస్వామిలాగా ప్రవర్తిస్తాడు. తన భార్యను తన పొలమనుకుంటాడు. యెంత పనికిరానివాడైనా ఆ పొలానికి తాను యజమానిననుకొని యిష్టమొచ్చినట్టు తొక్కాలని చూస్తాడు. పంట పండించి కోసుకోవాలని చూస్తాడు. యెంత చదువుకున్న మొగవారికి కూడా యీ మనస్తత్వం పోదు. అదీ అసలు సంగతి."

నా కిది వింటుంటే విచిత్రంగావుంది.

"అస లేంజరిగింది? మీ ఆయన ఎవరినన్నా మరిగాడా? లేక నీ మీద అనుమానపడుతున్నాడా?" అని అడిగింది.

చెల్లీ! యిది నాకు చాలా విచిత్రంగావుంది. ఆడదానికి పెళ్ళి కాగానే మరో ఆడదానితో యెలాంటివిషయాలైనా చర్చించటానికి పూనుకుంటుంది. మరోవిషయ మేమిటంటే, వాళ్ళు ఉపయోగించే పదజాలంకూడా దాదాపు ఓకేవిధంగా వుంటుంది. యిలాంటి సందర్భంలో నేను అడగవలసివచ్చినా, నీ మొగుడు ఎవరినన్నా మరిగాడా? లేక ఆయనకు నీ మీద అనుమానం కలిగిందా?" అనే అడిగేదాన్ని. అంటే, ఒకవైపు అంతా రూఢిఅయినట్లు, రెండవవైపు పుట్టి అనుమానమే అయినట్లు. మన భర్తలు వలలో చిక్కించుకొన్నదికూడా ఆడదే గదా! అదీ యెందుకు వలలోపడాలి? అని నీవు అడగవచ్చు. దీని కొకటే జవాబు. ఆడవాళ్లు చాలా అమాయికలు. వాళ్ళని తప్పుదారిపట్టించటం అతిసులభం. నేను తారాదేవితో "అలాంటిదేమీ జరగలేదు. మాకు స్త్రీపురుషుల అధికారాల విషయంలో పేచీవచ్చింది," అన్నాను.

"అంటే యెలా?" అన్నది.

"ఆడ దసలు యేంచెయ్యాలి?"

"అంటే? ఆడ దన్నీ చెయ్యొచ్చు. యీనాడుపోలీసుల్లో, సైన్యంలో,

ఆఫీసుల్లో, విమానశాఖలో అన్నిచోట్లా ఆడవాళ్ళున్నారు. ఆడది చెయ్య లేని పనేముంది?" అన్నది ఆమె;

"అయినా ఆడవాళ్ళు మగవాళ్ళ అధికారాన్ని సహిస్తూ పడి వుంటున్నారు."

"అదీ నిజమే!"

"ఎందువల్ల?"

ఆవిడ యేదో ఆలోచిస్తున్నట్లుగా "అసలుసంగతి యేమిటంటే సుశీ! నేను పల్లెటూళ్లకూడా చూశాను. తెల్లవాళ్లున్నరోజుల్లో నేను వూరికే వూళ్ళవెంబడి తిరగవలసివచ్చేది. ఆరోజుల్లో నేను గమనించిం దేమిటంటే, గ్రామాల్లోవుండే మధ్యవర్గానికి, పట్నాల్లోవుండే మధ్యవర్గా నికీ చాలా తేడావుంటుంది. గ్రామాల్లో యిక్కడి మధ్యవర్గంలోలాగా ఆడది కేవలం పిల్లల్నికనటంతోనే సంతృప్తిపడక, తనభర్త చేసే పను లన్నీ చెరిసమానంగా పంచుకుని చేస్తూవుంటుంది. మళ్ళీ యింట్లో వంట కూడా చేస్తుంది. మగవాళ్లు చెలాయించే అధికారాన్ని భరిస్తూ, కాలికింద చెప్పులా పడివుంటుంది. నే నొకసారి ఒకఆడదాన్ని చాలా రెచ్చ గొట్టాను. భర్తని వదిలేసి విడిపొమ్మని సలహాయిచ్చాను. అది కొంచెం బెట్టుచేసేటప్పటికి అతగాడు లొంగాడు. కాని ఆమె మగవాడు లేకుండా వుండలేకపోయింది. మరొకడితో లేచిపోవాలని ప్లానువేసుకుంది. నాకు చాలా ఆశ్చర్యంవేసింది. యెందు కలా చేస్తున్నావని దాన్ని అడిగితే, అ దేమన్నదో తెలుసా!" అంటూ తారాదేవి తన అయిదువేళ్లు నా ముఖం దగ్గర ఆడిసూ పైనుంచి యేదో లడ్డు జారిపడుతుంటే పట్టుకోబోతున్న ట్లుగా అభినయంచేస్తూ అన్నది "అక్కయ్యగారూ, నాకు పిల్లలంటే యిష్టం అన్న దది. అప్పుడు నేను 'ఏమే!పిల్లల్నికనటమే ఘనకార్యమా? నువ్వు పిల్లల్ని కనకపోతే ప్రపంచంఅంతా ఆగిపోతుందా? ఒక గుది బండను వదిలించుకుని, మళ్ళీ రెండోగుదిబండ నెందుకు తగిలించు కుంటా వనవసరంగా?' అని అడిగాను. అది నవ్వుతూ 'మీ ఆయన మీద ఒట్టుపెట్టుకు చెప్పండి అక్కయ్యగారూ! ఆడవాళ్లు పిల్లల్ని కని తల్లులుకాకపోతే, ప్రపంచం యెలా నడుస్తుంది!' అని అన్నది" తారా దేవిమొఖంమీద కోపం, నవ్వూ రెండూ కనిపించాయి. నేను—"మీరు

చెప్పింది నిజమే! యీదేశంలో యెంత అవిద్య వున్నది! యెంత అజ్ఞానమున్నది. వీటన్నిటిని నాశనంచెయ్యాలి?" అన్నాను.

"మా సుశీల యెంత చక్కని విషయం చెప్పింది! నీతో యేం మాట్లాడాలని పిల్చానో యిప్పుడు విను" అన్నది ఆమె.

"అవునవును. మీ రేదో ముఖ్యమైన విషయం చెప్పాలని పిల్చా రన్నసంగతికూడా మరచిపోయా న్నేను. లేనిపోనిది వేరేగొడవల్లో పడ్డాం" అన్నాను.

"నువ్వు మరచినా నేను మరచిపోలేదులే సుశీ! ఆడవాళ్ళకుండే వ్యాపకాలే తక్కువ. అందువల్ల వాళ్ళెక్కువగా మరచిపోరు. మగ వాళ్ళని చూడు! యేదన్నా ఒకవస్తువు తెమ్మని చెప్పామంటే, సాయంత్రం వుత్తచేతుల్తో తిరిగొచ్చి, 'అరె! మరిచేపోయా' నంటారు."

"అవును కాని, వారిపని యేదన్నా కొంచెం మరిచిపోతామా, యిక చూడు, ఆకాశమంతెత్తున యెగిరిపడతారు. తిడతారు. మోటవాళ్ళైతే కొడతారు. తమ ఖర్మకాలినట్లు మాట్లాడతారు. నిజంచెప్పుతున్నాను తారా దేవీ! మగవాళ్ళతో మన కవసరమేముంది? ఆడవాళ్లు తలుచుకుంటే యేపని చెయ్యలేరు? పదండి. మనం యీదేశంలోని నిదురజోతున్న ఆడవాళ్ళందర్నీ మేల్కొల్పుదాం" అన్నాను. ఆవిడనవ్వింది. "పిచ్చిదానా! భర్తమీద తిరగబడటానికైతే ఆడవాళ్ళని రెచ్చగొట్టటానికి అవకాశ ముంది. అదికూడా సాధారణంగా జరిగేపని కాదనుకో! కాని తమపిల్లల పాపలప్రశ్న వచ్చిందంటే వాళ్ల కళ్లోకూడా మనంచెప్పిందాన్ని వప్పు కోరు"

"ఇదంతా అవిద్య. సంప్రదాయబలం. అంతకంటే మరేంలేదు. చేతులారా పెంచిన ఆడపిల్లని పరాయియింటికి పంపించటంలేదా తల్లులు. ఏం? మగబిడ్డ లెక్కువా?"

"లేదు, లేదు సుశీ! యిది జరిగేవిషయం కాదు. అస లిలా జరగనే జరగదు. యింకొకదౌర్బల్యంకూడా వున్నది ఆడదానిలో. అదేమిటంటే, ఆడది ఆడదానితో స్నేహంచెయ్యలేదు. దాని హృదయం భర్తతో కలిసి పోయినట్లుగా మరెవరితోనూ కలవదు. నేను ప్రపంచంలో యెన్నో చూశాను. ప్రపంచంలోవున్న సుఖాలన్నీ కల్పించి యివ్వు ఆడదానికి.

భర్తప్రేమ ఒక్కటే లేకుండాచెయ్యి—ఆమె అప్పు డేమంటుందో తెలుసా ? నా కేసుఖమూ లేదంటుంది. స్త్రీజీవితాన్ని పరిపూర్ణంచెయ్య గలిగినవాడు భర్త ఒక్కడే ! యిదే ఆడదానిలోఉన్న సహజమైన దౌర్బల్యం. దీనివల్లనే అది యెన్నో అవమానాలు, అవహేళనలు భరించవలసి వస్తున్నది." అని తారాదేవి మరికొంచెం ముందుకుజరిగి చెప్పసాగింది. "ఉదాహరణకు ఘోషానే తీసుకో ! యివాళ ఘోషా కావాలని యెవరి కుంది? కాని, యివ్వాళకూడా ఆడవాళ్లు ఘోషాలేకుండా మగవాళ్ళముందుకి రావటానికి సిగ్గువేస్తున్నదంటారు. మరి నువ్వూ ఆడదానివే. నేనూ ఆడదానినే. మనకెందుకు సిగ్గువెయ్యటంలేదు ? వా ళ్ళేమంటారో తెలుసా ? "ఏమండీ మీరు చదువుకున్నవాళ్ళుకదండీ !" అంటారు. అంటే చదువుకున్నవాళ్ళందరూ సిగ్గులేనివాళ్లన్నమాట. యీదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని అంటారు. కాని, యెక్కడాలేనివన్నీ యీదేశంలోనే వున్నాయి. జాతులు మరెక్కడా లేవు. యిక్కడే వున్నాయి. ఘోషా యింకెక్కడా లేదు, యిక్కడే వున్నది. అస్పృశ్యత యింకేదేశంలో లేదు, యిక్కడ వున్నది. పైగా ఒకప్పుడు విశ్వమైత్రి, సమత, భ్రాతృభావాల సందేశం యీదేశంనుంచి యిండోచైనా, చైనా, జపానువరకు వ్యాపించింది. సుశీ, యిదంతా ఆలోచిస్తే యెంత చిత్రంగావుంటుందో నాకు తెలుసు. కాని లోకంపోకడ యిలాగేవుంటుంది. అతినమ్మకంగా నిజాయితీగావుండటం మూర్ఖత్వానికి మొదటిలక్షణ మనుకో. మూర్ఖత్వం అంటే యేమిటి మరి ? అది యెవరికీ లాభించదు. కాని మనకు నష్టం కలిగిస్తుంది." అని నాచెవిలో గుసగుసలాడుతూ రహస్యంగా అన్నది. "చూడ్రాదూ, మహాత్ముడు అనవసరంగా నిజాయితీ కనబరచాడు. యేమైంది? ఆయన చచిపోయాడు, అంతమాత్రాన ప్రపంచంలో అహింసా రాజ్యం వచ్చేసిందా? "

"ఇప్పు డదెందుకులెండి. ఆయనసంగతి వేరు.ఆయనమహాత్ముడు" అన్నాను.

"మెల్లిగా మాట్లాడు, మెల్లిగా! ఆయన మహాత్ముడుకాడని నేను మాత్రం అన్నానేమిటి. నువ్వలా దూరంనుంచి చూశావు. నేను కస్తూరి బాను స్వయంగా కలుసుకున్నాను. జైళ్ళలో పెద్దపెద్ద లీడర్లనుకూడా

చూశాను. కూరలకోసం, నెయ్యికోసం. వెన్నకోసం పోట్లాడుకొనేవాళ్ళు. నేను అక్కడ వాళ్ళందరికి వంటచేసిపెట్టేదాన్నిలే! అందుచేత పైపై మెరుగులు చూసి, తేలిగ్గా మోసపోయేదాన్నికాను నేను. మహాత్ముడు భార్యతో యెన్నిసార్లు పోట్లాడేవాడు. ప్రతిసారీ ఆవిడే లొంగిపోవలసి వచ్చేది.

"కాని మహాత్ముడు క్రొత్తప్రపంచంకోసం కృషిచేశాడు. తన భార్యను పాతసంప్రదాయాల బంధనాల్లోంచి బైటకుతీసుకురావాలని ఆయన ప్రయత్నం. ఆవిడను ఉన్నతస్థాయికి తీసుకువెళ్లటమే ఆయన ఉద్దేశం. పాపం! ఆవిడ చదువుకున్నదికాదు" అన్నాను.

"అయితే కస్తూరిబాయి తనలోవచ్చిన పరివర్తనలన్నిటికీ బుద్ధిపూర్వకంగా తెలుసుకునే వప్పుకున్నదని నీవుద్దేశమా? యెన్నటికి కాదు. పాపం! ఆవిడ వప్పుకోక గత్యంతరంలేదు. యీనాటిసంఘంలో హిందూ స్త్రీకి మరొకమార్గం యేమున్నది? పైగా ఆరోజుల్లో విడాకులచట్టంకూడా వుండేదికాదు. యిప్పుడు వుండిమాత్రం యేంప్రయోజనంలే! దానిని అనిష్టంగా చూడని ఆడది యెక్కడున్నది? నిజం చెప్పుతున్నాను సుశీ! హిందువులజాతే అసలు మూర్ఖపుజాతి. మూర్ఖత్వానికి అన్నింటికంటె గొప్ప గుర్తు యేమిటంటే, మూర్ఖులు తమనిచూచి తామే గర్వపడుతూ వుంటారు--మూర్ఖులమన్నసంగతి వాళ్ళకే తెలియదు. బుద్ధిమంతులమని అనుకుంటూవుంటారు". అని నవ్వుతూ మళ్ళా అన్నది, "నేను సంఘసేవకూడా బాగాచేశాను. యెన్నో పనులుచేశాను. జైళ్ళలో తిరగలి విసిరాను, రోడ్డుమీద పోలీసులకడ్డంగా పడుకున్నాను. ఉప్పుసత్యాగ్రహం రోజుల్లో తెల్లసిపాయిలు నా రొమ్ముమీద బూట్లతో తొక్కుతూ నిర్దాక్షిణ్యంగా నడిచిపోయారు. నేను స్పృహతప్పిపోయేదాన్ని సుశీ!"

నేను ఆవిడవంక గౌరవపూర్వకంగా చూశాను. ఆవిడ తల వూపుతూ చాలా నిరాశగా అన్నది. "కాని అదంతా వట్టి తెలివితక్కువ అనుకో సుశీ! అంతా బూడిదలోపోసిన పన్నీరైంది. లేడీ దాసు—యీ రాకాసి ఆరోజుల్లో యెలా ముఖమల్ పరుపులమీద పడుకునేదో యీనాడుకూడా అలాగే పడుకొంటున్నది. దానికున్న పరువు ప్రతిష్ఠలు నాకు యీనాడుకూడా లేవు. యీనాడుకూడా నేను దానిముందు తలవంచి

నడవవలసిందే. యెందువల్లో తెలుసా! ఆ ముసలిదానిదగ్గర కుప్పతిప్ప లుగా డబ్బున్నది. నాకంటె యెక్కువ సభ్యతకలిగిందని అంటారు దా న్నంతా! యెందువల్లనంటే, అది నాకంటె బాగా యింగ్లీషు మాట్లాడ గలదు. జీవితానుభవంవల్ల నేను గ్రహించిందేమిటంటే, డబ్బే మనిషిని ముందుకు తీసుకువెళ్ళగలదు. వెనక డబ్బు అండవుంచేనే విద్యకూడా పనికివస్తుంది" అని ఓ పెద్ద నిట్టూర్పువిడిచి ఆవిడ మళ్ళీ అన్నది. "జెండా పట్టుకుని వీరులగుంపు ముందుకు సాగుతూవుంటుంది. శత్రువులు తుపా కులు పేలుస్తారు. అప్పు డా గుంపులోని వీరులు కూలిపోతారు. జ్ఞాపకం వుంచుకో. ఆ వీరులంతా కూలిపోయేదాకా యితరులశవాలవెనుక దాక్కునివుండి, వాళ్ళందరూ పడిపోయినతరువాత వచ్చి జెండా యెత్తే వాడే తెలివిగలవాడని ప్రపంచచరిత్ర నిరూపిస్తున్నది."

"మీ రేదో ముఖ్యమైనవిషయం చెప్పుతామన్నారు, అది చెప్పనే లేదు?" అని అడిగాను.

"చూశావా! నేను నీకోసం యిందాకటినించి తలబద్దలుకొట్టుకుని చెప్పుతున్నవన్నీ ముఖ్యమైనవిషయాలు కావని నీ వుద్దేశమా? నీ విప్పు డిప్పుడే సంఘంలోకి వస్తున్నావు. సంఘంఅంటే సొంతయిల్లువంటిది కాదు. యెటువంటి నిర్దయుడైనా భర్త అన్నవాడికి భార్యంటే కాస్తో కూస్తో మమకారం వుండనేవుంటుంది. బొత్తిగా పశువైతే ఆ సంగతి వేరనుకో! అయినా అటువంటివాణ్ణికూడా ఆడది వశపర్చుకోగలదు. కాని యీ సాంఘికజీవితంవుందే, దీనియంత కృతఘ్నమైనబ్రతుకు మరొకటి వుండదు. సంఘంపోకడ గొఱ్ఱెదాటువంటిది. ఆడదంటే సాటి ఆడవాళ్లు కూడా యేవిధమైన ప్రేమనుకాని, సానుభూతినిగాని చూపించరు. యిక్క డందరికి యేదో స్వార్థం వుండనేవుంటుంది.

"మన కేం స్వార్థంవుంది? మనమంతా సంఘాన్ని మేలుకొలప టానికి. స్త్రీల కొకమార్గం యేర్పరచటానికి ప్రయత్నిస్తున్నవాళ్ళం," అన్నాను నేను.

"రమస్థానాన్ని నువ్వు తీసుకుంటే బాగుంటుంది. రమమనసులో భావాలన్నీ స్పష్టంగా వుండేవి. నీ మనసులో ఏదీ స్పష్టంగా వుండదు.

అందువల్లే యీ పదవికి నువ్వు సరిపోతావు" అన్నది తారాదేవి నావంక చూస్తూ.

"అంటే యేమిటి?"

"ఏమీలేదు. రమ యీ రాత్రి వెళ్లుతున్నది. యివ్వాళ ఆవిడ వచ్చిన తరువాత నీకే చార్జి యిప్పిస్తాను. నువ్వు శక్రటరీవై పోతావు," అన్నది ఆమె.

"నామనసులో యేమీ స్పష్టంగా వుండదన్నారుగా మీరు?"

"అదే నీలో మంచితనం సుశీ! అలాంటివాళ్ళే నిజాయితీగా సంఘానికి సేవచేయగలుగుతారు."

"మరి మీరో?"

"మాదేముంది, మేమంతా యిక కూర్చుని ఫలం అనుభవించాలనుకునేవాళ్ళం."

"మంచిది, విత్తులునాటటానికి నాచేతులే బురదచేసుకుంటాలెండి."

"ఎటువంటి విత్తులు నాటుతావు?"

"కొత్తవి!"

"ప్రతి తోటమాలి మామిడిచెట్లు వేసేటప్పుడు నాటబోయేవిత్తనాలు పాతమామిడిచెట్లలో అన్నిటికంటె తియ్యనివి చూచి వాటిల్లోనుంచి యేరి నాటుతాడు. అతడు నాటినచెట్లు తియ్యనిపళ్లు కాస్తాయనే ఆశతోనే నాటుతాడు. ఒకటేమిటంటే, ప్రతివిత్తు పాతచెట్టుపండులోనుంచివచ్చిందే. రెండవదేమిటంటే, అవి కాసేటప్పటికి నాటినవాడు వుండనేవుండడు. మూడవదేమిటంటే, నిజంగా ఆలోచిస్తే యెంత కొత్తవిత్తైనా పేరు మాత్రమేకొత్తది. దానిమూలం పాతచెట్లలోంచే వచ్చినదై యుంటుంది."

ఈవిడగారికి ఇన్ని ఆలోచనలుంటాయని నే నెప్పుడూ అనుకోలేదు. ఈవిడఖద్దరుబట్టలపై చూసి ఈవిడకూడా తెలివితక్కువదద్దమ్మ అనుకున్నాను నేను. నేనేకాదు. ప్రతిఒక్కరూ ఖద్దరుకట్టినవాళ్లను చూసి, ఇది కట్టినవాళ్లు ఇతరులబుర్రతో ఆలోచిస్తుంటారు అని అనుకోవడం సహజం. కాని తారాదేవిమాటలు వింటూంటే, ఆవిడచెప్పినది నాకు నచ్చినా నచ్చకపోయినా, ఈవిడ తెల్విగలదన్న విషయంలోమాత్రం ఏమీ సందేహంలేదు అనిపించింది. మరి ఎలా గ్రహించిందో కాని.

ఆవిడ నా మనసులోనివిషయం గ్రహించి అన్నది". సుశీ! ఒకటిమాత్రం నిజం. తనకంటె పెద్దనాయకుని అభిప్రాయాల ననుసరించి నడచుకొనే వాడే నిజమైన రాజకీయవేత్త. నాయకుడు ఆలోచించకుండా ఏ చెత్త వాగినా, దానిని ఏదోవిధంగా సమర్థించి, చాలాగొప్పసంగతి అనిపించేలా చేసి, తనగురువైన ఆ నాయకునిచేతనే "శభాష్" అనిపించగలిగినవాడే నిజమైన శిష్యుడు. అందాకా ఎందుకు? అన్నిటికంటే ముఖ్యవిషయ మొకటి చెబుతాను విను. పోలీసులు శాంతిని సంరక్షించేది జులుంవల్ల, నమ్మకద్రోహంవల్ల. సైన్యం శాంతిని సంరక్షించేది హత్యాబలంవల్ల. నాయకుడు శాంతిని సంరక్షించేది మోసాన్ని ఆధారంచేసుకొని. నైతికంగాచూస్తే వీళ్లందరూ పతితులనవలసిందే. ప్రజలంటావా, వీళ్లందరి కన్నా మూర్ఖులు. ఉద్యోగాలు దొరకని బుద్ధిమంతులూ తెలివిగలవాళ్ళూ ఎవరన్నాఉంటే, పొట్టకోసం నానాతిప్పలు పడుతున్నారు. అలాంటి వారిలో ఎక్కువమంది తమకున్న ఉన్నత కాంక్షలకు నీళ్లు వదులుకోవ లసివస్తుంది మరి కొంతమంది ఎలాంటి నీచులుంటారంటే, సిగ్గు శరము. అన్నీ వదిలివేసి, అధికారం చేజిక్కించుకోవటానికి వారు కొత్తకొత్త సిద్ధాంతాలు సృష్టించి, ఆడంబరంగా కొత్తకొత్తపార్టీలు లేవదీయటానికి పూనుకుంటారు. ఈ తుచ్ఛుల్లో గొప్పగొప్ప ధర్మవన్నాలచాటున దాగని వాళ్లు తొందరగానే పట్టుబడతారు. కాని ధర్మపన్నాలచాటున దాక్కొనే వాళ్ళు, తమ మూర్ఖత్వాన్ని మరుగుపరచి, వాటిద్వారా ప్రజలను మభ్య పెట్టేవాళ్లు చాలారోజులదాకా పట్టుబడకుండా ఉండగలరు. వారివల్ల పెద్ద అపాయం ఏమిటంటే. వాళ్లు మనదౌర్బల్యాన్ని ఆధారంచేసుకుని మనను అణగదొక్కి చివరకు అధికారం హస్తగతంచేసుకున్నా చేసుకోవచ్చు."

ఆవిడ ఉపన్యాసధోరణిలో నేను పెద్ద చిక్కులోపడిపోయాను. "మీరు రమనిగురించి యేదో చెప్పబోయారు—" అనడిగాను.

"అవును" ఆమెకు జ్ఞాపకమొచ్చింది.

"ఆవిడ తెలివిగలదేనంటారా ?"

"మనిషి యెంత తపస్సుచేసినా, మానవలోకంలో తీసుకురాగలిగిన పరివర్తనం శూన్యం అని ఆమె వుద్దేశం. ఒకవ్యక్తి ఉన్నతస్థాయి నందుకుంటే అది యితరులకు పాఠం కావచ్చుగాని, పెద్ద పరివర్తనం

మాత్రం తీసుకురాలేదు. అందువల్లనే రమ పదవిని అధికారాన్ని తన ఔన్నత్యానికి సాధనాలుగా భావిస్తుంది. "నీవు ఉన్నతిలోకొస్తే చాలు. యితరులు చూచి నేర్చుకుంటారు. వూరికే వుపదేశాలిస్తే ముందు నీ సంగతి చూచుకోవోయి! అంటారు" అని అంటుంది రమ. యిక మన కృషినిగురించి యోచించాలి. అసలు ఉన్నతిఅంటే యేమిటి? యే శాఖలో వున్నవాడు దానిలో పైకిరావాలి, ప్రకాశించాలి. నేడుకూడా తెల్లవాళ్ళ రాజ్యాన్నిసమర్ధించినవాళ్లు తమపేరువల్ల పూజించబడుతున్నారు. యెందు చేత ? వాళ్ళు స్వయంకృషివల్ల పైకివచ్చారుగనక" అన్నది తారాదేవి.

"ఉహూం!! నేను వప్పుకోను. యివి వ్యక్తిగతస్పర్ధలవల్ల అసాఫ ల్యంవల్ల కలిగినటువంటి భావాలు. మనం నిజాయితీగా పనిచేస్తే లోకం యెందుకు బాగుపడదు? తప్పకుండా బాగుపడుతుంది. యుగ యుగాలనుంచి కవులు సౌందర్యాన్ని సృష్టిస్తూవచ్చారు. చూడండి! యిదంతా వ్యర్ధమేనని మీరు అంటారు. కాని వాస్తవంగా మానవుడు మునుపటికంటె యెక్కువ నాగరకుడు కాలేదా ? పూర్వం మనుష్యుడు యితరులను వూరికే హత్యచేసేవాడు. మగవాడు ఆడదాన్ని మోసంగా బలాత్కారంచేసి యెత్తుకుపోయేవాడు. వాటినే పైశాచికవివాహాలనేవారు. ఒకప్పుడు ఆడదాన్ని ఖడ్గబలంవల్ల, బాహ్యబలంవల్ల లాక్కొని తీసుకు పోయేటటువంటి రాక్షసవివాహంకూడా మంచిదే ననుకొనేవారు. నేటికి గూడా తోరణాన్ని గురిపెట్టికొట్టే ఆచారంలో దానిఆనవాలు మిగిలివున్నది. కాని మునుపటిలా మనం వీటన్నిటిని సమర్ధించటంలేదు. మంచివను కోటంలేదు. యిప్పుడు వున్న లోపంఅల్లా మన ఆలోచనల పురాతన పద్ధతిలో వున్నది. ఆ క్యాలండర్ వేలాడుతున్నదే మీముందు, అది చూడండి" నేను వేలెత్తి చూపిస్తూ అన్నాను. "అందులో అర్జునుడు సుభద్రను లేవదీసుకుపోతున్నాడు. యివ్వాళ యెవరన్నా ఒక ఆడదానిని లేవదీసుకుపోతే వానిఫొటో యిలా వేలాడవేసుకుంటారా ? ఒకరిమెడ మీద ఒకరు చేతులువేసుకున్నట్టుగా రాధాకృష్ణుల బొమ్మలుంటై. వాటిని మనం అసభ్యంగా భావించటంలేదు. నేను మీరు మన భర్తలతో యిలాంటి ఫొటోలుదిగి శుభ్రంగా చిత్రాలుకట్టించి మనగదుల్లో వ్రేలాడ కట్టుకుంటే చూసినవా ళ్ళేమంటారు ? పైగా రాధ కృష్ణునిభార్యకూడా

కాదు. యిదంతా మనదృష్టిలోవచ్చిన మార్పు. కాలం మారిపోతున్నది. యేళ్లు గడిచినకొద్దీ మనలో నాగరకత యెక్కువవుతున్నది" యింతలో "హలో సుశీ!" అనే పిలుపు వినిపించింది. సంతోషంతో గాలిలోతేలి పోతూ రమ విసురుగా గదిలో ప్రవేశించి తారాదేవిచెయ్యి పట్టుకుని, "యు డిడ్ ఇట్, నేను మీకు యేవిధంగా కృతజ్ఞత తెలపను ?" అన్నది.

"నేనా ! నేనుకాదు. చేసిందంతా మన సుశీల" అన్నది తారా దేవి. యింతలో వెనకనుంచి ఒక గంభీరమైన కంఠం వినిపించింది. "నే నదే చెప్పబోతున్నాను. మిసెస్ రాజ్! నేను కృతజ్ఞతలేనివాణ్ణికాదని యిదివరకుకూడా చెప్పాను"

"బట్ వాటీజ్ ది మేటర్ ?" అన్నాను నేను.

"వుయ్ ఆర్ గోయింగ్ !" రమ అతిమధురమైనకంఠంతో యేదో కవిత్వం చదువుతున్నట్లుగా సాగదీస్తూ అన్నది. "అంతా డిసైడ్అయి పోయింది. వీసా రెడీ ! పాస్‌పోర్టు రెడీ. ఆల్ డ్యు టు యూ-టూ" అన్నది మళ్ళీ ఆమె. ఆవిడఆనందం పట్టపగ్గాలులేకుండావున్నది. యింతలో లేడీ దాస్ "రమ యేదీ ? మా రమ యేదీ ?" అంటూ ప్రవే శించింది. యిప్పుడు చాలా తియ్యగానే మాట్లాడుతున్న దావిడ. రమ కూడా అదేవిధంగా సంతోషంగానే ఆవిడను కౌగలించుకున్నది.

"నీతో యింకెవరెవరు వస్తున్నారు ?" అని అడిగింది లేడీ దాస్.

"వీరు !" అని రమ రచయితమహాశయునివేపు సైగచేసింది.

"వీరుకూడానా ?" అని లేడీ దాస్ ఆ రచయితవైపు యెటువంటి హీనపుచూపు చూచిందంటే, ఆ రచయితమహాశయుడు ముళ్ళమీదున్న ట్లుగా భావించాడు. నిజంగా యీ రచయితలుకూడా విచిత్రమైనవాళ్ళే!

మిగిలినవాళ్ళంతా బయటికెళ్ళినతరువాత నేను రమతో "యింకే మిటి విశేషాలు? అయితే, రచయితమహాశయుడుకూడా నీవెంట వస్తున్నా డన్నమాట !" అన్నాను. రమ నవ్వి "చాలా గమ్మత్తయిన మనిషిలే ! తెలివిగలవాళ్ళుకూడా యింత తెలివితక్కువవాళ్ళని నాకు యిదివరకు తెలి యదు. సుశీ! ప్రపంచంలో యింటలెక్చువల్స్‌కు యింత శక్తివున్నప్పటికి వీళ్ళచేతుల్లో అధికారం యెందువల్లవుండదో నా కిప్పు డర్థమైంది. తమ కంటె యింటలెక్చువల్‌గా తక్కువవాళ్ళయిన నాయకులను వీళ్ళెందుకు

అనుసరిస్తారో తెలిసింది. వీళ్ల ఫండమెంటల్‌గా మహా సెల్ఫ్ బిల్డ్రేయర్స్, ఓవర్ సెటిమెంటల్ ఫెమినైన్‌టైప్స్ అయివుంటారు. వీళ్లు బుద్ధికి లొంగేవాళ్లుకాదు. చెప్పుదెబ్బలకుమాత్రం భయపడతారు. వీళ్ళ 'ఈగో !' వీళ్ళని అథఃపాతాళానికి తీసుకుపోతుంది. పోలీసులు, సైనికులు, నాయకులు పరస్పరం కొట్లాడుకున్నా, పులుల్లా కొట్లాడుకుంటారు. కాని వీళ్లు కుక్కలు—వట్టి కుక్కలు!

రమ యివన్నీ యెందుకు చెప్పుకొచ్చిందో నా కర్థంకాలేదు. స్త్రీ అయ్యిండికూడా ఆవిడ స్త్రీత్వాన్ని గురించి యెంతచులకనగా మాట్లాడింది! కాని నా కప్పుడు జ్ఞాపకంవచ్చింది—మగపిల్లలు యేడుస్తుంటే చూచి మనం 'ఛా ! ఛా ! అలా యేడవ్వచ్చా ! తప్పుగదూ ? మగపిల్లలెక్కడన్నా ఆడపిల్లల్లా యేడుస్తారా! మగపిల్లవాడివి నువ్వు, యెంత ధైర్యంగా వుండాలి అంటాము మనం. చెల్లీ ! మన దాస్యం నిజంగా చాలా పాతుకుపోయింది. మనభర్తలకు మనలాంటి స్వభావాలుండాలని నీవూ నేనుగూడా కోరుకోంగదా.

అంతే, రమతో యెక్కువగా మాట్లాడటానికి నా కవకాశంచిక్కలేదు.

అక్కడిన్నుంచి బయటివరండాలోకి చూసేసరికి నే నలాగే కొయ్యలా నిలబడిపోయాను. రచయితమహాశయుడు ఐస్‌క్రీమ్ దొన్నిలో నుంచి తీసిన ఐస్‌కాండీలాగా నున్నగా మెత్తగా నిలబడివున్నాడు. ఆయన ప్రక్కనే యిరవై యిరవైరెండు సంవత్సరాల వయస్సుగల యిద్దరు మగపిల్లలు. పదహారు, పదిహేడేళ్ళ పిల్ల లొకయిద్దరుముగ్గురు నిలబడి ఉన్నారు, అందరూ సంతోషంగా వున్నారు. అందరూ యికిలిస్తున్నారు. విషయమేమిటంటే, రచయితమహాశయుడు ఆటోగ్రాఫ్‌లిస్తున్నాడు. నేను ఒకసారి ఒకయాక్టర్ యిలాగే ఆటోగ్రాఫ్‌లివ్వటం చూశాను. ఆ మూర్ఖత్వంతోకూడుకున్న దృశ్యం నే నింతవరకు మరచిపోలేకపోయాను. ఆ యాక్టర్ తాను నారదమునివంటివాణ్ణని భ్రమపడితే, అతను ఒక యాక్టరే కాబట్టి క్షమించటానికి అవకాశముంది. కాని రచయిత !

ఆయనముఖంలో యెంత మార్పొచ్చిందో నేను నీ కేమి చెప్పేది! లేడీ దాస్ దెబ్బకు తట్టుకోలేక యిప్పుడిప్పుడే బయటకు పారిపోయి

వచ్చినవ్యక్తి యితనేనా అనిపించింది. రమా రస్తోగి కొద్దినిముషాల ముందు షేక్స్పియర్‌లాగా వర్ణించినవ్యక్తి యితనేనా అనిపించింది.

ఆయన అతి గంభీరంగా నన్ను చూసికూడా చూడనట్లు వూరుకున్నాడు. ఆటోగ్రాఫ్‌లిస్తున్నాడుగదూ మరి ! ఒక కుఱ్ఱవాడాయన్ని "మేము మీ నవలంతా పూర్తిగా చదివేశాం. కాని ఒకవిషయం అర్థం కాలేదు మాకు. మకరందుణ్ణి యీ యుగానికి చిహ్నంగా భావించవచ్చా?" అని అడిగాడు.

మకరందుడు బహుశా ఆయన నవలలో యేదో పాత్రఅయివుంటుంది. రచయితమహాశయుడు జవాబివ్వటానికి సిద్ధంకావటం చూస్తే యింట్లోనొకరు రాక్షసిబొగ్గుకుంపటి వూదటానికి సిద్ధమవుతూ పొగ తగుల్తుందేమోనన్నభయంతో ముందుగానే కళ్లుమూసుకుంటున్నట్లు అనిపించింది. "మీప్రశ్ననుగురించి నేను ఆనాడు ఆలోచించినట్లే యీనాడుకూడా ఆలోచిస్తున్నాను. అసలు యుగమంటే యేమిటి? ఒకయుగంలోని విభిన్నమైన మరియాదలను ఒకేవ్యక్తిలో యిమడ్చటం యెలా సాధ్యమవుతుంది? నేను వ్యక్తివికాసం, వ్యక్తిఔన్నత్యం చూడగోరుతున్నాను. హిందీ నవలల్లో వ్యక్తులు లేరు. మొట్టమొదటిసారిగా నేనే తీసుకొచ్చాను" అన్నాడు.

ఇంతవరకూ తనకు అంత వ్యక్తిత్వంఅంటూ యేర్పరచుకోలేని వ్యక్తి యెన్ని వాగాడా ! అనుకున్నాను నేను. అయితే, నిర్లజ్జతఅనే అగ్నిలో చక్కగా కాలినతరువాత కుండ నీటిని పీల్చలేదన్నసంగతి నాకు బాగాతెలుసు. అందువల్లనే బహుశా సంఘం యిటువంటి తప్పించుకోవటానికివీల్లేని మోసగాళ్ళను వుపయోగించుకోవటానికి మరొకపద్ధతి కనిపెట్టింది. వీళ్ళను కుండల్లాగా మనమే నీటితోనింపుతూ, ఆ నీరు వాడుకోగానే మళ్ళీమళ్ళీ నింపుకుంటూవుండాలన్నమాట. నా మనస్సు యెందుకో అసంతృప్తితో నిండిపోయింది. ఆరోజునే నేను సాంఘికసంక్షేమకేంద్రానికి శక్రటరీనయ్యాను.

ఇంటికొచ్చేటప్పటికి డాక్టర్ నిమోలియా కూర్చునివున్నాడు. నాకు అసహ్యంవేసింది. కాని తప్పించుకోవటానికి మార్గంకనపడలేదు. నేను లేనిపోని నవ్వుతెచ్చిపెట్టుకొని "చాలారోజులతరువాత మాయింటికి దయ

చేశా"రన్నాను. మగవాళ్ళ క్షౌరపుడబ్బాలోని బ్లేడ్లు అరిగిపోగానే పార వేసినట్లుగా మామూలుగా మాట్లాడుకునే మాటలన్నీ అయిపోయాయి. డాక్టర్ నిమోలియా వెళ్ళిపోయాడు. వారు నావంకచూచి వంటఅయి పోయినట్టుంది, భోంచేద్దామా అని అడిగారు. నాకూ్కడా బాగా ఆకలి వేస్తున్నది. లేచి వారిని సమాధానపరచటానికిఅన్నట్లుగా "నేను వడ్డిస్తా నుండండి !" అన్నాను. అంతా సిద్ధంచేశాను.

"నువ్వుకూడా కూర్చోరాదూ ?" అన్నారు వారు.

"వద్దు. మీరు కానివ్వండి. నే నింట్లో పనిపాట లేమీ చెయ్యటం లేదని మీరే అంటారు మళ్ళీ"

"బాబోయి! నే నెప్పు డన్నాను?" అని నవ్వారు వారు. మాటమార్చి మళ్ళీ.

"ఎక్కడికెళ్ళావు? మీ కేంద్రాని కెళ్ళావేమిటి ?" అని అడిగారు.

''మా కేంద్రానికి కాదుగాని కేంద్రానికి వెళ్ళాను"

''అదేలే, అంతా ఒక్కటే. యీ మాంసం బాగుంది. మాంసం వండటంకూడా ఒక ఆర్టే" అన్నారు మావారు. నేను కల్పించుకోలేదు.

చెల్లీ ! నా కిప్పుడు సర్వం ఆఫీసేఅయింది. యెప్పుడూ తీరిక లేకుండా వుంటున్నాను. నాకు యిక్కడ అంతా తెచ్చిపెట్టుకున్నదిగా తోస్తున్నది. జీవితమంటే కేవలం ఉన్నత మధ్యవర్గంమాత్రమే కాదని అన్నావు నీవు.నేను జీవితంలో వాస్తవికతను చూడలేదనేగా నీవ్యంగ్యం? అయితే చూస్తాను, తప్పక చూస్తాను. యీసారి నీకు మళ్ళీ ఉత్తరం రాసేటప్పుడు కలిగిన అనుభవాలుకూడా రాస్తాను. నేను యీ జీవితంలో మార్పుతీసుకురావటంలో తప్పకుండా కృతకృత్యురాలనవుతాను.

నీ సుశీల.

పి. యస్.-మళ్ళీ తొందరలోనే రాస్తాను. నా మనసులో వున్నది నీదగ్గ రెప్పుడూ దాయను.అన్ని విషయాలూ రాస్తాను. గెలుపు, ఓటమి— యేది కలిగినా తెలియపరుస్తాను.

ప్రియమైన సోదరీ!

ఇంట్లో తగాదాలకు నే నింత ప్రాధాన్యం ఎందుకివ్వాలి? సంఘానికి పనికివచ్చేపనులు ఎందుకు చేయకూడదు? అని ఆలోచించి, నేను నా జీవితక్రమాన్నే మార్చివెయ్యాలని నిశ్చయించుకున్నాను. ఇటీవల ఒక చిన్నసంఘటన జరిగింది. మా పొరుగావిడ పేరు మిసెస్ కటారా. ఒక రోజున మిసెస్ కటారా వచ్చి, ఈమెకు కొంచెం శ్రమఇవ్వటానికి వచ్చాను." అన్నారు. "ఫర్వాలేదు, చెప్పండి అన్నాను. ఆయన కొంచెం సంకోచించి "ఏం చెప్పేది?" అన్నారు.

"ఫర్వాలేదు — చెప్పండి."

"నా వైఫ్ చాలా...."

"జబ్బుగా ఉన్నారాండి?"

"అవునండీ, డాక్టరును పిలవటానికి పోతున్నాను. ఆవిడ స్పృహ లేకుండా పడివున్నది. ఇంట్లో యెవరూలేరు. మీరు కొంచెం వస్తే....నే నేమని చెప్పేది. నాకు చాలా సిగ్గుగావుంది. అప్పుడే ఎనిమిదిన్నర అయింది. నేను ఆఫీసుకూ్కడా వెళ్ళాలి. బస్సులు అక్కడకు చేరటానికే గంటపడుతుంది. ఈరోజుల్లో బస్సుల్లో ఎంత సమ్మర్దంఉండేదీ మీకు తెలుసుగదా? క్యూలో అలాగే నిలబడిఉంటాం. లేటైపోతుంది. మా ఇంట్లో దాసీదికూడా లేదు. నౌకరు ఉన్నాడు. ఈస్థితిలో అంతా వాడిచేతుల్లోపెట్టి ఎలావెళ్ళేది?" అన్నాడు ఆయన. పాపం! నిజంగా చాలా ఏడుపు ముఖంపెట్టేశాడు.

"మీరు ఎందు కిలా అనవసరంగా మధనపడుతారు. నేనున్నాను గదా? ఇరుగుపొరుగునఉండి ఈమాత్రం సాయపడకపోతే ఇంకెందుకు? కొంచెం ఉండండి మీరు. నే నిప్పుడే వస్తున్నాను." అని లోనికివెళ్ళి త్వరత్వరగా స్లిప్పర్లువదిలి, చెప్పులువేసుకొని నేను బయలుదేరబోయే టప్పటికి వారు "ఎక్కడి"కని అడగనే అడిగారు.

"పొరుగావిడ స్పృహలేకుండా ఉన్నదట. ఆవిడ హజ్బెండ్ పిలవటానికి వచ్చారు. పాపం! ఒంటరివాడు ..."

"అయితే వెళ్ళిరా. కాని ఒకటిమాత్రం గుర్తుపెట్టుకో. నీ మంచితనంవల్ల అనవసరమైన చిక్కులుమాత్రం తెచ్చిపెట్టుకోకు"

నాకు మండుకొచ్చింది. ఏం మనిషి ఈయన? కాని వాదించటానికి నేను ఆగలేదు. బయటకు వెళ్ళి "పదండి!" అన్నాను. నేను రావటం చూచి. కటారీగారు సంతోషం పట్టలేకపొయ్యారు. "ఏంచేసేది? నేను బొత్తిగా నిస్సహాయుణ్ణయిపోయాను." అన్నారు. "దానిదేముంది? పర్వా లేదులెండి. మీరు అనవసరంగా చింతించక వెళ్ళి వెంటనే డాక్టర్ను తీసుకురండి," అన్నాను.

నేను వారింటికి వెళ్ళి చూశాను. మిసెస్ కటారాకి 22, 23 ఏళ్ళ వయస్సు ఉండవచ్చు. ఎర్రగావుంటుంది. పాపం, పక్కమీద స్పృహ లేకుండా అలా పడివున్నది. శరీరం బిగుసుకుపోయింది. పళ్లు పటపట కొరుకుతూంది. నేను యిన్నాళ్ళనుంచి వీళ్ళ పొరుగునే వున్నప్పటికీ, కలుసుకునే అవకాశం చిక్కలేదు. యీ బస్తీలో జీవితమే అలాంటిది. మన పొరుగువాళ్ళెవరో తెలుసుకునే తీరికకూడా వుండదు. మనకాలమే యింత అమూల్యమైపోయిందో, లేక మన అహంకారమే యింత యెక్కువగా పెరిగిందో చెప్పటం కష్టం. మొత్తానికి బస్తీలో ఒకర్ని ఒకరు కలుసుకోవటం తక్కువ, అసలు పనిలేకుండా ఒకరి నొకరు కలుసుకోవటం అసభ్యతఅనికూడా అనుకుంటారు. నిజంగా మన నైతిక ప్రమాణాలు యెంత మారిపోయినయి, పనివుంటేనే కలుసు కోవాలని మనం యూరపును కాపీగొట్టి నేర్చుకున్నాం కాని, వాళ్ళక్లబ్బు ల్లోవున్న ఆ సంఘజీవితం మనసంఘంలో యెంతో కృత్రిమంగా తయా రైంది. వాళ్ళలోవున్న చెడుమాత్రమే మనం నేర్చుకున్నాం, కాని మం చిని నేర్చుకోలేకపోయాం.

నాకు మిసెస్ కటారాను చూసి, నిజంగా భయంవేసింది. "యిది వరకుకూడా యెప్పుడన్నా యిలా జరిగిందా?" అని అడిగాను.

"ఒకటి రెండుసార్లు యిలాగే జరిగింది, కాని వూరికే తల తిరి గిందేమోలే అనుకున్నాను నేను. అప్పుడు స్పృహకూడా చాలా తొంద రగా వచ్చేసింది" అని జవాబిచ్చారు కటారా.

ఆయన డాక్టరుని తీసుకురావటానికి వెళ్ళిపోయారు. నే నక్కడ కూర్చుని ఆమెకు విసరసాగాను. పది నిముషాల్లో లేడీడాక్టరు రానే వచ్చింది. ఆవిడ కణతలమీద వెంట్రుకలు తెల్లబడ్డాయి. కాని చూట్టాని

చాలా ఆరోగ్యంగా ఉంది. చాలా పరిశుభ్రంగాకూడా ఉంది. ఆవిడ రోగిని పరీక్షచేసి యేదో మందిచ్చింది. వెంటనే మిసెస్ కటారాకు స్పృహవచ్చేసింది. స్పృహరాగానే ఆవిడ వెక్కి-వెక్కి యేడ్వసాగింది.

"మిసెస్ రాజ్ మాపొరుగునే వున్నారు." అని మిష్టర్ కటారా నన్ను లేడీ డాక్టరుకు పరిచయంచేశారు.

"వీరి జబ్బేమిటి?" అని అడిగాను. డాక్టరు నా ప్రశ్నవిని మిష్టర్ కటారావైపు తిరిగి "యీవిడ మీకు...."

"నా వైఫ్అండి" అన్నారు కటారాగారు. ఆయనమొహం యెందుకో వెలవెలపోయింది. కళ్ళలో చాలా భయం కనపడసాగింది.

" మీ పెళ్ళెప్పుడైంది?"

"అప్పుడే నాలుగుసంవత్సరాలైంది."

"మీ కెంతమంది పిల్లలు?"

"అసలు లేరండి."

"కలగనేలేదా? లేక ...."

"లేదండీ, కలగనేలేదు."

" యీ విషయంలో మీ రెవరైనా డాక్టరుకి చూపించి, సలహా తీసుకున్నారా?"

"అంటే నా కర్థంకాలేదండి."

డాక్టరు మళ్ళీ అలాగే అతి మృదువైన స్వరంతో అడిగింది "యీ విషయాన్నిగురించి మీ రెన్నడూ ఆలోచించలేదా?"

"లేదండీ! దీంట్లో ఆలోచించటాని కేముందండి? మా అమ్మగారున్నారు. వారు మా అన్నయ్యగారింటికి వెళ్ళారు. ఆమె అప్పుడప్పుడు పూజలు-గీజలు చేయిస్తూవుంటారనుకోండి. కాని నాకుమాత్రం యిలాంటి వాటిలో నమ్మకం లేదండి."

"అయితే వీరికి జబ్బేమిటి?" అని అడిగాను నేను మధ్యలో అడ్డుపడి.

"హిష్టీరియా" లేడీ డాక్టరు జవాబిచ్చింది. హిష్టీరియా అనేది ఒకరకమైనజబ్బు. ఆడదానికి సంతానం కావాలనే కోరికవుండి, అది పూర్తికానప్పుడు సాధారణంగా యీ జబ్బు వస్తూవుంటుంది. ఒకళ్ళిద్దరు

పిల్లలు కలగగానే అంతా మూర్ఛలుకూడా తగ్గిపోతూవుంటాయి" అని నాకు నచ్చజెప్పింది ఆమె.

చెల్లీ! యింతకుమించి యీ కథనుగురించి యిక్కడ రాయవలసిన అవసరంలేదు. నేను వారిద్దరినుంచి అనేకమైన అభినందనలు పొంది యింటికి తిరిగివచ్చాను. కాని అప్పటినుంచి నా కొకటే ఆలోచన పట్టుకుంది. ఆడదానికి మాతృత్వం అనేది యింత తప్పనిసరా? సంతానం కలగనంతమాత్రాన మనకు మూర్ఛరోగాలొస్తాయా? హిస్టీరియావున్న ఆడవాళ్ళకు ముక్కుమీదే కోపంవుంటుందన్నసంగతి నే నిదివరకుకూడా విన్నాను. విషయవాంఛలతృప్తియే స్త్రీ పట్ల మానవత్వపు వివశత్వంగా పరిణమిస్తుందా? యిదే సంఘంలో యింత సహజంగా గౌరవపూర్వకంగా ప్రకటించబడుతుందా? స్త్రీ దేహమే ఆవిడ ఆధ్యాత్మికతత్వాభివ్యక్త మార్గమా? యిది యెంత విచిత్రమైన విషయం? యిక్కడి కొచ్చేటప్పటికి నా బుద్ధి యేమాత్రం పనిచెయ్యటంలేదు. యీ జీవితమే ఒక భయంకరమైన చెరసాలఅని, అందులో మనమంతా మన రక్తమాంస నిర్మిత దేహాలకు దాసులమని అనిపిస్తుంది. నే నీ విషయం తారాదేవితో చెప్పితే, ఆవిడ "సుశీ! నువ్విలాంటివన్నీ యెందు కాలోచిస్తావు?" అన్నది.

స్త్రీ నిజానికి యెంత వివశురాలు! అనిపిస్తుంది నాకు. ఆవిడ కొంచెంసేపు ఆలోచించి "నిజంగా నువ్వు యిలాగే అనుకుంటున్నావా?" అని అడిగింది.

"అవును, ఏం?"

"నువ్వు పొరపాటుపడుతున్నావు."

"నా కప్పుడు చాలా ఆశ్చర్యంవేసింది. యీవిడ మనసులో యెంత ఆలోచిస్తూవుంటుంది. కాని ఆవిడమొహం చూస్తే, యీవిడ కే కొంచెమైనా మెదడువుండవచ్చని తోచదు. "పొరబడుతున్నానా నేను?" అని అడిగాను.

"చూడు. నవయవ్వనంలోవున్న ఆడవాళ్ళుకాని, మగవాళ్ళుకాని యేవో తమతమభావాలు యేర్పరచుకోవటం సహజంగా అలవాటవుతుంది. ఇది మన నాగరకతలోనూ, విద్యాపద్ధతిలోనూ వున్నలోపం."

నా కర్థంకాలేదు. బహుశా నా మొహంమీద అవహేళనాభావం కూడా కనిపించివుంటుంది. ఆవిడ మళ్ళీ "చూడు, దేనిలోనూ తొందర పనికిరాదు. యీ ప్రపంచం అతిపురాతనమైనదని వప్పుకుంటావా?" అని అడిగింది.

"అవును."

"కాని మనం ఏసుక్రీస్తుకాలంనాటినుంచి కాలాన్ని విభజిస్తున్నాం. క్రీస్తుకుముందు వున్నదానిని పురాతనమని అంటున్నాం. తరువాత కాలాన్ని కొత్తదని భావిస్తున్నాం. కాని యిది అనుచితమైనదృష్టి. ప్రపంచం కేవలం ఈ రెండువేలసంవత్సరాల అనుభవంతో కూడుకున్నదే కాదు. క్రీస్తుకుముందే బుద్ధుడు పుట్టాడు. బుద్ధుడు చరిత్రకు తక్కువ యిచ్చివెళ్ళాడా? కాని యిప్పుడు మనదృష్టి కాలాన్ని ముక్కలుముక్కలు చేసి చూడటానికి అలవాటుపడింది. యిదే మన నాగరకతమొదటిలో పట్టిన వేరుపురుగు. యిక నేను విద్యనుగురించి చెపుతాను. పాశ్చాత్య విద్య అభ్యసించిన ప్రతివాడు తెలివితేటలనేవి వాడితోనే మొదలవి, ప్రపంచాన్ని యిదివరకటికంటె బాగుచెయ్యవలసిన భారమంతా వాడి బుజాలమీదే వుందనీ అనుకొంటూవుంటాడు. ప్రపంచంలో యెన్నో చట్టాలు నిర్మించబడుతున్నవి. యీ చట్టాలు నిర్మిస్తున్నది మానవుని సంరక్షణకోసం. కాని సంరక్షిస్తున్నది యెవరిని? ఆదిమకాలపు అరణ్య వాసికి ఒకవిధంగా రక్షణ లోపిస్తే, నేడు మనకు యింకోవిధంగా రక్షణ లోపించింది. పూర్వం జబ్బపుష్టి రాజ్యమేలితే, యిప్పుడు డబ్బు రాజ్య మేలుతున్నది. అందుకనే అసలు మూలం యేమీ మారదనీ, బాహ్య రూపంమాత్రం మారుతూవుంటుందనీ" నే నన్నాను. "నాకు డార్విన్ సిద్ధాంతాలమీదకూడా నమ్మకంలేదు. కోతులకు మనుషులకు పూర్వీకులు ఒకళ్ళో కాదో యెవరికి తెలుసు? అంతా ఒక భావన. భూమి యిలా పుట్టింది, సూర్యుడు యిలా పుట్టాడు అంటారు. యిదంతా యెవరు చూశారు? అంతా ఊహాగానమే. మనకు తెలిసింది చాలా కొద్ది. అస లిప్పుడు నీవు తిరగబడతానంటున్నావే అది యెవరిమీద? మగవానిమీదా? ఆడది మగవానిమీద యెన్నటికి తిరుగుబాటుచెయ్యలేదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. యెందువల్లనంటే, ఆపని నేనే చెయ్యలేకపోయాను."

"నిజంగా? మీమనసులో చాలా ఆలోచనలున్నాయి. కాని మీరే ఆడవాళ్ళందరికి ప్రతినిధులా?" అనడిగాను

నాకు నవ్వువచ్చింది. ఆవిడకు కొంచెం కోపంవచ్చి "నే నొక విషయం అడుగుతాను. నువ్వేమీ అనుకోవుగదా?" అన్నది.

"అడగండి! అన్నాను.

"ఆ, వద్దులే! యెందుకొచ్చినబాధ!"

"లేదు, లేదు. మీ రడిగేదేమిటో అడగండి."

"అయితే, నీ భర్త అంటే నీ కెంత అసహ్యమో చెప్పు చూద్దాం" అన్న దావిడ.

"అసహ్యమా! నాకా! యేమన్నారు మీరు?" అని నేను కొంచెం ఆవేశంగానే అన్నాను.

తారాదేవికి నవ్వువచ్చింది. ఆవిడపళ్ళు తెల్లగా మెరిశాయి. నుదుటి మీద చిన్నచిన్న గీతలు కనిపించాయి. "నీవు అసహ్యించుకోలేనిపక్షంలో అసలు తిరుగుబాటనేప్రశ్న యెందుకొస్తుంది?" అని అడిగింది.

"నేను చెప్పేది మీ కసలు అర్థంకాలేదు." అన్నాను.

"అర్థమయ్యేటట్టు చెప్పు" అన్నది ఆవిడ,

"నేను మగవాళ్ళకు వ్యతిరేకినికాదు. నేను చెప్పవచ్చిందల్లా ఏమిటంటే, ఆడదానికి ప్రత్యేకమైన అస్తిత్వం ఏమీలేదు. ఆడది మనస్సు చేత కాకపోయినా శరీరంచేతనైనా మగవాడిమీద ఆధారపడక తప్పటం లేదు."

"మగవాడుకూడా అంతేగదా? ఈ చిన్నవిషయానికి ఇంత ప్రాధాన్యం ఇవ్వవలసిన అవసరం నా కేమాత్రం కనుపించటంలేదు. నీకు ఏది అపరిపూర్ణంగా తోస్తుందో, దేనినిగురించి నువ్వు అసంతృప్తి చెందుతున్నావో అది, నీవు ఎవరికోసం పోరాడదలుచుకున్నావో వారి కూడా అపరిపూర్ణంగా, అసంతృప్తికరంగా తోస్తుందో లేదో అడిగి చూడు. నీవు చెప్పింది నేనుమాత్రం ఒప్పుకోను," అన్నది తారాదేవి.

"అయితే స్త్రీలంతా అణగద్రొక్కబడుతున్నారే. నాశనమైపోతున్నారే, అదంతా ఏమీ లేదంటారు మీరు—అవునా?" అని అడిగాను.

"ఔను, నేను ఒప్పుకోను."

"అయితే మీ రసలు ఈ కేంద్రంఎందుకు తెరుచుకూర్చున్నారు."

"నిజం చెప్పమంటావా?"

"చెప్పండి — ఇక్కడ మనం తప్ప ఇంకెవరున్నారు?"

"అయితే విను. మాకు ఏమీపనిలేదు. అనుకూలంగా వున్నప్పుడు తుపానుకూడా ఓడలను ఒడ్డుకు చేరవేయగలదు. ప్రపంచంలో తెలివిగల వాళ్లు ఏవిధమైన కష్టాలొచ్చినా ఎలాగోలా తమ నావమాత్రం ఒడ్డుకు చేరేలా చూసుకుంటారు. మనక్కూడా ఏదో ఒక వృత్తి కావాలిగదా? నీవు ఎప్పుడూ చూడలేదేమిటి? వీధుల్లో గారడీవాడు ఒకకుర్రవాణ్ణి ఆపాద మస్తకం దుప్పటితోకప్పేసి, వాడు చచ్చిపోయినట్టు చూపించి, మళ్ళీ ఏవో మంత్రాలు చదివినట్టు చదివి, గారడిచేసి, వాణ్ణి బ్రతికించి, డబ్బులు సంపాదించుకుంటాడు. బ్రతికున్నవాడినే బ్రతికించవచ్చు గాని, చచ్చి పోయినవాణ్ణి ఎవరూ బ్రతికించలేరన్నసంగతి ఎవరికి తెలియదు? అయినా సూట్లుబూట్లువేసుకున్నవాళ్ళుకూడా, ఎమ్. ఏ.లు, బి. ఏ.లు చదివినవాళ్ళుకూడా గారడీచూసి,డబ్బు విసిరేసిపోతుంటారు.దీనికేమంటావు?"

"అయితే మీరుకూడా ఇక్కడ గారడీచూపించి, ఎలాగోలా డబ్బులు వసూలుచేసుకోవటానికి కూర్చున్నారన్నమాట—కూర్చోండి! కాని, నాకు ఇలాంటివంటే అసహ్యం. నే నిక్కడ పనిచేయలేను" అన్నాను చాలా కోపంగా.

"ఏం!" అన్నారు ఆవిడగారు ఉలిక్కిపడి—"నేను నిన్నేమీ అన లేదే!"

"ఎందు కనలేదు! నా కిక్కడ ఏం లాభముందని వచ్చాను."

"నీకు లాభంలేదనేగా నేనూ అనేది! కాని లాభంఉండాలి. నీవు కొంచెం ఓపికపడితే ఉంటుందికూడా" అన్నది తారాదేవి.

"డబ్బేనా!" అని చీదరించుకుంటూ అడిగాను.

"ఏం! డబ్బంటే నీ కంత చులకనగాఉందా? నిజంగా కుర్రతనం పోలేదింకా నీకు. కోటీశ్వరులైన ఈ షావుకారులంతా ఉన్నారే, వాళ్ళ కంత గౌరవం ఎందువల్ల ననుకున్నావు! డబ్బువల్ల.వీళ్ళకి డబ్బు ఎక్కడ నుంచి వస్తున్నదనుకున్నావు. ఇతరుల రక్తమాంసాలుపీల్చి పిప్పిచేయ టంవల్ల. అందాకా ఎందుకు! నేను నిన్ను ఒక్కప్రశ్న అడుగుతాను

డబ్బు వీళ్ళవద్దకే ఎందుకువస్తుంది! మనవద్దకు ఎందుకురావటంలేదు? ఎందువల్లనంటే, డబ్బుసంపాదించే తెలివితేటలు వాళ్ళకే వున్నవి. ఆ విషయంలో వాళ్ళకున్న తెలివితేటలు మనకులేవు —మనం త్యాగాన్ని గొప్పచేసి పొగడి మన లోపాన్ని కప్పిపుచ్చుకోవాలని చూస్తుంటాం." అన్నది తారాదేవి.

"మీరనేదానికి అర్థంలేదు —డబ్బుఅనేది ఒక పిశాచి. కామం మరో పిశాచి. ఈ రెండుపిశాచాలు కలిసి మనను కబళించివేశాయి. ఆకలి, కామం- ఈ రెంటివల్లనే మనం మరొకరికి కట్టుబడిఉన్నాం. ఆడదానికి సంతానంలేకపోయినా జబ్బులే ! సంతానంఉన్నా జబ్బులే ! ఈ మగవాడే మనకష్టాలన్నిటికీ కారణం" అన్నాను ఆవేశంగా. తారాదేవి నవ్వుతూ— "మగవాడంటే బలిపశువు సుశీ! అతనికంటే మూర్ఖుడు లేడు. అతనికి ఆత్మవంచన ఎంత ఎక్కువంటే, మరి అడగక్కరలేదు. అతడు ఆడ దానికి దాసుడు. వట్టి పెంపుడుకుక్క !" అన్నది. నాకు ఆవిడచెప్పింది ఏమీ అర్థంకాలేదు. "నీ కిన్ని ఆలోచనలున్నాయిగదా, ఏదన్నా పని ఎందుకుచేయకూడదూ ?" అని అడిగింది మళ్ళీ.

"ఏం పని ?"

"ఈ సాంఘికసంక్షేమకేంద్రం ఒక ఫార్సు. ఉచ్ఛవర్గానికిచెందిన స్త్రీల ఊసుపోకకు ఇదొక సాధనం. అంతకంటే మరేం లేదు. నువ్వు దీనినే నిజమైన సంక్షేమకేంద్రంగా ఎందుకు తయారుచేయవు ?"

"ఏ ఆదర్శంద్వారా?"

"మహాత్ముని ఆదర్శంద్వారా"

"కాని అదొక పారతంత్ర్యసిద్ధాంతం. అది మగవాళ్ళసిద్ధాంతం"

"కాదు సుశీ ! అక్కడే నీ పొరపాటు. జీవితమంటేనే పార తంత్ర్యం. పారతంత్ర్యం ఎందువల్లనంటే, సంఘంలో మనం ఉండవలసి వస్తుంది గనుక. సంఘంలో ఉన్నందువల్ల మనం ఇన్నిరకాలపన్నులు కట్టవలసివస్తున్నది. అయినప్పటికీ మనకు పొట్టపోసుకునే అవకాశాలు లభించడంలేదు. ఒకానొకప్పుడు మాతృస్వామ్యం ఉండేది. ఇవాళ ఏ దేశంలో చూసినా పురుషులదే అధికారం. అలా కానివి ఏవో రెండు మూడుదేశా లున్నాయనుకో. అక్కడమాత్రం ఆడది ఏమంత సుఖపడి

చస్తున్నదిలే! మరి ఆడది తన అధికారాలన్నీ ఎందువల్ల పోగొట్టుకున్నది? ఎందువల్లపోగొట్టుకున్నదో చెప్పు.ఎందువల్లనంటే,పరాశ్రయంలో బ్రతకటంలోనేఆడదానికిసుఖంగనుక.పిల్లల్నికంటుందికదూఅందువల్లఅపాయాలకుదూరంగాఉంటుంది. రష్యాలో ఆడవాళ్లు ఆరునెలలబిడ్డను ఇంటివద్ద వదిలిపనికిపోతారు.కాని నిజంగా ఆడదానికి అలా తనబిడ్డను వదిలివెళ్ళటం ఇష్టంఉంటుందంటావా? ఏమాత్రం ఉండదు. పైగా రష్యాలో పిల్లల్ని కన్నందుకు బహుమానంఇస్తారట" తారాదేవి నవ్వింది. "అదికూడా ప్రజలపేరుతో! చరిత్రలో ఒకళ్ళిద్దరు పొరపాటు చేయవచ్చు. అంతా చేయలేరు. మహాత్ముని మార్గమే సమదృష్టియుతమైనది. పైగా మనం దానిని అనుసరించటం సబబుకూడాను. దానిని అనుసరించకపోతే ఈ కేంద్రమే మూతబడుతుందే. అప్పుడు మనం వేరే వృత్తి వెదుక్కో-వలసివస్తుందే!" అని ఆమె మళ్ళా నవ్వింది.

"మీ కసలు దేనిమీద నమ్మకముంది? మీదంతా రెండుగుర్రాల మీద సవారీచేసేపద్ధతిలాగుంది. కాంగ్రెసునాయకులు ఇలాంటిపనులు చేయవచ్చా?"

"నీకు తెలియదుగదూ? అందుకని అలాగే అనుకుంటావు. గాంధీ గారు యంత్రానికి వ్యతిరేకి. కాని తకిలీ ఏమిటి? అది ఆదిమమానవుని యంత్రమేగదా! నెహ్రూగారిని చూస్తే, రాట్నంతిప్పేవాళ్ళలోవాడిలా కనుపిస్తాడా? మరి ఆయనగూడా రాట్నంతిప్పుతున్నారా లేదా? వినోబా ఉన్నారు. సంఘజీవితం అదీ ఇదీ అంటారు; కాని కుటుంబంఅంటే ఏమిటో, దాంట్లో ఎన్నికష్టాలున్నాయో ఆయనకు తెలియనే తెలియదు. ఆయన సర్వసంగపరిత్యాగి గనుక తేనెమాత్రం తాగి వుండగలడు. పిడికెడుఅన్నంకూడా దొరకని దేశంలో అందరికీ తేనె ఎక్కడనుంచి వస్తుందీ అనేది ఆయనకు తోచదు. నిజంగానే బలవంతుడు ఏంచేసినా తప్పుఉండదు. జనులు వాళ్ళతప్పులు చూసికూడా చూడనట్టే ఊరుకుంటారు. ఎందువల్లనంటే, వారు చేసే గొప్పగొప్పపనులముందు చిన్న చిన్నతప్పులు కనుపించనేకనుపించవు. ఇది లోకరీతి. ఎవరిసంగతో ఎందుకు, నాసంగతే తీసుకో. నేను లాఠీదెబ్బలుకూడా తిన్నాను సుశీ! నీదగ్గర అబద్ధమాడటం నా కిష్టంలేదు. నువ్వు నా బిడ్డలాంటిదానివి. అది

ఇవాళ బ్రతికిఉంటే నీఅంతే ఉండేది. అందువల్లే నీముందు ఇలా హృద యంవిప్పి మాట్లాడుతున్నాను." అంటూఉండగానే ఆమెకళ్ళు చెమ్మ గిల్లాయి. వెంటనే ఆమె చీరకొంగుతో కళ్లుతుడుచుకొని, నావంక చూచి నవ్వింది. నాకు మనస్సులో చాలా కష్టంవేసింది. పాపం ! ఈవిడ లోలోపల ఎంత కష్టపడుతున్నదో ! ప్రపంచంలో ఎవరినిచూసినా ఏదో ఒక దిగులుపట్టుకొని పీడిస్తూనేఉంటుంది. నేను ఇలా ఆలోచిస్తూ ఊరు కుంటే ఆవిడ నన్నుచూచి "ఏమిటి, ఆలోచిస్తున్నావు సుశీ ?" అని అడిగింది.

"ఏమీలేదు"

"ఏదో ఉందిలే"

"ఏమీలేదు. ఇవాళ అర్థమూ, కామమూ జీవితపుగొంతు గట్టిగా నొక్కిపట్టేశాయి. ధర్మమూ, మోక్షమూ ఈ రెంటికీ మనం నీళ్లు వదులు కున్నాం. ఈ విషయమే ఆలోచిస్తున్నాను" అన్నాను.

"వాటిని ఒకప్పుడు వదులుకోలేదుగనుకా ?" అన్నది ఆవిడ.

"మీరు భారతీయ సాంస్కృతికచరిత్రను గమనించండి, తొందర పడి ఏనిర్ణయానికీ రాకండి. మన సంస్కృతి వాస్తవానికి మోక్ష ధర్మాల విజయపరంపరల అమరగాథ కాదా ?" అని అడిగాను.

"కాదు" అన్నది ఆవిడ క్లుప్తంగా.

"అంటే మీ ఉద్దేశ్యం ?"

"ఉద్దేశ్యం ఏముంది ? ధర్మం అనేది మూఢవిశ్వాసానికీ, మోక్షం అనేది సంప్రదాయసిద్ధమైన కల్పనకూ మారుపేర్లు. కావిపక్షంలో అవి రెండూ సర్వకాలాల్లోనూ కామానికీ, అర్థానికీ దాస్యంచేస్తూనేఉన్నాయి. ఆర్యులు దోచుకొంటున్నరోజుల్లో అశ్వమేధమే ధర్మం. అది అర్థానికే మరోరూపం. అర్థమూ, కామమూ ఎప్పుడూ మోక్షంమీదా, ధర్మంమీదా శాసనంచేస్తూనేఉన్నాయి. ఈవిషయం గమనించు. భీష్ముడు ఏప్రక్క పోరాడాడు ? ధర్మంవైపునా ? లేక తన పొట్టగడుస్తున్న వైపునా ? అంటే అర్థంవైపునా ? అర్థంఅంటే ఒకరిఉప్పుతినటం — అంటే అదే ధర్మం. అంతేనా ? సంఘవ్యవస్థ ఎప్పుడూ అర్థాన్ని ఆధారంచేసుకునే నిర్మించ బడుతుంది. స్త్రీని క్షేత్రం అన్నారు. ఎందువల్ల ? భూస్వామ్యవ్యవస్థలో

క్షేత్రంఅంటే పొలంగనుక. సత్యం అనేది ఎంత వికృతంగా ఉంటుందంటే, దానిని ఎప్పుడూ విప్పిచూపగూడదు. పరమాత్మణ్ణిగురించి ఊరికే ఊహిస్తున్నంతవరకూ ఎంత రొమాంటిక్‌గాఉండేదో! శాస్త్రజ్ఞులు సత్యాన్ని శల్యపరీక్షచేసి చూస్తుంటే, ఇవాళ మనకు ప్రపంచం చాలా పెద్దదిగా కనుపిస్తున్నది. తెలుసుకున్నకొద్దీ తెలుసుకోవలసింది ఇంకా పెరుగుతూనేఉంటుంది. ధర్మమూ, మోక్షమూ మానవుని కల్పనలు. ధర్మానికీ, మోక్షానికీ సర్వకాలాల్లోనూ ఎక్కువ ప్రాధాన్యంఇచ్చి భారతీయుడు తాను అర్థంకొరకు, కామంకొరకు జీవించటంలేదనీ, మరేదో మహత్తరమైన ఆశయంకోసం జీవిస్తున్నాననీకల్పనచేసుకుంటూవచ్చాడు. ఇదిగూడా ఒకవిధంగా మంచిదే ననుకో!" అని నవ్వింది తారాదేవి.

నాకు తలతిరిగిపోయింది. అయితే మనం నేడు ఏవిధమైన నమ్మకాలూ లేకుండానే జీవిస్తున్నామా?" అని అడిగాను.

"మననమ్మకాలు మనబుద్ధుల్లోంచి పుడుతుంటాయి. మనకున్న బుద్ధులే తక్కువగదా! అర్థ-కామాల ఉన్నతమైనరూపాలనే మనం ధర్మం అంటాం. వీటన్నిటి సామంజస్యాన్నే మోక్షం అంటాం. మోక్ష చింతనకు వయస్సు వానప్రస్థం. అదే ప్రపంచాన్ని పరిత్యజించే వయస్సు. అయితే, ప్రపంచాన్నంతనూ సృష్టించినవాడు ఏమాలోచిస్తూఉంటాడో మనకు తెలియదు. మనం ఎందుకు జన్మఎత్తుతున్నామో, ఎందు కివన్నీ చేస్తున్నామో తెలియదు. అసలు బ్రతకట మెందుకు? ఆ పైవాడు చావును అతిభయంకరంగా తయారుచేశాడు గదూ?—బహుశా అదే కారణమై ఉంటుంది. ఏం సుశీ! రాజధానిలో ఈ బ్రహ్మాండమైన భవనాలన్నీ నిర్మిస్తున్నారుగదా. అంతులేని దూరంనుంచి భగవంతుడు ఇదంతా తన దుర్భిణీపెట్టి చూస్తుంటే, ఆయనకు తమతమపనుల్లో నిమగ్నులైఉన్న ఈ మనుషులగుంపులోనూ, తమ పుట్టకట్టుకుంటున్న చెదపురుగులగుంపులోనూ ఏమైనా తేడా తెలుస్తుందంటావా? గొప్పవాళ్లు, మహానుభావులు, గొప్ప చెదపురుగు—మహత్తరమైన చెదపురుగు!" అని నవ్వింది తారాదేవి. ఏమనాలో తెలియలేదు నాకు. కొంచెంసేపు అలాగే ఆలోచిస్తూ ఉన్నాను. తరువాత ఆమెతో "ఏమైనాకానీ-మీరు ఏమీ అనుకోనంటే నే నొకవిషయం చెబుతాను" అన్నాను.

"ఏమీ అనుకోనులే, చెప్పు ?" అన్నది ఆమె.

"మీ బుద్ధి వక్రమైనది" అన్నాను. ఆవిడకు కోపంవస్తుందని అనుకొన్నాను. కాని ఆవిడ నిర్లిప్తంగా "కావచ్చు" అన్నది.

నే నలా చూస్తూనే ఉండిపోయాను. ఆవిడ మళ్ళీ అన్నది— "ఒక్కొక్కమాట చెప్పే వ్యక్తినిబట్టే, ఆ మాట ప్రభావంకూడా ఉంటుంది. మగవాళ్ళూ, ఆడవాళ్ళు అంతా మంచినిగురించే మాట్లాడుతూ ఉంటారు. కాని ఒకరు చెప్పింది మరొకరు ఎప్పుడూ వినిపించుకోరు."

"తనవాణిని తాను వినగలిగితే అప్పుడు అంతా అతనివాణి వింటారు"

"అటువంటివాడే మహాత్ముడు" అన్నాను నేను.

"పద, టీ తాగి వద్దాం" మేము కేంటీనుకు వెళ్ళాం.

"ఏంతీసుకొంటావు ?"

"టీ, ఆమ్లెట్టు" అన్నాను.

"మటన్ చాప్స్ తెప్పించేదా ?" అని అడిగింది.

"మటన్‌చాప్సా ! ఈవిడగారు ఈ ఖదరుకట్టుకుని మటన్‌చాప్స్ తింటుందా ? నేను ఆశ్చర్యపడిపోయాను.

"మీరు తింటారా ! మరి గాంధీగారిసిద్ధాంతాన్ని అనుసరించి...." అని అడగబోయాను, ఆవిడ నవ్వింది. "గాంధీగారు చెప్పింది నిజమే. చెట్లకు మొక్కలకు ప్రాణంఉందని జగదీశ్‌చంద్రబోస్ రుజువుచేశాడన్న సంగతి ఆయనకూడా తెలుసు. ఆయన సిద్ధాంతాని కర్థం వీలైనంత తక్కువ హింసచెయ్యాలనే. ఆయనమేక ఉండేదే—నిర్మల; అది దాని ఇష్టపూర్వకంగానే తనపిల్లలకు త్రాగించకుండా ఈయనకు పాలిచ్చేదా? ఇలాంటివిషయాల్లో మనిషి ఎవ్వడూ మేకను సంప్రదించడు. అందువల్లే నేను మటన్‌నుమించి పైకిపోను. మటన్‌వరకూ పర్వాలేదు. ఇంతాజేస్తే మేకేగదా !"

"ఎప్పుడన్నా మోతీమహల్‌కు వెళ్ళివచ్చారా ?" అని అడిగాను.

ఆవిడ చాకుతో ఫోర్కుతో చాప్స్ తింటూ "అక్కడ కోడి మాంసం బాగుంటుంది. పెద్దవాళ్ళూ, పరదేశస్థులూ అంతా వస్తారు. నేనుకూడా అక్కడ నాన్‌రొట్టె తిన్నాను. మీ ఉద్దేశం ఏమిటి, నాన్‌రొట్టె

మంచిదా ? డబల్‌రొట్టె మంచిదా ?" అన్నది. ఫలహారం అయిపోయి మేం తిరిగివచ్చేటప్పటికి వేళ చాలా మించిపోయింది." నిమ్న మధ్య వర్గపుస్త్రీలను మేలుకొల్పటానికి మనిద్దరం ఎప్పటినుంచి వెళ్దాం" అని అడిగింది ఆమె.

ఆ "మేలుకొల్పటం" అనే ముక్కను ఒత్తి పలికింది. అది వ్యంగ్యమో, లేక సహజమైనమాటో నాకు అర్థంకాలేదు.

"రేపటినుంచి వెళ్దాంలెండి" అన్నాను.

నేను ఇంటికిచేరుకునేటప్పటికి వారుకూడా వచ్చారు.

"ఈమధ్య నువ్వసలు అపురూపమైపోయావు. ఎక్కడికి వెళ్లుతున్నావేమిటి ?'' అని అడిగారు.

"అక్కడికే, మా కేంద్రానికి వెళుతున్నాను" అన్నాను.

"దానివల్ల నీ కేమిటి లాభం ?"

"ఎలాంటిలాభం కావాలని మీ ఉద్దేశ్యం" అన్నాను. నా కంఠం చాలా కఠోరంగాఉంది. ఏమాత్రం మెత్తదనంలేదు. అయినా ఆయన ఏమీ అనలేదు. నేను చీరె మార్చుకుంటానికి వెళ్ళాను.

ప్రొద్దుపోయింది. అయినా వారు లైటు వేసుకు కూర్చున్నారు. నేను ప్రక్కమీద పండుకొని "లైట్ తీసెయ్యరాదూ- నిద్ర వస్తోంది" అన్నాను.

"ఏం, అప్పుడే నిద్రపోవాలని ప్లానా ?'' అన్నారు.

"నా తల కొంచెం బరువుగా ఉన్నది."

"ఏం. నేను ఒత్తేదా ?"

"ఒద్దులెండి. నన్ను కొంచెంసేపు విశ్రాంతితీసుకోనివ్వండి" అన్నాను. బహుశా నా మాట వారి కేదో కొంచెం చివుక్కుమనిపించినట్లున్నది.

"అయితే, నేను ని న్నసలు విశ్రాంతి తీసుకోనివ్వటంలేదన్న మాట?" అన్నారు.

"మీ రెప్పుడూ అలా కయ్యానికి కాలుదువ్వుతూఉంటారేం ? ఆ బుర్రను అప్పుడప్పుడూ కాస్త ఉపయోగిస్తూఉండండి" అన్నాను.

"సుశీలా!" అని అరచారు వారు.

"'ఏం" అంటూ నేనుకూడా ఆవేశంగా లేచికూర్చున్నాను. "చంపే స్తారా? చంపెయ్యండి నన్ను. తలనొప్పిగాఉన్నప్పుడుకూడా నాకు కాస్తంత విశ్రాంతి చిక్కదుగదా ! అబ్బబ్బ ! ఇంటికొస్తేసరి; మీ పాతఅలవాట్లు ఏమీ మార్చుకోరుగదా ! ఇంకా మీరు పెళ్ళికానిబ్రహ్మచారిననుకొంటు న్నారా ?''అన్నాను. ఏదో నోటికొచ్చినట్లు వాగేశాను. వెంటనే ఆ లైటు కాస్తా ఆరిపోయింది.

మరుసటిరోజు నేను లేచేటప్పటికి మనస్సు చాలా తేలిగ్గా సంతో షంగా ఉన్నది. ఆయన ఇంకా నిద్రపోతూనేఉన్నారు. ఈలోగానే నేను స్నానంకూడాచేసేశాను. కాని వా రింకా లేవనేలేమ. నేను టీ తెమ్మని నౌకరుకు చెప్పి 'అయ్యగారినికూడా లేపు' అన్నాను. వాడు తిరిగివచ్చి "అయ్య గా రింకా నిద్రపోతున్నారు''అన్నాడు. నేను టీత్రాగుతూ పత్రిక ముందువేసుకు కూర్చున్నాను. చూస్తే రమఫొటో, ఆ రచయితమహా శయునిఫొటో రెండూ కనిపించాయి. ఆ క్రిందనే మరొకవార్త చూసే టప్పటికి నామనస్సు ఉప్పొంగిపోయింది. తొందరతొందరగా అంతా చదివివేశాను. వెధవకు అంతే కావాలనుకున్నాను. వెళ్ళి వారినికూడా నిద్ర లేపి ఈ వార్త చెప్పివద్దామనుకునేటప్పటికి వారు తన గళ్ళ స్లీపింగు సూటులో సిగరెట్టువెలిగించుకొని వచ్చి,నౌకరును కేకవేసి—"అరే, తొందరగా టీ పట్టుకురా ! నన్ను లేపలేదేం ?" అన్నారు. నావంక కోపంగా చూశారు. రాత్రికోపం ఇంకా చల్లారనట్లుంది. చిన్న రైలు ఇంజన్‌లా సిగరెట్టుపొగ ఊదుకొంటూ కదిలారు. పక్కనేఉన్న పడకకుర్చీలో పండుకుని కళ్లుమూసుకుని ముందు కొంచెంసేపు ఈలవేసి. తరువాత ఏదో కూనిరాగంతీయసాగారు. అదేదో ఇంగ్లీషుపాట. "ఇదిగో, ఈ వార్త చూడండి" అన్నాను.

వారు పత్రికతీసుకొని చదివారు. వెంటనే "పట్టుకొన్నారా వెధ వను. మంచిపని జరిగింది. అంతేలే. ఎప్పుడోఒకసారి పట్టుబడవలసిందే గదా ? పైగా ఆ వెధవ మన గవర్నమెంటు చాలా కరప్టని అంటూ ఉండేవాడు. హుఁ, కరప్టట ! వెధవ !" అని వారు వ్యంగ్యంగా నవ్వారు. "కరప్టట !" అని మళ్ళీ వారు పొట్టచెక్కలయ్యేట్టు నవ్వ

సాగారు. తనమనస్సులో కలిగిన బాధ అనే గుంటల్లో నిండుగా నీరు నింపుతున్నట్లుగాఉంది ఆ నవ్వు.

నిమోలియాను పట్టుకున్నారన్న వార్త. అత డెవరో బందిపోటు దొంగకు తగిలిన తుపాకిగుండు తీసి చికిత్సచేశాడట. ఆ దొంగ అట్ట హాసంగా సూటు బూటు వేసుకుని పెద్ద కారులో నిమోలియాఆస్పత్రికి వచ్చాడట. వచ్చి బహుశా తనకు చికిత్సచేస్తే ఏ రెండువేలో మూడు వేలో ఇస్తానని ఆశపెట్టిఉంటాడు. డాక్టరు గుండుతీసి పట్టీవేసి శుభ్రంగా కుట్టివేశాడు. ఇంతలోకే ఈవార్త తెలిసి సి. ఐ. డీ.లు ఇంటిచుట్టూ కాపు వేశారు. ఆ బందిపోటుదొంగ ఇంట్లోంచి బయటకు రాగానే పట్టుకున్నారు. వెంటనే నిమోలియానుకూడా పట్టుకున్నారు.

"అంతేకావాలి వెధవకి. ఎంత నిక్కు వాడికి! గవర్నమెంటు అంటే ఏమన్నా లెక్కఉందా వాడికి? రాజద్రోహి! దొంగవెధవ! నీచపువెధవ! స్వైన్ బాస్టార్డ్!" అన్నారు ఆయన కసిఅంతా కక్కుతూ.

"ఏం? మీకు బాగా స్నేహితుడేగా?" అని దెబ్బతీశాను.

"ష్యూర్—అయితేనేం? నాకు స్నేహితుడైనంతమాత్రాన దొంగ వెధవ మంచివాడౌతాడా? అయినా నా కేం చిన్నప్పటి స్నేహితుడా? ఏదో సొసైటీలో వచ్చేవాడు. పరిచయమయింది. వాడిది ఎంత నీచపు బుద్ధంటే, చెప్పటానికి వీల్లేదనుకో! ఒకరోజున రెస్టరాలో—బహుశా ఓగ్లాలోనే అనుకుంటాను—ఏడున్నరరూపాయలబిల్లయితే, ఏమన్నాడో తెలుసా? నా వందరూపాయలనోటు ఎందుకు మార్పిస్తావు. నువ్వే ఇచ్చెయ్యి—అన్నాడు. ఏమనాలి వాడిని!" అన్నారు వారు.

"అయినా వాడు తప్పించుకుంటాడులెండి!" అన్నాను.

"ఏం, ఎందుచేత?"

"విమ్నజాతిగదండీ!"

"అయితే! ఆ బందిపోటుదొంగమీద బ్యాంకును దోచుకున్నాడని కేసు. అటువంటి కేసులోఇరుక్కున్నాడు డాక్టరు. రాజకీయనాయకులు కాదు,వాళ్ళతాతలుదిగొచ్చి సిఫార్సుచేసినా, డాక్టరు తప్పించుకోలేడంటాను నేను. ఆ నిమ్నవర్గసంఘం వీడిని వెనకవేసుకునిరాదు. ఎందుకంటే, ఈ వెధవ కనీసం మాదిగవాడుకూడా కాదే—కాంగ్రెసుగౌరవం అంతా

మాలమాదిగలమూలాన నిలబడింది, వీడిజాతివల్ల కాదు'' అని చాలా తృప్తిగా నవ్వారు వారు.

ఇంతలో టీ వచ్చింది. నేను టీ పోసిచ్చాను వారికి.

చెల్లీ! వారు నాతో ఎంతపోట్లాడినా, నన్ను ఎంతచులకనచేసినా, అవమానించినా, వారిపనులు చేసిపెట్టకపోతే నాకు తృప్తిగా ఉండదని నీకు తెలుసు. కాలేజీరోజుల్లోకూడా మిగత పిల్లలంతా 'సుశీల ఎంత మంచిది! దానికి గర్వంఅనేది ఏకోశానా లేదుగదా!'' అనేవాళ్లు, జ్ఞాపకంఉందా నీకు?

ఇన్నాళ్ళనుంచి నాకు తీరికేచిక్కలేదు. ఇవాళ కాస్త తీరిక చిక్కింది, నీ కీ ఉత్తరం రాస్తున్నాను.

ప్రేమతో,

నీ సుశీల.

ఇదిగో, మరీ ఇంత చిన్నచిన్నఉత్తరాలు రాయకు. ఈసారి నువ్వసలు ఏమీ రాయనేలేదు. క్లుప్తంగా రాయటమంటే అర్థం అసలు రాయకపోవటంకాదుగదా !

# 7

ప్రియమైన సోదరీ ,

ఏమిటి విశేషం?....అసలు నీదగ్గరనుంచి వుత్తరమే లేదు—నేను రాసినదానికికూడా నువ్వు జవాబు ఇవ్వలేదు. ఏం మరీ అంత తీరికలేకుండావున్నావా? నీ ఇంటిబయటకూడా ప్రపంచం వుందనేసంగతే మరచిపోయావా? ఇల్లంటే ఏమి టనలు? ప్రొద్దున్నే బయలుదేరిన బాటసారి ప్రపంచంలో రకరకాల త్రోవలుత్రొక్కి అలసిపోయిన తరవాత, విశ్రమించటానికి తిరిగివచ్చే ప్రదేశమే ఇల్లు. అంతకంటే విశేషమేమీ లేదు. ఇల్లనగానే మనిషిలో సుఖపూరితమైన ఊహలు మేల్కొంటాయి. ఒక చిన్న ఇల్లు వుంటే నాకు చాలని అంటారుగదా. ఇక్కడ 'చిన్న' అంటే శాంతిమయమైన మధురమైన అని అర్థం కాని, నేడు మన దౌర్భాగ్యంవల్ల గృహంఅంటే శాంతికి నివాసంకాదు. కలహానికి కంచుకోట. ఇది నేడే

అనుకోటానికికూడా వీళ్లేదేమో —తరతరాలనుంచికూడా ఇలాగే వుంటూ వచ్చిందేమో. లేకపోతే పురాణకాలంనుంచికూడా జనులు ఇల్లువదలిసన్యాసం ఎందుకు స్వీకరిస్తూవచ్చారు. ఇల్లనగానే అక్కడ రకరకాల మన స్తత్వాల మనుషులు పోగవుతారు. బయటవున్న ప్రపంచానికి చిన్న నమూనాగా వుంటుంది ఇల్లుకూడా. ఇక్కడకూడా యజమానిననే అహంకారం, సేవచెయ్యాలనే మమకారం, పరస్పరసంఘర్షణ అన్నీ ప్రక్కప్రక్కనే వుండవలసివస్తుంది. సంతానం రక్తమాంసాల్నుంచి కలిగింది కనుక, తనలోని భాగమే గనుక స్త్రీకి తనసంతానమంటే మోహం వుంటుంది. కాని తన సంతానంకోసం నానాకష్టాలుపడే మగవాడికికూడా సంతానం మీద ఆడదానికున్నంత మమకారం వుండదు. ప్రపంచంలో పైకిరావాలనే అతనికోరికే అతన్ని అణగత్రొక్కివేస్తుంది. అతడు ఎంతో స్వార్థపరుడైపోతాడు.

మిసెస్ కటారాకు ఇంకా మూర్ఛలు వస్తూనేవున్నాయి. మిస్టర్ కటారా అప్పుడప్పుడు కనపడుతూవుంటారు. మాట్లాడుకుంటూ వుంటాము. మనోరంజకంగా మాట్లాడగల డాయన. సాంఘికశాస్త్రానికి దర్శనానికి సంబంధించిన పుస్తకాలు ఎక్కువగా చదువుతూవుంటారు. "విషయవాంఛలకు ఎన్నడూ లొంగిపోకూడదు. మనం బ్రహ్మచర్య వ్రతాన్ని తప్పకుండా పాటించాలి. మన భారతీయ సంస్కృతి సంప్రదాయము మనకు నేర్పేపాఠం ఇదే" అని గంభీరంగా అంటూవుంటారు ఆయన.

"నువ్వే ఆలోచించు— పెళ్ళికీ, బ్రహ్మచర్యానికీ జత! నేను ఇది వినగానే, మిసెస్ కటారావైపు చూసి, మెల్లగా నవ్వాను. ఇదిచూసి ఆయనకు చాలా కోపంవచ్చింది. "సోదరీ! వివాహమే బ్రహ్మచర్యపాలనకు శ్రేష్ఠమైనమార్గం. పరమాత్ముని సృష్టిలో గృహస్థాశ్రమాన్ని మించినది ఏదీలేదు. గొప్పగొప్ప సత్కార్యాలుచేయటానికి ఇదే అవకాశం కలిగిస్తుంది. ఈ ఆశ్రమంలోనే ధర్మం స్థిరంగా ఉంటుంది. సంతానం కోసంమాత్రమే మానవుడు వివాహం చేసుకోవాలి," అని ఉపన్యసించారు మిస్టర్ కటారా,

సరిగ్గా సమయానికి లేడీ డాక్టర్ అక్కడి కొచ్చింది. ఆయన

భార్యను చూడటానికి వచ్చినట్టుంది. చాలా మంచిఆవిడ. కటారాగారి మాటలు వినేటప్పటికి ఆవిడకు నవ్వువచ్చింది. "మీరు నావెంట కొంచెం ఇలావచ్చారంటే ఈవిడ జబ్బేమిటో నచ్చచెబుతాను మీకు," అన్నది.

కటారాగారిని అవతలకు తీసుకువెళ్ళి ఆవిడ ఏం చెప్పిందో తెలియదు గాని, ఆవిడ అలా వెళ్ళిపోయింది — కటారాగారు తమధోరణి పూర్తిగా మార్చుకున్నారు.

"ముందుముందు అసలు కుటుంబం అనేది లేకుండాపోతుందని తోస్తున్నది నాకు," అని సెలవిచ్చారు కటారాగారు.

"ఏమండీ! ఎందుచేత?" అన్నాను నేను కొంచెం ఉలిక్కిపడి.

"మీరే చూడరాదా! మొట్టమొదట ఒక్కొక్కతెగ మొత్తంకలసి ఒకేచోట ఉంటూఉండేది. కొంత నాగరకత పెరిగినతరువాత తెగలు పోయి, వాటిస్థానంలో సంయుక్తపరివారాలు వచ్చాయి. వీటిని మనవాళ్లు గార్హస్థ్యమనీ, సంసారమనీ పెద్దపెద్దపేరులుపెట్టి పిలిచేవారు. పాశ్చాత్య నాగరకతా ప్రభావంవల్ల ఆర్థికసమస్యలవల్ల, మానవుని లొంగతీయరాని అసహ్యశీలమైన అహంకారంవల్ల, వ్యక్తిగత తృష్ణలవల్ల ఈనాడు కుటుంబం నానాటికి చిన్నదైపోతున్నది. మొగుడూ, పెళ్ళాం, పిల్లలూ. పెళ్ళికాగానే పిల్ల వెళ్ళిపోతుంది. పెళ్ళికాగానే పిల్లవాడు విడిపోతాడు. ఈ పరిణామక్రమాన్నే మీరు మరికొంచెం ముందుకుతీసుకుపోయి ఆలోచించండి" అంటూ కటారాగారు తలగోక్కున్నారు. ఆయన భార్య ఆయన చెప్పేమాటలన్నీ ఎందుకూ పనికిరానివన్నట్లుగా "అక్కయ్యగారూ, నేను పోయి టీ తీసుకువచ్చేదాండీ?" అని వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళినతర్వాత కటారాగారు అన్నారు. "చూశారా! ఇదీ దీనివరస. బొత్తిగా బుర్రలేదండి. అనవసరంగా బి. ఏ. చదివింది ఇది. తెలివిఅనేది ఏకోశానా లేదు. ఇలాంటివాళ్ళు ఎందుకు చదువుతారో, దానివల్ల ఏం లాభం పొందుతారో తెలియదు. పైగా మహా దర్జాగా తానేదో గొప్ప ఘనకార్యము చేసినట్టు "అన్నీ అప్పుడే మరిచిపోయ్యాగా?" అంటుంది. దీన్ని ఏమనాలో మీరే చెప్పండి."

ఈ నిందాపురాణాన్ని విననట్టుగా నటించటమే మంచిదను

కున్నాను నేను. వాళ్ళఆవిడ తిరిగివచ్చి వింటుందేమోననే భయంతో మాటమార్చి "ఏదీ, మీ రేదో కుటుంబాన్నిగురించి చెబుతున్నారు!" అన్నాను.

కటారాగారు ఉబ్బితబ్బిబ్బైపోయారు. "చూశారా,చదువుకున్న ఆడవాళ్ళంటే మీలా ఉండాలి. మీలాంటి సంస్కృతిగల స్త్రీలవల్లనే ఈ దేశపు గౌరవం పెరుగుతున్నది." అన్నారు. ఈ మాటలు వినేటప్పటికి నాకు నా భర్త జ్ఞాపకంవచ్చారు, ఆయన నన్నుగురించి ఇలాగే అనుకుంటారా? నేను గూడలు ఎగురవేసి ఈ ఆలోచనను దూరంగానెట్టివేసి, "ఇప్పుడు ఇదంతా ఎందుకులెండి. ఏదో చెప్పబోయారే అదే చెప్పండి," అన్నాను.

"గీత అంటే ఏమిటి? గీత ఒక మహత్తరమైన పుస్తకం అంటాను. మీ అభిప్రాయం ఏమిటి?" అన్నారు కటారాగారు.

"అవునండీ, చాలా పెద్దపుస్తకం."

"పెద్దపుస్తకం అంటే మీ వుద్దేశ్యం గొప్పపుస్తకం అనేగదా?"

"తప్పకుండా."

"మీరు ఈవిధంగా అని గీతను చాలా అవమానపరుస్తున్నారు. గీతే అన్నిటికంటే గొప్ప పుస్తకం అనవలసింది మీరు."

నే నేమనాలో నాకే తెలియలేదు.

"మహమ్మదీయులు కురానునూ, క్రైస్తవులు బైబిలునూ గొప్పగా చెప్పుకుంటారు. కాని వాటిలో సమగ్రమైన దర్శనం ఏది? మారుతున్నపరిస్థితుల్లోకూడా మానవునకుత్రోవచూపించగల మహత్తరశక్తి,మానవువిబుద్ధి చమత్కారపు చరమపరిణామం ఒక్క గీతలోనే ఉన్నది." అన్నారు కటారాగారు.

"మీ రేదో కుటుంబంసంగతి చెప్పబోయారుగదూ!"అన్నాను నేను.

"అదే చెబుతున్నాను. ఆత్మ అజరమనీ, అమరమనీ గీత చెబుతున్నది."

నేను ఆయన్ను రెచ్చగొట్టాలనే ఉద్దేశ్యంతో--'ఆత్మ ఉన్నదా లేదా అనే విషయంలో శాస్త్రజ్ఞుల కింకా సందేహంగానే ఉన్నదిగదా!" అన్నాను.

కటారా చాలా అందమైనవాడన్నసంగతి నేను మొట్టమొదటి సారిగా అప్పుడే గుర్తించాను. సెక్రటేరియట్‌లో ఉద్యోగం. నెలకు దాదాపు 500 దాకా వస్తుందిట. అతనితో పోల్చిచూస్తే అతనిభార్య అంత అందమైనదికాదు. "శాస్త్రజ్ఞుల్ని వదలిపెట్టండి. వాళ్ల జ్ఞానానికి ఇంకా పరిపక్వత ఎక్కడ ఏడిసింది. మీరు ఆలోచించండి. మన సంస్కృతిలో యోగం మానవుని లక్ష్యాలన్నింటిలోనూ ఉన్నతమైనది. యోగంవల్ల మానవుడు నిస్సంగుడౌతాడు. జనన జీవన మరణాలవల్ల కలిగే సుఖదుఃఖాలు అనుభవించడం మానివేస్తాడు. కుటుంబాన్ని వదలిపెట్టినవాళ్ళంతా ఎందుకు వదలిపెట్టారంటే,అందులో ఉండి నిస్సంగత్వం కుదరదు. పూర్వకాలంనుంచికూడా మహాపురుషులంతా ఇళ్ళను వదిలిపెట్టారు లేక తమ సాధనకు అడ్డురాకుండా కుటుంబంలోవాళ్ళందరినీ తమకు పూర్తిగా బానిసలుగానన్నా చేసుకున్నారు.చెప్పవచ్చిందేమిటంటే, పురుషుని ఉన్నతిలో స్త్రీయే ఎల్లప్పుడూ అడ్డుతగులుతూవచ్చింది. లేకపోతే, లోకంకోసం కుటుంబాన్ని వదలవలసినఅగత్యం ఎందుకు ఏర్పడుతుంది ? ఇకముందు కుటుంబంఅనేది ఉండదు. ఆర్థికస్వాతంత్ర్యం లభించిన ఆడది అసలు మగవానిఇంట్లో ఎందుకు పడిఉంటుంది ? అతనికి అణగిమణగి ఎందుకుంటుంది ? ఆడది ఇవాళలాగే ఎప్పుడూ మూర్ఖురాలుగా ఉంటుందని నే ననుకోవటంలేదు" అన్నారు కటారాగారు.

నేను నవ్వాను. 'మరి పిల్ల లెక్కడఉంటార'ని అడిగాను.

"పిల్లలు! నేననుకుంటూనేఉన్నా, మీరు ఇలాంటిప్రశ్నేదో అడుగుతారని. ఎందువల్లనోగాని, ఆడవాళ్లు పిల్లల్నిగురించి ఆలోచించకుండా ఉండలేరు. పిల్లలెక్కడినుంచి వస్తారు ? అసలు పెళ్ళిపెళ్ళాంలేనప్పుడు పిల్లలు—"

ఇంతలో మిసెస్ కటారా తుండుగుడ్డకోసం వచ్చింది. మొగుడిమాటవిని—"ఏమండీ, మీకు కాలా ? నేను రాలా ? ఇట్లాగే ఇంకా వస్తారు. అర్థమయ్యిందా మీకు ?" అన్నది.

కటారాగారు మరికాస్త మండిపోయి, చెప్పసాగారు —"పిల్లల్ని పెంచేబాధ్యత ప్రభుత్వమే తీసుకొంటుంది. నర్సులూ, డాక్టర్లూ ఉన్నట్టే వాళ్ళను పెంచటానికి ప్రత్యేకంగా ఉద్యోగులు నియమించబడతారు. తల్లి

దండ్రులెవ్వరో పిల్లలకు తెలియనివ్వకూడదు. అలాగే తమపిల్ల లెవరో తల్లిదండ్రులకు తెలియనివ్వకూడదు. పిల్లలందరూ మానవులందరిపిల్లలే. ప్రేమను విభజించకూడదు. పెంగ్విన్‌పక్షి తనపిల్లలను ప్రత్యేకంగా అన వాలుపట్టకుండా తనజాతి పిల్లలన్నిటినీ పోషించినట్టే ఈ పృథ్వియావత్తూ ఒకేకుటుంబంగా పరిగణించబడుతుంది."

"మరి వాళ్ళందరికీ ఖర్చులు ఎవరిస్తారు ?"

"ప్రతిమనిషిదగ్గరా పన్ను వసూలుచేస్తారు. 'నీవూ' 'నేనూ 'నీదీ' 'నాదీ' అనే సంకుచిత హేయతత్వం అంతమైపోతుంది. అప్పు డీ తెచ్చి పెట్టుకున్న మమకారాలు ఈ తెచ్చిపెట్టుకున్న శోకాలూ ఉండవు."

ఇవన్నీ విని నా తలతిరిగిపోయింది. కటారాగారు ఏంచెబు తున్నారు ! కొంతమంది మనుషులుంటారు, చూడటానికి అతి సాధారణ మైనవాళ్ళలా కనుపిస్తారు. కాని వాళ్ల ఎంత ఆలోచిస్తారో, వాళ్ళ వూహాలు ఎంతదూరం పరుగెత్తుతాయో వాళ్ళతో మాట్లాడితే గాని తెలియదు. ఈ ఆలోచనాశక్తి గొప్పవాళ్ళలోనే కొంచెం తక్కువగా కనుపిస్తుంది. అసలీ మధ్యవర్గం బహుశా ఇలా ఆలోచించి ఆలోచించి చావటానికే నిర్మించబడిందేమో ? మిసెస్ కటారా టీ తీసు కొనివచ్చింది. వెన్నరాసిన టోస్టులు, బిస్కెట్లుకూడా తెచ్చింది."తీసు కోండి, అక్కయ్యగారూ !" అన్నది.

నే నొక టీకప్పు అందుకున్నాను. మిసెజ్ కటారా నాదగ్గర కూర్చుని"మీరు రాత్రింబవళ్ళూ ఏమాలోచిస్తూఉంటారు?"అని అడిగింది.

"ఆవిడ అన్నీ అర్థంచేసుకుంటుంది; అన్నీ అర్థంచేసుకుం టుంది." అన్నారు. కటారాగారు చాలా తృప్తిగా నవ్వుతూ. మళ్ళీ ఏదో చాలా దూరపుసంగతి ఆలోచిస్తూ వా రన్నారు — "గత్యం తరంలేక మనం ఈ సంఘంలో ఉండవలసివస్తున్నది. వస్తుతః మనమంతా అసాంఘికజీవులం — అందువల్లనే నాగరకత పెరిగిన కొద్దీ పోలీసులూ, సైనికులు పెరిగిపోతున్నారు. మనందరినీ కలిసి కట్టుగా ఉంచటానికి బలప్రయోగం చెయ్యవలసివస్తోంది. అహింం సాశక్తి అసత్యమని రుజువయింది. గాంధీగారి భారతదేశంలో కూడా సైన్యం తప్పలేదు. పరదేశాలదాడులనుంచి తప్పించుకోటానికి అది అవసరమని మీరు వాదించవచ్చు. అయితే అందరూ సైన్యాలను

తొలగించే ఆ శుభదినంకోసం ఇంకెంతకాలం ఎదురుచూస్తూ కూర్చోవాలి ? పట్టిది-ఎవరూ సైన్యాలను వదిలిపెట్టరు. దేశాలు సైన్యప్రయోగంచెయ్యవనేనమ్మకం ఇంకెల్లా కలుగుతుంది? లేదు, లాభంలేదు. హింస ఎలాగూ పోదు. హింసఅంటే ఏమిటి? వ్యక్తిలోని అహంకారానికి ప్రతిరూపమే హింస."

ఈ కటారాగారు మా తారాదేవిగారినికూడా మించిపోయాడే. వీరికీ, తారాదేవిగారికీ వాదనపడితే బాగుంటుందని నేను మనసులోనే అనుకున్నాను. "మీరు పగలల్లా ఏంచేస్తూఉంటారు?" అని నేనుకూడా మిసెస్ కటారాను అడిగాను.

"ఏమీలేదు. ఊరికే కూచుంటాను" అన్నది ఆవిడ.

"అయితే, నావెంట రావటానికి మీకేమీ అభ్యంతరంఉండదుగా?" అన్నాను.

"ఎక్కడికీ ?"

"సాంఘిక సంక్షేమకేంద్రానికి"

"ఏమండీ ! మా ఆవిడ అక్కడికొచ్చి ఏంచేస్తుందండి ? అది ధనవంతులూ, పెద్దవాళ్ళు వచ్చేచోటు. దీనిదగ్గర అక్కడకు కట్టుకుపోవటానికి తగిన చీరకూడా ఉండదే ?మోటారుకారు అసలే లేదు" అన్నారు కటారాగారు.

"కారు మాకుమాత్రం ఎక్కడిది? చీరంటారా, నాకంటే, మంచి చీరే కట్టుకొన్నది మీఆవిడ. మిష్టర్ కటారా ! మీఅభిప్రాయం తప్పు. వస్తావుగా చెల్లాయి !"

"వస్తాను"

ఆరోజు నేను మిసెస్ కటారానుకూడా తీసుకువెళ్ళాను. ఆవిడ పేరు రాగిణి. తారాదేవి ఆమెను కలుసుకుని చాలా సంతోషించింది.

"సాంఘికసంక్షేమకేంద్రం ఈదేశంలో నిదురబోతున్న స్త్రీలను మేలుకొల్పటానికే. మహాత్ముడు మనకు మార్గంచూపించివెళ్ళాడు. దేశాన్ని నిర్మించవలసిన అవసరంఉన్నది. దీనికోసం మనకు పనిచేయటానికి ఉత్సాహంగల వ్యక్తులు కావాలి. మీరు రావటంవల్ల నాకు చాలా సంతోషంకలిగింది" అన్నది ఆవిడ.

తారాదేవిగారు ఈవిధంగా రంగుఫిరాయించడం చూసి, చాలా ఆశ్చర్యపోయాను. ఆవిడ వరండాలోకి రావడం చూసి మెల్లిగా "ఇవాళ మీ రేమిటో కొత్తరకంగా మాట్లాడుతున్నారే ?" అన్నాను.

"ఏం, నీతో ప్రైవేటుగామాట్లాడినవిషయాలు అందరికీ చెప్పాలంటావా కొంపతీసి ? నీ సంగతి వేరు" అని ఆవిడ అతిప్రేమగా నా గడ్డంపట్టుకొని పుణికింది. మిసెస్ కటారా దూరాన్నుంచి ఇది చూసింది. నాకు సిగ్గువేసింది.

నేను తిరిగివచ్చినతరువాత మిసెస్ కటారా అన్నది, "పాపం, ఆవిడ చాలా మంచిది. ముసలివాళ్ళా, పెద్దవాళ్ళా ఎలాఉండాలో అలా వుంది. అసలు ఒకటిఉందిలెండి! ఈ పాతకాంగ్రెసువాళ్ళు చాలా తపస్సు చేశారు. అందువల్ల వాళ్ళలో ఆత్మీయత ఎక్కువగా ఉంటుంది" ఆవిడ భ్రమను తొలగించకుండా అలా ఉంచడమే మంచిదనుకొన్నాను నేను. "మీరిద్దరూ తిరిగి ఆడవాళ్ళను మెంబర్లుగా చేర్చండి" అని తారాదేవి సలహాఇచ్చింది.

నేను కోరుకొన్నదే ఇది. మిసెస్ కటారా కూడా చాలా సంతోషించింది. ఆవిడ నావెంట మొట్టమొదట బయలుదేరి వచ్చినప్పుడు కొంచెంసిగ్గుగా తలమీద ముసుగువేసుకొన్నది. ఇప్పుడు స్వాతంత్ర్య పథంలో అడుగుపెట్టిన ధీరురాలిలాగా ఆముసుగుతీసివేసింది.సంతోషంతో పొంగిపోతూ అన్నది—"నాకు నలుగురితో తిరగటమంటే మొదట నుంచీ సరదాయే. ఒంటరిగా పడిఉంటున్నాను. వారు ప్రొద్దున వెళ్ళితే, సాయంత్రానికిగాని రారు. నా కేమీ ఊసుపోదు. వంటవాడు వంట చేస్తాడు. నేను పగలల్లా కూర్చుని ఏంచేసేది? పెళ్ళైనతరువాత నేను కోరుతున్న సుఖం,మనశ్శాంతీ లభించలేదు. ఎప్పుడన్నావారితో చెబితే— 'నీ వదినెలు ఎలాఉంటున్నారు?' అంటారు. 'వా రెలావుంటే నాకేం? నా యింట్లో నాఇష్టప్రకారం ఉండాలి నేను' అంటాను. అప్పుడు "అయితే నువ్వు ఎందుకు ఎప్పుడూ వాళ్ళను పొగుడుతూవుంటావు ? వాళ్ళను చూపించి నన్నూ— నన్నుచూపించి వాళ్ళను లొంగదీయాలని నీ ఉద్దేశ్యమా ?" అంటారు వారు. దానితో నాకు మండుకొస్తుంది. ఇక మళ్ళీ మాట్లాడనేమాట్లాడను."

"అది సరేగాని, ఇప్పుడు ఎటుపోదామో చెప్పు?" అన్నాను.

"చెప్పేదా? మనం సంఘంలోకి వెళ్ళాలికదూ ? అయితే పద, ముందు మనం కెరోల్‌బాగ్ వెళ్దాం. అక్కడ నే నొక మధ్యసర్గకుటుంబాన్ని ఎరుగుదును. నాకు వాళ్ళతో చాలా పురాతనపరిచయంవుంది. మిస్టర్ శర్మ ఒకాయన వున్నాడు."

"మిస్టర్ శర్మా! అక్కడకు వెళ్ళి ఏంచేస్తావు? అది ఆడవాళ్ళ పెట్టె కాదే?" అన్నాను. ఇద్దరము తెగనవ్వుకొన్నాం. "శర్మగారు కాదు— వారి మిసెస్ వుంది" అన్నది రాగిణి.

"మిసెస్ శర్మగారింటికి వెళ్ళటంలో బస్సులో నానాతిప్పలుపడే టప్పటికి వున్నవుత్సాహమంతా మాయమైపోయింది. ఆ బస్సులో కొంత మంది విద్యార్థులుకూడా వున్నారు. చాలా ఖరీదైనసూట్లు వేసుకొని వున్నారు. కాని వాళ్ళసంభాషణలు వినేప్పటికి నేను సిగ్గుతో నిలువునా నీరైపోయాను. మగవాళ్ళదగ్గరనుంచి సజ్జనత్వం క్రమంగా దూరమౌతున్నదిగనుక స్త్రీసమాజజాగృతి నాకు యింకా అవసరమనిపించింది. వీళ్ళు యీ లేతవయసులోనే యిలా తయారయితే,ముందుముందు యింక చెప్పాలా?"

కొంతసేపట్లో మే మక్కడికి జేరుకున్నాం. మిసెస్ కటారా తలుపుతట్టింది. ఒక నడివయస్సుఆమె తలుపుతెరచింది. ఆవిడ ఒక మామూలుచీర కట్టుకునివున్నది, మధ్యపాపిడి తీసుకొని వున్నది. మెడలో ఒక బంగారపుగొలుసు తళ తళా మెరుస్తున్నది. చూడటానికి కొంచెం లావుగా బొద్దుగా వున్నది. మమ్మల్ని చూడగానే "ఆరే రాగిణి! రా రా, చాలారోజులతరువాత వచ్చావు క్షేమంగా వున్నావా ? బాగుంది, ఈమె నీ స్నేహితురాలా ?" అన్నది.

"అవునండి; స్నేహితురాలే!"

"రా, కూర్చో. మీరుకూడా కూర్చోండి. ఏంచేస్తాం? యిలావుంది సంసారం. యెంతకష్టపడ్డా మా యిల్లు శుభ్రంగా వుండదు. మీ రిలా కుర్చీమీద కూర్చోండి" అన్నది ఆవిడ నాతో.

"మీ రనవసరంగా శ్రమపడకండి. నేను కూర్చుంటాలెండి"

"అదేమిటి? రండి, యిలా కూర్చోండి" అన్నది ఆవిడ.

నేను కూర్చున్నతరువాత ఆమె నాయెదురుగా చాపమీద కూచుని తాంబూలంవేసుకుంటూ అన్నది. "గొప్పగొప్పయిళ్ళనుంచి వస్తున్నారు మీరు. నేను స్కూల్లో చదువుకునేటప్పుడు యిలాగే యెన్నో కలలుకనే దానివి. కాని కలలదేముంది?" అని ఆవిడ "ఒసే లల్లీ!" అని పిలిచింది.

లల్లి వచ్చింది. తల దువ్వుకోలేదు. వడియాలు పెడుతున్నట్టుంది. ఆ చేతులతో అలాగే వచ్చేసింది. మమ్మల్ని చూసి, సిగ్గుపడి పారిపోయింది. ఆవిడగా రన్నది. "పెద్దమనిషిఅయ్యింది. మెట్రిక్‌దాకా చదివించాం దీన్ని. కాని వరుడు దొరకటంలేదు. యెవర్ని కదిలించినా నోరు తెరుచుకు కూర్చున్నారు. యీమధ్య ఒకపిల్లాణ్ణి చూశాం. వీళ్ళనాన్నగారు అతగాణ్ణి ఒకరోజున టీకి పిల్చి పిల్లనిగూడా చూపించారు. ఆ పిల్లవాడు వప్పుకున్నాడుకూడాను, కాని వాడితల్లికి యిది తెలిసేటప్పటికి చాలా కోపగించుకున్నది, నే నేదో ఆ కుర్రవాణ్ణి మాయజేస్తున్నట్లుగా. మీరే చెప్పండి, యిదెక్కడి అన్యాయం! కుర్రవాడితండ్రి "అదికాదే, కాలం మారిపోయింది. పిల్లాడు పిల్లనిచూట్టానికి పోతేమాత్రం యేం మునిగిపోయిందని" అంటే రాణిగారు ముఖం యింత జేసుకుని, ముసుగువేసుకుని మూలను గూర్చున్నది. "లక్షణమైన నా పిల్లాడికి యెనిమిదివేలకు దమ్మిడీ తక్కువ తీసుకోను" అన్నది. హుం" అని ఆవిడ అసహ్యంతోనూ వ్యంగ్యంగానూ ముఖం అదోలా పెట్టింది. తాంబూలంపళ్ళెం నావైపు, రాగిణివైపు తోసి; "తీసోకోండి. నువ్వుకూడా తీసుకో రాగిణీ. నువ్వే యిలా మొగమాటపడుతూవుంటే ఆమె ఎలా వేసుకుంటారు? మేం బీదవాళ్ళమన్నసంగతి నీకు తెలిసిందే గదా!" అని మిసెస్ శర్మ నవ్వింది. నవ్వులో యెంతో వివశత్వం వున్నది.

నేను కాలమంతా వృధాఅయిపోతున్నదన్నవుద్దేశంతో మెల్లిగా వచ్చినసంగతి యెత్తాను. "చూడండీ, మేము సాంఘికసంక్షేమకేంద్రం తరపున వచ్చాం"

నేను చెప్పిందంతా విని ఆవిడ అన్నది. "భగవంతుడు మీ కన్నిరకాల సహాయపడతాడు. కాని నే నేమీ చేయలేను. యింటిపనులతో

తీరికే దొరకటంలేదు. నన్నుమాత్రం క్షమించండి" అన్నది ఆవిడ.

"అయితే లల్లీని పంపించరాదూ!" అన్నది రాగిణి.

''అయ్యయ్యో! దాన్ని పంపించటానికి నేనెవర్ని? అది పరాయి సొత్తుగదా! వయసొచ్చినపిల్ల. ఆ మూడుముళ్లు పడిపోతే, తరవాత దానిమొగుడొప్పుకుంటే యెన్నాట్లాడినా ఆడొచ్చు. అప్పటిదాకా జాగ్రత్తగావుండాలిగద! దాన్ని పంపించటానికి నే నెవర్నసలు? మీకేం. పెళ్ళిళ్ళయిపోయినయి. మీలాగా దీనిని నమ్మి నేను యింట్లో సుఖంగా ఎల్లా కూర్చోను? కొంపదీసి యేవన్నా అయ్యిందంటే, వీళ్ళ నాన్నగారు నా గొంతుకోసెయ్యరూ? అందులో ఈపిల్ల బొత్తిగా అమాయకురాలు! గంగిగోవనుకోండి! దీన్నినమ్మి యెలా బయటకు పంపటం?" అన్నది మిసెస్ శర్మ.

మేము తిరిగివస్తూంటే రాగిణి కోపంగా "వీళ్ల అజ్ఞానానికి అంతులేదు. నాకు జ్వరంవచ్చినట్లుగావుంది" అన్నది.

"నాకు జ్వరం దిగుతున్నట్లుగావుంది" అన్నాను నేను.

"యిప్పు డేంచేద్దాం?" అని అడిగింది రాగిణి.

"యివ్వాళింకేం వద్దు. రేపు మరెక్కడికన్నా వెళదాం.

"యెక్కడికి?"

"ఎక్కడికన్నా"

"కాస్తోకూస్తో పరిచయమున్నచోటే యిట్లావుంటే—"

"పరిచయంలేకుండావుంటేనే బాగుంటుంది. మనం వాళ్ళతో చక్కగా వాదించవచ్చు.''

''వాదనలవల్ల పనులుజరిగేటట్టుగావుంటే, ఐక్యరాజ్యసమితివల్ల ప్రపంచంలో సమస్యలన్నీ తీరేవేగదా" అన్నది రాగిణి.

"మాఅన్నయ్య ఒకాయనున్నాడు. ఆయన చాలా తక్కువగా మాట్లాడేరోజుల్లో అందరూ ఆయనమాట వినేవాళ్లుకారు. ఆయనవాదించటం యెక్కువయ్యేటప్పటికి జనంకూడా ఆయనమాటలు వినటం తగ్గించేశారు. యిప్పు డాయన్ని చూడగానే జనులు ముసిముసినవ్వులు నవ్వుతారు, పాపం! ఆయనేమో కమ్యూనిస్టురాజ్యాన్ని వూహించగానే ప్రజ

లంతా ఆనందంతో మందహాసంచేస్తున్నారని అనుకుంటాడు. అసలు సంగతి ఆయన కేం తెలుసు?"

'రాగిణిమాటలు చాలా గమ్మత్తుగా వుంటాయి. నన్ను బాగా నవ్విస్తుంది. మాటమాటకు యేదో విధంగా నవ్వుతెప్పిస్తుంది. యీవిడేనా తన యింట్లో వున్నప్పుడు అంత దీనంగా, విస్సహాయురాలుగా వున్నది. యీవిడ కింట్లోవున్న కష్టంమాత్రం యేమున్నది? యిల్లూ వాకిలి వున్నది, భర్త వున్నాడు. మంచి జీతం వస్తుంది. పనివాళ్ళున్నారు. పెద్దసంసారం కాదు. యేమీ దిగులులేదు. అయినా, యీవిడ సుఖంగాలేదు, నాలాగే. ఆమాటకొస్తే తారాదేవికీ సుఖంలేదు. లేడీదాసుకూ లేదు, మిసెస్‌శర్మకీ లేదు. అప్పుడు సుఖంఅంటే యేమిటీఅన్న ప్రశ్నవస్తున్నది. రాత్రికి నేను మావారి నడిగాను అదేప్రశ్న.

"సుఖం యు మీన్ ప్లెజర్ ఆర్ హాపినెస్. శాటిస్‌ఫాక్షన్ ఆర్ కంటెంట్‌మెంట్. వాట్ యె లాంగ్వేజ్ యీజ్ దిస్ యింగ్లీష్! యు కెన్ యెక్స్‌ప్రెస్ యువర్ యిన్నర్‌మోస్టు ఫీలింగ్స్. నాట్ యిన్ హిందీ, నాట్ యిన్ హిందీ!"

"మీరు నాకు సుఖానికి యింగ్లీషేమిటో చెప్పండి? ప్లెజర్‌అంటే మనస్సంతృప్తి. హాపినెస్ అంటే ఆనందం. శాటిస్‌ఫాక్షన్ అంటే— సంతుష్టి. కంటెంటుమెంటు అంటే సంతృప్తి. సుఖానికి యింగ్లీషు చెప్పండి సుఖానికి!"

"యివన్నీ కాకపోతే, యింకేమిటీ సుఖం? నువ్వనేదానికి అర్థం యేమన్నావుందా? యింగ్లీషుతో పోటీకొస్తుందా నీ హిందీ? బెంగాలీలాగా హిందీలో యింకా యెవరికీ నోబుల్‌ప్రైజ్‌కూడా రాలేదే! యింగ్లీష్‌లో వున్నదున్నట్టుగా అనువాదంచెయ్యటానికి వీల్లేనిది యేమన్నా వుందా అసలు?" అన్నారు వారు.

'నేను నవ్వి 'సరే. అనువాదంచెయ్యండి. పిండివిసిరించుకుని రమ్మని కాస్త అతనితో చెప్పు.' అన్నాను

'పిండి విసిరించుకురావటమా! పిండిఅంటేనే విసిరింది అని గదా అర్థం?'

'అయ్యిందా అయ్యగారిపని. దీన్ని అనువాదంచెయ్యండి.'

'నా హుంకార్ని వింపుకోవి రా!'

ఆయన తిరుగుడులో పడిపోయారు. 'యింకావుంది వుండండి. నేను పెరుగు తోడుబెట్టాను, చెయ్యండి అనువాదం' అన్నాను.

'యిదేమంత గొప్పసంగతి కాదు. యిది నుడికారానికి సంబంధించినవిషయం. ప్రతిభాషలోనూ యిలాంటివి వుంటయి. హిందీలో అనువాదం చెయ్యటానికి వీల్లేనివికూడా చాలా వుంటాయి.' అన్నారు వారు.

'అలాంటివేవీ వుండవు. అయ్యగారూ, హిందీ ప్రపంచంలో అన్నిటికంటె శ్రేష్ఠమైనభాష. యిందుట్లో యేమి రాస్తామో అదే చదువుతాం. మీ యింగ్లీషు అలాగాదు."

'అలా చెప్పి అందర్నీ మోసంచేసే రోజులు పోయాయండి. యిప్పు డసలురంగు బయటపడుతున్నది. మీరు చెప్పినా యెవరూ నమ్మరండి.' అన్నారు వారు కొంచెం బిగ్గరగా నన్ను ఎగతాళిచేస్తూ.

'ఎందువల్లా?'

'ఈమధ్య మా డిపార్టుమెంట్‌లోవున్న సరీన్ ఒక రష్యావాడికి హిందీ చెప్తున్నాడు. ఆ రష్యావాడు మంచి తిరుగుడులో పెట్టేశాడు. హిందీలో మనం ఖచ్చితంగా రాసిందే చదవమని రుజూచేసేశాడు.'

'అదెలాగా!' అనడిగాను.

'విను. నీవు వ్రాయటం 'రఖా' అని రాస్తావు. చదవటంమాత్రం 'రఖ్ఖా' అని చదువుతావు. ఏం! 'చల్తాహై' అంటావు. కాని రాయటం 'చలతాహై' అని రాస్తావు, నువ్వే చెప్పు. 'చలతాహై' అనేదాన్ని ఖచ్చితంగా చలతాహై అని యెవరైనా చదువుతారా? యెవ్వరూ చదవరు. ప్రతిశబ్దంలో రెండవకాన్‌సొనెంట్ మధ్యలో ఉన్నప్పుడు సగమే వుచ్చరించబడుతుంది. యింకా విను: 'పైసా' 'ఔరత్' లోని మాత్రలను మార్చివేసి చదువుతాడు. వుదాహరణానికి 'భైయ్యా' 'కౌవా' యేదన్నా క్రమం వుందా? 'ఘోడీ' ప్లూరలా? సింగ్యులరా? ప్లూరలే కాని, నువ్వు 'ఘోడేకో దేఖో' అంటావు. అంటే యిప్పు డది ప్లూరల్‌కి బదులు సింగ్యులర్ అయిపోయిందన్నమాట. యెందువల్ల? 'మేజ్' 'కలం' 'పిస్తోల్' వీటివిషయంలో వీటివెంటవచ్చే వెర్బు మ్యాస్క్యులిన్ రావాలో, ఫెమినైన్ రావాలో యింకా నిశ్చయమేకాలేదు. కొంతమంది 'మేజ్ రఖీథీ'

'పిస్తోల్ చెలీ' అంటారు. మరికొంతమంది "మేజ్ రఖాథా" 'పిస్తోల్ చెలా'అంటారు. చివరకు "ఈ" కారాంత్ శబ్దాలన్నీ ఫిమినైన్ అను కుంటే 'హాథీ' 'దహీ' ఫిమినైన్ కావే. యింకా చెప్పేదా? యిలాంటివి ఒకటికాదు, సవాలక్ష వున్నై. హిందీవాళ్ళు ఉర్దూని ఎగతాళిచేస్తారు. వాళ్ళసంగతి వాళ్ళకి తెలియదు.

నేను చిక్కుల్లోపడిపోయాను. వీటినిగురించి నే నెన్నడూ ఆలో చించలేదు, వా రన్నారు. సైన్స్‌కి సంబంధించినమాటలు అసలు లేనే లేవు. హిందీలో యిప్పుడు బలవంతాన తయారుచేస్తున్నారనుకో, కాని ఆ తయారుచేస్తున్నవాళ్ళకికూడా తాము తయారుచేసిన డిక్షనరీ తెరిచి చూస్తేనేగాని ఆ శబ్దాలకు అర్థం తెలియదు. ప్రపంచంలోని యితరభాషల కంటె హిందీ యేవిధంగానూ గొప్పదికాదని తేలిగ్గా రుజూచెయ్యొచ్చు. కాని యీ హిందీవాళ్ళ బుర్రకెక్కితే గదూ! మనం యేదో సుఖాన్ని గురించి మాట్లాడుతున్నాంగదూ?"

"తగలబెట్టియండి వెధవసుఖం! హిందీలో సుఖం యెక్కడుంది లెండి" అన్నాను నేను.

"అరె! యిదెక్కడి అలవాటంటా! ఆడవాళ్ళతో జనరల్‌గా మాట్లాడినా వాళ్ళు వాటిని పర్టిక్యులర్‌గా తీసుకుని తమ నేదో అంటు న్నట్టు ఫీలవుతారు. నువ్వు మాట్లాడేధోరణి చూస్తే హిందీ అంటే నువ్వేనా అనిపిస్తుంది!"

"అవునులెండి, నే నుత్త తెలివితక్కువదాన్ని కదూ! యింగ్లీషులో లోపాలేమీ లేనేలేవన్నమాట?"

"అవి నే నెప్పు డన్నాను? అన్నిట్లోనూ లోపాలుంటై" అని నేను అన్నాను.

"నా మూడ్ చెడిపోయింది. యిక నేను మీతో వాదించలేను. మీ గోలేమిటో మీదేగాని, యితరులుచేప్పేది వినిపించుకునే ఓపికలేదు మీకు" అన్నాను కోపంగా.

"అవునవును. ఆడటం చేతగాక మద్దెల ఓటిదన్నాడట వెనకటి కెవడో! అట్లావున్నది నీపని" అని వారు పక్కున నవ్వారు.

"పద పద. కమాన్, యివ్వాళ ఒక మంచి బ్రహ్మాండమైన పిక్చ రుంది. సరిగ్గా అరగంట టైంవుంది. చూచివద్దాం పద."

"వద్దులెండి, నేనురాను, మీరు వెళ్ళండి."

"నో నో నో! అదెట్లా? వీల్లేదు. నువ్వు తప్పకుండా రావాలి"

యింకేంచేసేది? చివరకు వెళ్ళక తప్పిందికాదు. నేను నైలాన్ చీర కట్టటం చూచివారు "స్వెట్టర్ వేసుకో, డార్లింగ్! మంచుపడుతున్నది. నీకు కుంపటిదగ్గర కూర్చున్నట్లుందేమో కాని, మాకుమాత్రం మెదళ్లు కూడా గడ్డకట్టిపోతున్నాయి చలికి. యెక్కడచూసినా నిమోనియాలే" అన్నారు.

ఇలా అనేటప్పటికి నాకు జ్ఞాపకంవచ్చింది. "అరె!" ఆ నిమో లియా యేమయ్యాడు?" అని అడిగాను.

"తప్పించుకున్నాడుగా దొంగవెధవ! వాడివెనక యెవరో రాజ కీయనాయకు లున్నారు. యీ నాయకులు ఘంటలు. మనదేశాన్ని నాశనం చేయందే వూరుకోరు. యింకెన్నాళ్లలే, మూన్నాళ్ళముచ్చటేగా! యేమి సాకు చెప్పారో తెలుసా? "నిమోలియా పోలీసులకు ఫోన్ చెయ్యబోతు న్నాడు. తీరికచిక్కలేదు. ఫోన్ చేసేలోగానే పోలీసులొచ్చేశారు" అన్నారు. యెలాగైతేనేం, శుభ్రంగా తప్పించుకున్నాడు"

అంతా సిఫార్సుల్తో వుం దీ రోజుల్లో.

మేం మాట్లాడుకుంటూనే వున్నాం, యింతలో బయట యేదో కారు ఆగింది. చూస్తే యింకెవరు? డాక్టరు నిమోలియా! "హల్లో" అని కేకవేశాడు డాక్టరు. మా కారు అతివేగంగా ముందుకువెళ్ళి నిమోలియా రెండుబుజాలమీద చేతులువేసి ప్రేమ ఒలికిపోతున్నట్లు "యు హావ్ కమ్ బాక్ యూలిసిస్! బ్రేవో "బ్రేవో!" అన్నారు.

"యెక్కడికన్నా వెళ్ళటానికి ప్రోగ్రాం వేసుకున్నారా యేమిటి?" అని డాక్టరు నావంకచూచి అడిగాడు.

"బ్రదర్! నువ్వొచ్చావు! చాలా సంతోషకరమైన విషయం. అయినా పోలీసువాళ్ళపని మరీ అన్యాయంగావుందిలే! ఏమీ చెయ్యలేక వూరుకున్నాను. కాని నామనస్సు ఒకపక్క పీకుతూనేవుంది. డాక్టర్, మేము తప్పనిసరిగా ఒకచోటికి వెళ్ళాలి. మా రెలిటివ్స్‌లే! రావటా

నికి మళ్ళీ తొందరగానే వచ్చేస్తామనుకో: కాని వెళ్ళకతప్పదు. వెరి సారీ! యీవిడ ముందే టైం ఫిక్సుచేసింది. అండ్ వుయ్ షుడ్ కీప్ టైం" అన్నారు మావారు.

"ఒన్ మష్ట్....అయితే. మరి నే వస్తాను. మళ్ళీకలుసుకుంటాలే" అన్నాడు డాక్టరు. అతను వెళ్ళిపోయినతరువాత "యెంత ప్రేమచూపించారు మీరు! నే నలా చూస్తూనే వుండిపోయాను," అన్నాను నేను.

"మరేమనుకున్నావు! మగవాళ్ళబ్రతుకంతా యిలాంటి దొంగ వేషాల్తోనే గడిచిపోతుంది డార్లింగ్! మనిషి బ్రతకాలంటే యెన్ని వేషాలు వెయ్యాలో, యెన్ని మోసాలుచెయ్యాలో నీ కేం తెలుసు? నేను మొదటిసారే యెగ్జిస్టెన్సియలిజాన్ని వప్పుకునేవాణ్ణి. కాని యిప్పుడు వాడు కూడా దాన్ని వదిలివేశాడని తెలిసినతర్వాత నేనుకూడా వదిలివేశా' అని మావారు నవ్వారు. నేనుకూడా నవ్వాను. మేము పిక్చరు చూడటానికి బయలుదేరాం.

పిక్చరునుంచి తిరిగివచ్చి భోజనంచేశాం. వారు నిద్రపోయారు. నే నింకా మేలుకునేవున్నాను. నీ కీ వుత్తరంరాస్తున్నాను.రాగిణీ. మేము రేపు మళ్ళీ లేస్తాం. రేపు యేం జరుగబోతుందో!

చీకటిరాత్రి.గంభీరమైన నైశ్శబ్ద్యం. అందరూ నిద్రపోతున్నారు. యెక్కడా అలికిడిలేదు. పగలంతా కష్టపడి చెమటోడ్చి అంతా అలసి పోయారు. రేపు తెల్లవారితే మళ్ళీ అంతా మొదలు. యీ నిద్ర యెంత విచిత్రమైనది! నాకు మన చిన్ననాటిసంగతులు జ్ఞాపకంవస్తున్నాయి. యిలాంటి చలికాలపు రాత్రులలోనే మనమిద్దరం తలనుంచి మడమల దాకా వున్నిగుడ్డలు వేసుకుని, వెన్నెట్లో తిరిగితిరిగి వచ్చి మామిడితోపు వద్ద కూర్చునేవాళ్ళం. యెన్నెన్ని విషయాలు మాట్లాడుకునేవాళ్ళం. యెలాంటిరోజు లవి! యిప్పు డదంతా ఆలోచిస్తే ప్రపంచమే మారి పోయినట్లుంటుంది. మారటంకూడా మళ్ళీ అలాగిలాగ కాదు. నాజీవితమే మారిపోయింది నే నిక్కడ వున్నాను. నా భర్త పక్కనే నిదరపోతున్నారని తలుచుకుంటే నాకే ఆశ్చర్యమేస్తుంది. యింతలో వారు పక్కకితిరిగి "నువ్వింకా మేలుకునేవున్నావా, నిదరపోలేదూ?" అని అడుగుతున్నారు.

"యిదిగో, యీవుత్తరం పూర్తిచేసి నిద్రపోతాను." అన్నాను. యిక నేనుగూడా పండుకుంటాను. మళ్ళీ వుత్తరం రాసిందాకా —

నీ సుశీల.

పి. ఎస్. అసలు నా వుత్తరాలు నువ్వు చదువుతున్నావా? లేక పోతే యెందుకూ పనికిరానివని మడిచి పక్కనపెట్టేస్తున్నావా? నేను గూడా యిక నా వుత్తరాలపైన "శ్రీరాములవారి సహాయము కావలెను" అని రాసేదా? మనిషి చంద్రుణ్ణికూడా దాటి, సూర్యుణ్ణి నాలుగువైపులా చుట్టిరావటానికి ప్లానువేస్తున్నాడని నే నివాళ పత్రికలో చదివాను. అత డిప్పుడు కొత్తగ్రహాలనే నిర్మించాలనుకుంటున్నాడు. యిదంతా యేనాటి కైనా జరుగుతుందంటావా? ఒకవైపున యింత పురోగమనం—మరో వైపున యిన్ని చిక్కులు! మానవునిముందు యే మార్గము స్పష్టంగాలేదు. యీ చిక్కులన్నిటికి పరిణామం యేమవుతుందో! ప్రపంచం యిలా నడు స్తూనే వుంటుందా? లేక మానవజాతి నాశనంఅయిపోతుందా? మానవుడు నాశనంఅయిపోతాడు; యెంత భయంకరమైన ఆలోచన! కాని యిం దులో భయంకర మేముంది? నిర్భరమైన ఈ నిద్రలో గాయపడిన మరు భూమిలా ప్రారంభమైన స్వప్నం తనలోంచి రేగిన యిసుకతుపానుల్లోనే అణగారిపోతే అందులో నష్టమేముంది? తారాదేవిమాటలు గుర్తొస్తు న్నాయి. ఆ పైనున్నవాడి ఉద్దేశం యేమిటో! అంతుచిక్కటంలేదు. సరే, యిక గమ్యంసంగతి చెప్పనక్కర్లేదు.

## 8

ప్రియమైన చెల్లీ!

అసలుసంగతేమిటి? యింతవరకు నీవు నా వుత్తరానికి యేమీ జవాబు రాయలేదు. నిర్లక్ష్యం అనేదానికికూడా హద్దూపద్దూ వుండాలిగదా! నీ కసలు యేమీ కొంచెంకూడా తీరికచిక్కటంలేదా? అయినా అంత తీరికలేకుండా యెలావుంటుంది? నేను నీకు చాలారోజులనుంచి వుత్తరం రాయలేకపోయినమాట నిజమే. కాని నేను రాయకపోతే నువ్వుకూడా రాయకూడదని యెక్కడన్నా రాసిపెట్టివుందా? సరే, కానివ్వు. నన్ను యెంతవరకు వేధిస్తావో వేధించు.

యీమధ్య నేను చాలా బిజీగావున్నాను. ఒకరోజున మిసెస్

కటూరా నన్నుకలుసుకుని "అక్కయ్యగారూ! యివాళ వెళదామాండీ?" అన్నది.

"నేనుగూడా దీనికోసమే మీవద్దకు వద్దామనుకుంటున్నాను" అన్నాను.

సరే, మేము బయలుదేరాం. పాతఢిల్లీకి వెళ్ళాం. మా దృష్టి అకస్మాత్తుగా ఒక బోర్డుమీద పడింది 'హెడ్ క్లర్క్' అని రాసివుంది.

"పద, యీ యింటిలోకే పోదాం." అన్నాను నేను. పేరూగీరూ అంతా చదివి తెరచివున్నవాకిలివద్దకు పోయి "యెవరండీ" అని కేక పెట్టాను. ఒకామె పెద్ద ముసుగువేసుకుని వచ్చింది.

"యెవరు మీరు?" అన్నది.

"మేమండీ!" అని ఒకరినొకరం చూచుకొని నవ్వుకున్నాం.

"వా రింటివద్ద లేరు."

"వారెవరు?"

"యీ యింటి యజమాని."

"మాకు వారితో యేమీ పనిలేదు. మీతోనే పనివుంది."

"యీ యింటియజమానురాలు మీరేకదూ?" అని అడిగాను.

"అవును"

నేను లోపలకు దూరాను. రాగిణికూడా నావెనకాలే వచ్చింది. కూర్చోటానికి చోటులే దక్కడ. యింట్లో యెవరో బందిపోటుదొంగలు దూరినట్లుగా చూస్తున్నది ఆవిడ. యిప్పుడు ముసుగు తీసివేసింది. కొంచెం చామనచాయ, అయినా చక్కనిమొహం. ఘోషాలోవుంటే ఆరోగ్యం బాగావుండదంటారు. కాని ఆ యిరుకుగొందిలో అంత ఘోషాలోవుండి కూడా ఆవిడ చాలా ఆరోగ్యంగావుంది. మేమిద్దరం ఒకమంచంమీద కూర్చున్నాం. ఆవిడ యెదురుగా నిలబడే ఉంది.

"మీరుకూడా కూర్చోరూ?" అన్నది రాగిణి.

"కూర్చుంటాలెండి," అని ఆవిడ ఒక చిన్నపీట లాక్కొని కూర్చుని "యేంపనిమీద వచ్చారు?" అని అడిగింది.

"రాజధానిలో ఒక సాంఘికసంక్షేమకేంద్రం తెరువబడింది. ఆడ వాళ్ల అభివృద్ధిచెందేలా చూడటమే దానిఉద్దేశ్యం."

"ఆడవాళ్ళు యేంఅవ్వాలి?"

"ముందుకుపోవాలి. బాగా వృద్ధిలోకిరావాలి. దేశంలో నూతన నిర్మాణం జరుగుతున్నది. జనులు పురాతనపద్ధతులన్నీ వదిలేస్తున్నారు. మచ్చుకు యీ ఘోషాఅనేదికూడా ఒక పాతఆచారం."

ఆవిడ నవ్వింది. "అమ్మబాబోయ్! మగవాళ్ళముందు ముసుగు లేకుండావుండటమే! యేమండీ, నేను రైల్లోఅయితే ముసుగుతీసివేస్తాను. ఒకసారి నేను మా మరిదివెంట ప్రయాణంచేస్తున్నాను. మా చిన్నమరిది లెండి. అక్కడ రైల్లో నలుగురైదుగురు గూజరీలు కూర్చునివున్నారు. పల్లెటూరివాళ్లకూడా కొంతమంది వున్నారు. వాళ్ళకు మీసాలులేవు. గూజరీలుకూడా ముసుగులేకుండా కూర్చునివున్నారు. యింతలో ఒకస్టేషన్ వచ్చింది. కొంతమంది గ్రామస్తులు బాగా మీసాలుపెంచుకున్నవాళ్ళు మాపెట్టెలో యెక్కారు. వెంటనే ఆ గూజరీలు ముసుగులాక్కున్నారు. యిదివరకటినుంచి కూర్చున్నమగవాళ్ళల్లో ఒకడు 'యేమమ్మా వారు మీకు కావలసినవాళ్ళేమిటి?' అని అడిగాడు. అప్పుడు వాళ్ళల్లో ఒకతె "లేదు. మేము వాళ్ళ నసలు యెరగం." అన్నది. అప్పు డతను "అయితే మరి మీరు ముసుగెందుకు వేసుకున్నారు?" అని అడిగాడు. ఆ అమ్మాయి "వాళ్లు మగవాళ్లగదా!" అన్నది. "అయితే మేమూ వున్నాంగా, మేము మాత్రం మగవాళ్లంకాదా?" అని అడిగా డతను. ఆ అమ్మాయి "మీరు మగవాళ్ళని ఆనవాలేముంది? వాళ్ళకు చూడండి, యెంతెంత పొడుగు పాటి మీసాలున్నయ్యో!" అన్నది.

యీ కథచెప్పి ఆవిడ నవ్వింది, మేముకూడా నవ్వాం. యీవి డెవరో మంచి గమ్మత్తయినమనిషే.

చాలాసేపటిదాకా కూర్చుని మేము ఆమెకు యెన్నోసంగతులు నచ్చచెప్పాం. పాపం! మేం చెప్పిందంతా చాలా శ్రద్ధగా విన్నది. విని చివరకు "ఆయనొచ్చింతరవాత అడుగుతాను. మీ కేసంగతీ తరవాత చెప్పతాను. మీరంతా గొప్పగొప్పకుటుంబాలవాళ్లు, నేనేమో పేదరాల్ని. వారిష్టంలేందే నే నేం చెయ్యగలను?" అంది.

"అలాగాదు. మీరు తప్పకుండా రావాలి. మాకు వీలైనంత యెక్కువమంది కావాలి."

మేము కాంగ్రెసుకుకూడా చందాకడ్తూవుంటాం. ఆయన రోజూ పత్రికతెప్పించి చదువుతూవుంటారు. అప్పుడప్పుడు నన్నుకూడా వినమంటారు. మీరే చెప్పండి: అవన్నీ నాకేంతెలుసు?" యింతలో ఒక యువకుడు లోనికి ప్రవేశించాడు. అతడు వదులుగా ఒక పైజమా తొడుక్కున్నాడు. తెల్లనిచొక్కా, పైన ఒక వేస్టుకోటు. అతని తలమీద జుట్టు చిక్కగా వుంగరాలు వుంగరాలుగా మెరుస్తున్నది. కళ్లు యెలాంటివంటే, నేను అలా చూస్తూనేవుండిపోయాను.

"మా అన్నయ్య! నాకంటె ఒకసంవత్సరం పెద్దవాడు అంతే! అసలు పెళ్ళిచేసుకోనంటాడు." అన్నది ఆవిడ. ఆ యువకుడు మమ్మలనుచూచి వెనక్కితిరిగాడు. వెళ్ళి బయట గదిలో కూర్చున్నాడు.

"కావలిస్తే మీఅన్నయ్యను అడగండి. ఆయన చెప్తారు మీకు, యేమన్నా చదువుకున్నారా?" అని అడిగాను.

"ఎం. ఎ. చదివాడు. యెక్కడెక్కడి పుస్తకాలన్నీ చదువుతూ వుంటాడు. ఢిల్లీ చూచిపోదామని వచ్చాడు. తెగ చదువుతాడులెండి. హాత్రస్‌లో కాలేజీలో వుద్యోగం. హాత్రస్అనేవూరుపేరు విన్నారా?" అని అడిగింది ఆమె.

"విన్నాను," అన్నది రాగిణి.

"మీరు మీ అన్నయ్యనే అడిగిచూడరాదా?" అన్నాను నేను.

"పిల్చేదా, మీరేమీ సిగ్గుపడరుగదా!" అన్నది ఆమె.

"మీకు అన్నయ్య అయితే మాకూ అన్నయ్యే గదండీ!" అన్నది రాగిణి.

ఆవిడ చాలా సంతోషించింది. "అన్నయ్యా!" అని పిలిచింది. బయటనుంచి జవాబులేదు.

"వింటున్నావా అన్నయ్యా?"

"ఏమిటి?" అంటూ ఆయన వాకిలివద్దకు వచ్చాడు.

"యిదుగో, వీ రొచ్చారు; దేశసేవచేస్తూవుంటారు"

రెండువైపులనుంచి నమస్కారాలు చేశాం.

"మీరంతా చదువుకున్నవారుగదా, మీ యిండ్లలో ఆడవాళ్ళను సాంఘిక సంక్షేమ కార్యాల్లో యెందుకు పాల్గొనివ్వరు" అనడిగాను నేను.

''నేను యెప్పుడు వద్దన్నాను? పైగా నేనింకా ప్రోత్సహిస్తుంటాను. మీరుకూడా చెప్పిచూడండి; అది నా మాట వినదు. యీఇంట్లో నామాట వినేవాళ్ళెవరూ లేరులెండి" అన్నా డా యువకుడు.

అతనిచెల్లెలు నవ్వింది "నిజమేనండి, అన్నయ్యెప్పుడూ చెప్పుతూనేవుంటాడు; నే నేమంటానంటే, ముందు నువ్వు పెళ్ళిచేసుకుని నా కొక వదిన్ని తెచ్చిపెట్టు. బాగా చదువుకున్న వదిన వచ్చిందంటే నే నావిడ శిష్యురాలినయ్యి అన్నీ నేర్చుకుంటానంటాను."

యువకునిమొహం సిగ్గుతో ఎర్రబడిపోయింది. అసలే యెర్రనివాడాయెను. అతని పెద్దపెద్ద కండ్లలోని ఆ గులాబిరంగుజీరలు యింకా కెంపెక్కాయి.

"మీ కింకా పెళ్ళికాలేదేమిటి ?" అని అడిగాను.

"కాలేదు" అన్నా రాయన చాలా క్లుప్తంగా.

"యిది చాలా వ్యక్తిగతమైనప్రశ్నే అనుకోండి. అయినా అడుగుతున్నాను క్షమించండి. ఆడవాళ్ళంటే భయంవుండటంవల్లనేనా లేక—"

"నే నేంజవాబిచ్చేది? యిది వ్యక్తిగతమైనప్రశ్నఅని మీరే స్వయంగా చెప్పారు!" అన్నా డాయన.

"అది నిజమేలెండి" అని నేను నవ్వాను.

"అదికాదండి. అన్నయ్యకు బాగా యింగ్లీషుచదువుకున్న పెళ్ళాం కావాలి. యేమన్నయ్యా! నే చెప్పింది నిజమేనా?" అని ఆయన చెల్లెలు నవ్వింది. యువకుడు కొద్దిగా కోపగించుకున్నాడు.

"మీరు దీన్ని మెంబరుగా చేర్చుకోండి. వదలకండి"అన్నాడతను.

"యీమె వాళ్ళాయన్ని కనుక్కోవాలంటుందే"

"ఆయన్ని కనుక్కోనేదేమిటి దీనికి? చందా యిచ్చేసి మెంబరువైపో. యిది చెడ్డపనేం కాదుగా!" అని అతడు నావైపుతిరిగి ''నిర్మాణ కార్యక్రమం యింకా క్రిందితరగతులదాకా రాలేదు. మేమంతా క్రింది తరగతులవాళ్ళం. మీరు వర్గబంధనాలు తెంచుకుని మాదాకా వచ్చారు. మీకు స్వాగతం" అన్నాడు.

నేను అతనిమాటల్లోని బాధను అర్థంచేసుకున్నాను. స్పష్టంగా చెప్పటంలోవున్న స్వాభిమానాన్నికూడా గ్రహించగలిగాను. అతని

దృష్టిలో నా కొకవిధమైన విశాలత్వం కనిపించింది. అయితే, యిదంతా వ్యక్తిత్వంలోవున్న ఆకర్షణో, లేక అతనిమాటల ప్రభావమో నేను చెప్పలేను. అతన్ని చూస్తే, యిత నీ వాతావరణంలో వుండదగినవాడు కాదు, అని మాత్రం అనిపించింది.

చెల్లీ! నన్ను తప్పు అర్థంచేసుకోవద్దు. నామనస్సులోవున్న యీ భావాలు నా భర్తకు తెలిస్తే, ఆయన నన్ను అసహ్యించుకుంటారనికూడా నాకు బాగా తెలుసు. మన పాతివ్రత్యంలోని నీతి, శీలం, యీర్ష్యను ఆధారంచేసుకుని దానిప్రక్క-ప్రక్కనే పెరుగుతుంది. నేను రమారస్తోగిని గురించి మనస్సులో యేవిధంగా అనుకున్నానో అదేస్థితి యిప్పు డిక్కడ కూడా వస్తుంది. అయినా నాకు 'లేదు, యిది విషయవాంఛ కాదు!" అనిపిస్తుంది. ఒకవ్యక్తిని చూడటమే పాపంకాదుగదా ! మనలోని నీతి నిజానికి యెంత సంకుచితమైన సరిహద్దుల్లో చిక్కుకుపోయిందంటే, మనలో సహజమైన జీవితమే లేకుండాపోయింది. మొట్టమొదటే లేనిపోనిసంబంధాలు అంటగట్టేస్తారు. అందుకనే మనం త్వరపడి అలాంటిదేమీ లేదని రుజూచేసుకోటానికి ముందే సిద్ధపడతాం. యిది ఒకవిధమైన దౌర్బల్యం అని నాకు బాగా తెలుసు. సౌందర్యం స్వప్రయోజనానికి మరొకపేరు కాదుగదా.

చాలాసేపైంది. రాగిణి మెల్లిగా నాచెవిలో "యిక వెళ్దామా?" అని అడిగింది. "వెళ్దా"మని నేను ఆ యింటావిడతో "చూడండి, కాస్త తీరిక చిక్కితే మేము మళ్ళీ వస్తాం. మేము పేటలవారీగా చిన్నచిన్నమండలాలు యేర్పరచదలచుకున్నాం. వచ్చేసారి మనం యీ పేటలోని యితర స్త్రీలనుకూడా ప్రోగుచేద్దాం. అప్పుడు యేదైనా ఒక సాంస్కృతిక కార్యక్రమం ఆరంభించవచ్చు" అన్నాను.

ఆవిడ నావంక ప్రశంసాపూరితమైనదృష్టితో చూడసాగింది. "మా అన్నయ్య యేంచెప్పేవాడో నా కిప్పు డర్థమైంది. మా కేం చదువా సంధ్యా ! యిలాంటివన్నీ తొందరగా యెలా అర్థమవుతాయి?" అన్నది.

మేము వెళ్ళిపోయాం.

ఆరాత్రి నేను చాలాసేపటిదాకా ఆలోచిస్తూ కూర్చున్నాను, కాలేజీ రోజుల్లోని వాదోపవాదాలన్నీ జ్ఞాపకంవచ్చాయి. స్వాతంత్ర్యం లభించక

ముందు దేశం యెలా వుండేదో మనంకూడా చూశాం. ఆరోజుల్లో మనం స్కూళ్లో చదువుకున్నాం. ప్రజలు అప్పు డెలా మాట్లాడేవారు. ఇప్పుడెలా మాట్లాడుతున్నారు? ఎంత మార్పువచ్చిందో చూడు ! ఆరోజుల్లో యీ కాంగ్రెస్‌వాళ్ళంటే జనానికి యెంత గౌరవంవుండేది? ఆరోజుల్లో రష్యాని కూడా జనం యెంతమంచిగా అనుకునేవాళ్లు? భూతలస్వర్గమనే అనుకునే వాళ్లు. కాలం యెంతలో యెంత మారిపోయింది ? నీకు జ్ఞాపకంవుందా? మనకళ్ళముందే మృదుల అనే ఒకఅమ్మాయి జనసమూహాన్ని చీల్చు కుంటూ ముందుకువెళ్ళి తుపాకిగుండుదెబ్బతిని ప్రాణాలర్పించింది. ఆ రోజుల్లో యెటువైపు తిరిగినా "మృదుల!, మృదుల!" అన్నపేరే విని పించేది. యివ్వాళ ఆ అమ్మాయి యెవరికీ గుర్తులేదు. సరే, గుర్తువుంటే వుంది లేకపోతే పోయింది. ఆ అమ్మాయి పేరుసంపాదించటంకోసం ప్రాణత్యాగం చెయ్యలేదు. ఒకవేళ అలా యెవరన్నా చేస్తే, అదసలు త్యాగమేకాదు.అయినా ప్రజలకృతజ్ఞత చూడు!

మహత్వాకాంక్ష ప్రపంచంలో వున్నతికి మార్గమని అంటారు. కాని ఆలోచించిచూస్తే, అది వట్టి వెర్రితనంకాక మరేమిటి? దానివల్ల మనిషి యెన్నికష్టాలుపడవలసివస్తుంది! ప్రపంచంలో యెన్నో రకరకాల ప్రకృతులవాళ్ళు వున్నారు, యెవరికివారే గొప్పవాళ్ళమనుకుంటూ వుంటారు. కాని ఆ గొప్పతనం నేతిబీరకాయలో నెయ్యివంటిదే. అసలు సంగతి 'సేవ'. మనిషి యితరులకోసం బ్రతకటం నేర్చుకోవాలి. తన కోసమే బ్రతుకుతున్నట్లు లెక్కగాదు. ఆ బ్రతుకు యీ భూమిమీద బ్రతకటంకాదు. గాలిలో యీదటంవంటిది. అలాంటివాళ్ళముద్ర యీ ప్రపంచంమీద పడదు.

లోకకళ్యాణార్థం చేసే యీ సేవ నిజానికి యేవిధంగా జరగాలో ఆవిధంగా జరగటంలేదు. ఉచ్చవర్గానికి మధ్యవర్గానికి మధ్య వేలాడు తున్న యీ మహాసర్పం యింకా ప్రజ అనే కంటకందాకా చేరుకోలేదు. అక్కడికి చేరుకుంటేనే అది తనతోక దానిలో యిరికించి తనను పట్టి వున్న కుబుసాన్ని పూర్తిగా వదిలిపేయగలదు. ప్రయత్నిస్తే ఒకవిధమైన ఉత్సాహం నాలోకూడా కలుగుతున్నదన్నసంగతి నేను గమనిస్తూనే ఉన్నాను.

ఆలోచించగా ఆలోచించగా బొత్తిగా బీదవాళ్ళవద్దకు వెళ్ళి పని చేస్తే మంచిదనే నిశ్చయంకలిగింది నాకు. అక్కడకు వెళ్ళి, ఆ ఆడ వాళ్లతోకూడా మాట్లాడాలి. ఆధునికస్త్రీలు పైపైన ధరించిన మేలిముసు గును చించివేసి, నిరుపేదస్త్రీలను కేంద్రానికి తీసుకువెళ్ళి నిలబెడతాను. వాళ్ళనుచూడగానే శ్రీమతి తారాదేవికి చెమటలుపడతాయి. యీ నాయ కత్వం గీయకత్వం అంతా మరిచిపోతుంది. యీ పెద్దపెద్దకబుర్లన్నీ మరిచిపోతుంది. అయితే రాగిణినికూడా వెంటతీసుకుపోయేదా?

వద్దు! నే నొక్కదాన్నే వెళ్తాను. బీదవాళ్ళమాటలు అర్థంచేసు కోవటం, వాళ్ళకు మనమాట అర్థమయేలా చెప్పటం మామూలుపనికాదు. వారివిశ్వాసాన్ని పొందగలపద్ధతి రాగిణికి తెలియకపోవచ్చు. అయినా నగంప్రఖ్యాతి యెలాగూ కొట్టేస్తుంది. బీదవాళ్లు ఆలోచించలేరు. ఆ ఆడ వాళ్ళంతా నన్ను చూడగానే మనదుఃఖాలుతీర్చటానికి గొప్ప దేవతలాగా దేవదూతరూపంలో యీవిడయెవరో వచ్చిందని అనుకుంటారు. వెంటనే అంతా నావెనక నిలబడతారు, నేనుచెప్పినట్లే చేస్తారు. కష్టాల్లోవున్న వారికి యేంకావాలి? వాళ్లచైతన్యాన్ని మేల్కొల్పగలిగినవాళ్లు కావాలి. కాని అప్పుడు నాయకులందరూ కష్టాలు అనుభవించినట్లే,నేనుకూడా ఆ బీదవాళ్ళతోపాటే కష్టాలు అనుభవించటానికి సిద్ధంగావుండాలని నా కప్పు డనిపించింది. ప్రజలసుఖదుఃఖాల్లో పాలుపంచుకుని, వారితో ఐక్యం కానంతవరకు వారిని పైకి తీసుకువెళ్లగలగటం అసంభవం.

ఆ సాయంత్రం నేను కనాట్‌ప్లేస్‌లో ఒంటరిగా తిరిగాను. యింగ్లీషువాళ్ల వేషభాషల్ని అనుకరిస్తూ దుస్తులువేసుకుని తిరుగుతున్న స్త్రీ-పురుషులగుంపుల్ని చూచి, వీళ్లు యే భారతదేశంలో తిరుగుతున్నారు? ఇది అసలు భారతదేశమేనా, అనిపించింది. మిగిలిన భారతదేశపురూపా నికి, రాజధానిరూపానికి యెంత తేడావుంది!

నేను తిరుగుతూ తిరుగుతూ కాఫీహౌస్‌ముందుకి చేరుకునేటప్పటికి మిస్టర్ యేడుపుముఖంతో కనుపించాడు. అతనికి కనపడకుండా యెలాగో తప్పించుకునిపోదామని చూశాను. కాని అత నెక్కడ తప్పుకుపోని స్తాడు? రాతిచప్టామీద పుస్తకాలుపరచుకుని అమ్ముతున్నవాడిదగ్గరనుంచి

వెంటనే నాదగ్గరకు వచ్చి "యేమండీ! యివ్వాళ యిలా బయలుదేరారు?" అన్నాడు.

"ఏమీలేదండి, వూరికినే" అన్నాను.

"మరి మిష్టర్ రాజ్ యెక్కడికివెళ్ళారు?"

"యెక్కడికో వెళ్ళారు."

"పదండి. కొంచెం టీ తాగుదాం"

"వద్దండీ! నేను కాఫీ తాగుతాను"

"అలాగే, పదండి! కాని మంచికాఫీ యిక్కడ దొరకదే!"

"మరెక్కడ దొరుకుతుంది ?"

"గెలార్డ్‌లో"

"అక్కడా ! అక్క డన్నీ వెలయెక్కువటగా!" అన్నాను నవ్వి.

"బలే ! మీరుకూడా బలేవారండీ! యేమంత వెల యెక్కువనీ ! పైగా సొసైటీలో ఫ్రండ్స్‌తో కలసివున్నప్పుడు యిలాంటివన్నీ లెక్క చెయ్యగూడదు" అన్నాడు డాక్టర్ నిమోలియా.

అది—లంచాలుపుచ్చుకునే డాక్టరు నిమోలియాదర్జా—యిప్పుడు చూడాలి! ఆయనకు గెలార్డ్‌తప్పితే పనికిరాదు. నేనుకూడా అక్కడకు చాలాసార్లు వెళ్ళాను. కాని యివ్వాళ యితని నిక్కుచూడాలి.

అతను న న్నక్కడికి తీసుకువెళ్ళి కూర్చోబెట్టాడు. చాలామంది వున్నారు. ఆడవాళ్లుకూడా వున్నారు. నాకంటె యెక్కువగా సింగారించు కునివున్నారు. చేతులతో కాదు, చెంచాలతో తింటున్నారు. అదికూడా యెలా తింటున్నారంటే, అది వర్ణించటం నాచేతకాదు. నేను యెన్నో సార్లు ప్రయత్నించి, ప్రయత్నించి చివరకు నావల్లకాదని వూరుకున్నాను. ఆ నాజూకుమాత్రం నాకు రాలేదు. నేను బయటగూడా యింట్లోతిన్నట్టే నిస్సంకోచంగా తింటూవుంటానని మావారంటారు.

నిమోలియా సారాయి తెప్పించాడు. నాకు మనసుకి కష్టం తోచింది. ఒక పరపురుషునిదగ్గర అందులోనూ త్రాగుతున్నవాడిదగ్గర అలా కూర్చోవాలని నాకులేదు. యింత అధునాతనత్వం నాకు నచ్చదు. వాడు సారాయి తాగుతూవుంటే నేను చూస్తూ వూరుకునే దెలా !

"నేను వెళ్తున్నాను" అన్నాను లేచి.

"యేఁయేఁ!" అని వాడు నాచెయ్యి పట్టుకున్నాడు. నిజంచెప్పు తున్నాను. నాకు చాలా కోపంవచ్చింది. నేను ఒక్కవిసురుతో నాచెయ్యి విడిపించుకున్నాను. కాని వెంటనే జనమంతా చూస్తున్నారేమోననే ఆలో చనవచ్చింది. ఏమిజరిగినా జనం చిత్రంగా చూచేది నన్నేగదా! విమో లియా వంగి నా కళ్ళల్లో కళ్లుపెట్టి మెల్లిగా అన్నాడు. "మిసెస్ రాజ్! మీరు చెయ్యివిడిపించుకునిపోతున్నారు, పోండి. కాని మీరు పరాయివాళ్లు అనేదిమాత్రం జనానికి తెలియనివ్వకండి. సొసైటీలోవుండి యీమాత్రం కల్చర్ కూడా నేర్చుకోలేదా మీరు?" నేను కోపంతో వణికిపోయాను. "సొసైటీ! కల్చర్!" నన్నడిగితే అసలు యీ రెండుశబ్దాలు వుపయో గించకుండా ఆంక్షపెట్టాలి. దొంగ, నీచుడు. వాడిబుద్ధి యెంత కుటిలమో వాడిభాషకూడా అంత కుటిలంగానూవుంది.

నేను ఒక పురాతనమైనయుక్తి వుపయోగించిచూచాను. లేని చిరు నవ్వు తెచ్చిపెట్టుకుని "నా కిప్పుడిప్పుడే జ్ఞాపకంవచ్చింది. వెంటనే ఒక చోటికి వెళ్ళాలి. యీసంగతి బొత్తిగా మరిచేపొయ్యాను" అన్నాను.

"అక్కడికిగూడా వెళ్లరుగానిలెండి. అప్పుడే తొందరేంలేదు. మీరు పదిగంటలకు యింటికివెళ్ళినా పరవాలేదు. అప్పటికి మిష్టర్ రాజ్ వస్తారో రారోకూడా! పిక్చర్ గిక్చర్ కి వెళ్లుంటారు. కంపెనీ మంచిదైతే యింకొంచెం లేటైనా కావచ్చు" అన్నాడు డాక్టరు విమోలియా.

వాడిమాటలు వింటుంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కింది. వాడు యెంత నిర్విచారంగా, నిస్సంకోచంగా మాట్లాడుతున్నాడు!

"లేదండి. నేనిప్పుడే వెళ్ళితీరాలి" అన్నాను నేను.

"వెళ్ళవలసుంటే, తప్పకుండా వెళ్ళండి. నేను వద్దంటేమాత్రం మీరు మానుతారా? మీతో పనివున్నప్పుడు, మీకు తీరికదొరికిందాక నేను కాచుక్కూచోక తప్పదుగదా?" అన్నాడు వాడు.

నేను కోపంతో పెదవికొరుక్కున్నాను. "దొంగవెధవ! నీచపు వెధవ!" యెలాగైతేనేం బయటపడ్డాను.

చెల్లీ! నేను బయటికొచ్చింతరువాత యెటూ చూడలేదు. తిన్నగా ముందుకి సాగిపొయ్యాను. వీలైనంతదూరంగా యేకాంతప్రదేశానికి వెళ్ళి కూర్చోవాలనిపించింది. నిర్జనంగావున్నవైపు అలా సాగుతూనే వెళ్ళి

పోయాను. విమోలియా నీచప్రవర్తన నామనసులో వుండివుండి కలక వేస్తున్నది. ఆ పందివెధవ నన్ను యెన్నెన్ని మాట లన్నాడు. కాని యెవరికీ తెలియకుండా. మరొకరితో చెప్పాలంటే వాడన్నమాటల్లో ఒకటిగూడా తప్పుకాదు. వీడి కెలా బుద్ధిచెప్పటం? 'ఫార్వర్డ్'గావుండటం కూడా యెంత పెద్ద మోసమైపోయింది. దీనికంతకూ మూలం యేమిటి? పశుత్వం.

ఆ చీకటిలో యేరోడ్డుపట్టి యెక్కడికొచ్చానో నాకే తెలియదు. చూస్తే అన్నీ చెట్లే—చెట్లు. అకస్మాత్తుగా నన్నొకమనిషి పట్టుకున్నాడు, నేను కేకలువేశాను. వాడు చాలా కఠినంగా నవ్వి "అరుచుకో, నీ ఇష్టం వచ్చినట్లు. యిక్కడ నిన్ను తప్పించేవాడెవ్వడూ లేడు. గెలార్డ్‌నుంచి నీవెంటబడి వచ్చాను డార్లింగ్, వాణ్ణివదిలిపెట్టి యిక్క డెవ్వడిని కలుసుకోవటానికి వచ్చావు?" అన్నాడు.

నేను వాడికి యేమీ జవాబివ్వకముందే వాడిచేతిస్పర్శ నా బుజాల మీద తగిలింది. నేను వాడితో నా శక్తికొద్దీ పోరాడసాగాను.

"నన్ను వదిలిపెట్టు కుక్కా!"

"నోరుముయ్యవే కుక్కా!"

"నీచుడా! పందీ!"

"అహహా! యింకెవ్వడున్నా డిక్కడ? యివ్వాళ వాడు రాలేదులే. ఒకవేళ వచ్చినా అప్పటికి నేను వెళ్ళిపోతాను."

"తొలగిపో నీచుడా!"

"అహహ్హా!"

యింతలో అకస్మాత్తుగా యెవరో శక్తికొద్దీ గుద్దినట్లు ధనాధన్ మని శబ్దంవచ్చింది. గద్దపంజానుంచి చిన్న పిట్ట తప్పించుకున్నట్టుగా నన్నుపట్టుకున్నవాని చేతుల్లోనుంచి నేనుకూడా తప్పించుకున్నాను. కాని ఆ విసురుకు పట్టుతప్పి క్రిందపడిపోయాను. ఒకటి, రెండు, మూడు — గుద్దుల శబ్దాలు వస్తూనేవున్నాయి.

"బాబోయ్! నన్ను రక్షించు"

"ఆహా! రక్షించాలా! యిప్పుడు రక్షించాలా! కొంచెంసేపువుండు, నువ్వేంచేస్తున్నావు?"

"నన్ను క్షమించు బాబూ! యిది నిన్నుకలుసుకోటానికి వచ్చిం దన్నసంగతి నాకు తెలియదు. వదిలిపెట్టు. నువ్వు నా సోదరునితో సమానం!"

"నోరుముయ్యి వంది!"

మళ్ళీ యేడెనిమిది గుద్దులు గుద్దినట్లుగా ధనా ధనా చప్పుడు.

"అబ్బా! అబ్బా!" తన్నులు తినేవాడు పడిపోయాడు. అతన్ని తన్నుతున్నవాడు లేచి నిల్చుని "జీవితపర్యంతం జ్ఞాపకంవుంటుంది వెధవకి. గిరగిరా గింగిరాలుతిరిగి పడిపోయాడు" అన్నాడు.

ఆ వ్యక్తి చీకటిలో నా కొక అస్పష్టమైననీడలా కన్పించాడు. నే నింకా భయంతో గడగడా వణుకుతూనేవున్నాను. ఆ దుష్టుడితో లాగులాడటంలో నా దుస్తులుకూడా అటూ ఇటూ చెదిరిపోయాయి.

"యికముందు యెన్నడూ యిలా చీకటిలో ఒంటరిగా రాకు. నీవు కోరుకున్నవాడే నీ కిక్కడ కనిపిస్తాడని యేం నమ్మకం? యెంతోమంది దుష్టులు తిరుగుతూవుంటారు. పట్టపగలు వెలుగులో తలయెత్తుకుని నిలబడగలిగినదే ప్రేమ. సంఘంలోవుండాలంటే సంఘనియమాలకి కట్టుబడి బ్రతకవలసివుంటుంది. యింకెన్నడూ యిలాచెయ్యకు, వెళ్లు" అన్నాడు నన్ను రక్షించినవ్యక్తి. అతనిమాటలు విని నేను, వెక్కివెక్కి ఏడ్వసాగాను. అతను వులిక్కిపడ్డాడు. "యెందుకు యేడుస్తున్నావు?"

"నే నిక్కడ యెవర్నీ కలుసుకోటానికి రాలేదు, నిజం"

"సరే, దాంతో నాకేం సంబంధంలేదు. ప్రస్తుతం ఆ రౌడీ స్పృహ లేకుండా పడివున్నాడు. నువ్వు నిరాటంకంగా వెళ్ళిపోవచ్చు. చదువుకుంటున్నావా?"

"లేదు, నేను, నేను —"

"యెందుకులే వూరుకో, యివన్నీ తెలుసుకునిమాత్రం నేను చేసేదేముంది? యిక నువ్వు వెళ్ళిపోవచ్చు"

"కాని నేను వెళ్ళలేను"

"యేం! యింకా యెవరన్నా వచ్చేవాళ్లున్నారా! అయితే నే వెళ్ళేదా?"

నేను భయంతో అతన్నిపట్టుకుని యేడుస్తూ "వద్దు వద్దు! యీ చీకట్లో నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళవద్దు. నే నెక్కడవున్నానో నాకే తెలియదు. యిక్కడనుంచి యెలా వెళ్లటం?" అన్నాను.

"యిది నే నెలానమ్మేది? మ వ్వస లిక్కడికి యెలావచ్చావు?"

"త్రోవతప్పి యిలా వచ్చాను."

"యెక్కడికి వెళ్తున్నావు? పద, ని న్నక్కడికి చేర్చుతాను."

"నే నింటికి వెళ్తాను."

"పద, యిటునుంచి పోదాం. నేను నిన్ను ముందువున్న బస్సు స్టాప్‌దాకా పంపించి పోతాను."

నే నాతడివెనకాల బయలుదేరాను.

"యెందుకు యేడుస్తున్నావు?"

"నా దురదృష్టాన్నిగురించి యేడుస్తున్నాను."

"ఏం?"

"నామీద యివ్వాళ లేనిపోని కళంకం వచ్చిపడింది"

"ఎవరన్నారు?"

"మీరు?"

"నాగురించి నీకేం భయంలేదు, నేను నిన్నేమీ బాధపెట్టలేదే !"

"కాని, నేను పాపాత్మురాలినని అనుకుంటున్నారుగదా!"

అత డేమీ జవాబివ్వలేదు. "ఏం. మాట్లాడరేం!" అన్నాను.

అతను నవ్వి "మరేమీలేదు. నేను కొంచెం జాగ్రత్తగా దిక్కులు చూస్తూ నడుస్తున్నాను. ఆ మలుపుదాకా వెళ్తే చాలు, అక్కడకూడా నిర్జీవంగానేవుంటుంది. కాని, యెలక్ట్రిక్ లైట్లు వున్నై. ఆ రౌడీ చీకటిలో నామీద కొచ్చిపడి దొంగదెబ్బతీయటం నాకిష్టంలేదు" అన్నాడు.

వెల్తురున్నచోటికి వచ్చేశాం. అత నదేవిధంగా గంభీరంగా ముందు వెళ్తున్నాడు. నేను వెనక నడుస్తున్నాను.

"యిక్కడనుంచి రెండుమూడు మలుపులుతిరిగితే బస్తీలో కెళ్ళి పోతారు, కాని అటువస్తే నాకు చాలా చుట్టుఅవుతుంది.

నే నెంతో జాలిగొలిపే కంఠంతో "నన్ను వదిలి వెళ్లకండి"

అన్నాను. అతను వెనక్కితిరిగి చూచాడు. యెలక్ట్రిక్‌స్తంభం మధ్యలో వుంది. యిటువైపు నేను, అటువైపు అతను.

"అరె!"

"మీరా!"

నేను ఆవేశంతో అతనిరొమ్ముమీద తలవుంచి వెక్కివెక్కి ఎలా యేడవసాగానో నాకే తెలియదు.

"యిదిగిదిగో కొంచెం వినండి"

అతనెవరో తెలుసునా? మేము పాతఢిల్లీలో గొందిలో ఒక ఆవి డింటికి వెళ్ళామని చెప్పానే. ఆమె అన్నే యీ యువకుడు. విధివశాత్తు యెవరెక్కడ కలుస్తారో చూడు.

"మీరు ఇక్కడా!" అన్నా డతడు.

"నా కివ్వాళ పిచ్చెత్తిపోయిందిలెండి!" అని జరిగినదంతా అత నికి చెప్పాను. అంతా విని అత నన్నాడు. "యిదంతా నిజమైతే, మీ రివాళ ఎంత చిక్కులో చిక్కుకున్నారు! ఈ నాగరకత, ఈ సంస్కృతి నేను దీనిని యేమనేది? ఇదే పశుత్వం.....ఇంతకన్నా పశుత్వం యేం వుంటుంది? పదండి పదండి. పాపం! మీ తప్పేముందిలెండి. అసలు సంగతేమిటంటే, యీనాటి పురుషుడు నవనాగరికస్త్రీలను తనమనస్సులో విషయవాంఛలకు వుపకరించే రంగురంగుల బొమ్మలనిమాత్రమే అను కొంటాడు. ఈ మెరుగులపూతలన్నీ పైపైన ఉన్నవే. లోపల అంతః కరణంలో చెప్పుకోదగ్గ మార్పేమీ రాలేదు. ఈనాటికీకూడా ఈ మగవాళ్ల లోలోపల స్త్రీలను భోగవస్తువులుగామాత్రమే పరిగణిస్తారు. నవనాగరిక స్త్రీలకు, పాతకాలపు ఆడవాళ్లకు ఉన్న తేడా ఏమిటంటే, పాతభావాల ఆడది తనను భోగవస్తువుగా స్వీకరించినా, తనకు పురుషునితోబాటు సమానాధికారాలు కావాలని కోరదు. కాని నవనాగరికస్త్రీ పురుషునికూడా తనతో సమానంగానే భోగవస్తువుగా పరిగణిస్తుంది. ఎందువల్లనంటే, నాగరికస్త్రీ యూరపుని గ్రుడ్డిగా అనుకరిస్తుందేగాని, అక్కడ పాతివ్ర త్యానికి ప్రాబల్యంవున్న రోజులు పోయి అప్పటినుంచి నేటివరకు లెక్క లేనన్ని నైతికప్రమాణాలు మారిపొయ్యాయని గ్రహించదు. కాని భారత

దేశంలో నేడుకూడా దీని కెక్కువ గౌరవం ఇవ్వబడుతుంది. పదండి పోదాం!"

"మరి ఈసమస్యకు సమాధానం యేమిటి?"

"సమాధానమా! ఏమున్నది, ఏమీలేదు."

"మరి సమస్యఅన్నతరువాత దాని కేదో సమాధానముండాలిగా?"

"లేకేమి! మీరు యింకెన్నడూ ఒంటరిగా యీవైపుకి రాకండి. అదే సమాధానం."

నేను కొంచెంసేపు అలాగే నడుస్తున్నాను, "మీరు మీ చెల్లెలికి యిదంతా చెప్పుతారుగదూ!" అన్నాను మళ్ళీ.

"నే నెందుకు చెప్పుతాను? నా గొప్పతనం నేనే చెప్పుకుంటే, ఏమంత బాగుటుంది? అంతేగాదు; నేను మీమాటలు నమ్మినంత తేలిగ్గా అదికూడా నమ్ముతుందని నమ్మకమేమిటి?

"మీరే పాతకాలపు ఆడవాళ్లనుకోండి. మీవద్ద కెవరన్నా వచ్చి, మంచికుటుంబానికిచెందిన ఒకస్త్రీ ఒకరోజుసాయంత్రం తిరుగుతూ తిరుగుతూ తనభర్తస్నేహితుణ్ణి కలుసుకుందనీ, అతనిమాట తీసివెయ్యలేక కాఫీత్రాగటానికి గెలార్డ్ కి వెళ్ళితే, అక్కడ ఆ స్నేహితుడు త్రాగటానికి సారాయి తెప్పించాడని, సొసైటీలో నాగరకధర్మానికి వ్యతిరేకమైనప్పటికి ఆవిడ వెళ్ళిపోయిందనీ, ఆ వెళ్ళిపోవటం వెళ్ళిపోవటం మనస్సుకి చాలా బాధకలిగి సంఘంఅంటే అసహ్యించుకుని ఆలోచిస్తూ ఆలోచిస్తూ ఎక్కడికివెళ్లుతున్నదీ తెలియక,ఎవరూలేనివిర్జనప్రదేశానికి చేరుకున్నదనీ, ఆవిడ వెళ్లటం చూసి, ఒక మోడరన్‌రౌడీ గెలార్డ్‌నుంచే ఆవిడవెంట బడ్డాడనీ. ఆవిడ చాలా ధైర్యంగా వాణ్ణి ఎదుర్కొన్నారనీ మీతో చెప్పితే. మీరుమాత్రం నమ్ముతారా? అసలు పాతభావాలున్న ఆడవాళ్ళవరైనా నమ్ముతారా? విర్జనమైనప్రదేశానికి ఒంటరిగా వెళ్ళే ఆడదాన్ని తిరుగుబోతు అనే అనుకుంటారు వాళ్లు.

తిరుగుబోతు! ఆ శబ్దం నాకు చెంపదెబ్బతగిలినట్లు తగిలింది. నాగరకత, సంస్కృతి, సంఘం, అధునాతనత్వం, నీతి, తిరుగుబోతు, ఏమి టివి? ఈ గొలుసులో చిట్టచివరిలంకె ఎలాంటిది? ఒక్కదెబ్బతో అటో ఇటో!

యీ స్త్రీజీవితం ఎంత విచిత్రమైనది. ఇదొక విషమ హాహాకారం. మహాత్ములయుగంలో స్త్రీ మాయావ్యాఘ్రాగ్రహం వంటిది. మధ్య యుగపు రాజసభల్లో విలాసపు ఆటబొమ్మ. ధర్మంలో మాత! ఈ ఆధునికయుగంలో ఒకవంక చూస్తే వేశ్య, రెండోవవంక చూస్తే ఘోషాలో మురిగి చచ్చిపోయే నీడ. రెండువైపులనుంచీ కాలుతున్నది- జీవితపు మైనపువత్తి మెల్లి మెల్లిగా కాలుతున్నది, కరుగుతున్నది, నాశనమైపోతున్నది.

నేను గద్గదకంఠంతో "మీరుకూడా నన్ను తిరుగుబోతనే అనుకుంటున్నారా?" అని అడిగాను.

అతను చాలా సహజంగా "లేదు," అని జవాబిచ్చాడు. నేను వంగి అతనికాళ్లు ముట్టుకున్నాను.

"అరెరె! యిదేమిటి? మీ రేంచేస్తున్నారు?"

నేను నిలబడి "మీరు యెవరిని పెళ్ళిచేసుకుంటారోగాని, నిజంగా ఆ పిల్ల చాలా అదృష్టవంతురాలు" అన్నాను.

యింతలో నేము రోడ్డుమీద టాక్సీలు నిలబడివున్నచోటుకి వచ్చాము.

"యిక మీరు ఒక్కళ్లూ వెళ్ళిపోగలరుగదా!" అన్నా డతను.

"ఉహుం! నాకు వంటరిగావెళ్లటానికి భయమేస్తున్నది, మాయింటిదాకా వచ్చి నన్ను దిగబెట్టి వెళ్లండి" అన్నాను.

"మీ భర్తగారు నన్నుచూస్తే యేమీ సందేహపడరా?"

"నా కలాంటి భయమేమీలేదు"

"నా జేబులో టాక్సీకివ్వటానికి డబ్బుకూడా లేదే! "

"అయితే మీ రిక్కణ్ణుంచి మీయింటిదాకా కాలినడకనే వెళతారా! నాలుగుమైళ్లకిపైనే వుంటుందే?"

"బస్సెక్కి వెళ్తాను"

"నావెంట రండి, పోదాం" అని నే నతని చెయ్యిపట్టుకున్నాను. యింతలో ఒకకారు హెడ్‌లైట్లవెల్తురు మామీద పడింది. నేను చెయ్యి వదిలిపెట్టాను. కారు మాదగ్గరకువచ్చి ఆగింది. లోపల లైటు వెలిగింది. డాక్టరు నిమోలియా, నా భర్త, మిష్టర్ కటూరా వున్నారు.

"సుశీ !" అని పిల్చారు మావారు.

నేను నావెంటనున్న యువకునితో "రండి ! మావారిని పరిచయం చేస్తాను మీకు" అన్నాను. అతను ముందుకు వచ్చాడు. "కొంచెం యిలా రండి ! అన్నాను. మావారు విసుక్కుంటూ కారుదిగి నాదగ్గరకు వచ్చి మెల్లిగా "వీడెవడు?" అన్నారు. యెంత వ్యంగ్యం వుంది ఆ కంఠంలో.

"వీరు నన్ను రక్షించారు" అని జరిగినకథంతా చెప్పాను. నా భర్త చాలా సంతోషంగా అతనితో చెయ్యికలిపి మళ్ళీ అతన్ని ప్రేమతో కౌగలించుకున్నారు. నేను చాలా సంతోషించాను.

"ఆ రౌడీ యెవడో?" అని అడిగారు మావారు.

"తెలియదు. కాని వాడిపళ్ళు విరిగిపోయివుండాలి. యెందువల్ల నంటే, యిటు చూడండి, నా చేతులకు కసకస తగిలాయి." అన్నా డా యువకుడు. చూస్తే అతనిచేతులమీద నెత్తురున్నది.

యీ నిమోలియా—వీడి కింత ధైర్యమా! చూస్తాను వీడిసంగతి కూడా! యీ వెధవని జైలుకి పంపించకపోతే చూడు. అస లెందుకు, యీ కటారా వున్నాడే, యితని స్నేహితుడొకడు యింటెలిజెన్స్‌లో వున్నాడు. అతనికి యితనిచేత చెప్పిస్తాను. "ఆ ! నాకు యిప్పుడు పనివున్నది. నీవు వీరిని తీసుకుని టాక్సీచేసుకుని యింటికి వెళ్లు. వీరి చేతులకు కట్టుకట్టి, టాక్సీవాడికి పేజేసి వీరి నింటికి పంపించు" అన్నా రాయన.

నేను కృతజ్ఞతతో తలమునకలైపోయాను. యెంత గొప్పవాడు నా భర్త! కారు వెళ్ళిపోయింది. నే నా యువకునితో "పదండి" అన్నాను.

యింటికి చేరుకున్నతరువాత నే నతనిచేతులకు కట్టుకట్టాను. అతనికి స్వయంగా టీ తయారుచేసి యిచ్చాను. టీ తాగినతర్వాత వెళ్ళటానికి లేచి నుంచున్నాడు.

"మళ్ళీ వస్తారుకదూ?" అని అడిగాను.

"యింకా యెందుకు?"

చాలా విచిత్రమైనప్రశ్న. నేను దానికి సరిగ్గా జవాబివ్వలేక పోయాను.

"ఏమీలేదు, పూరికినే! మీరు నన్ను రక్షించారుగదూ! నన్ను కాపాడారుగదూ! నన్ను అపదనుంచి తప్పించారుగదూ!"

అతను నవ్వి "యీ మూడువాక్యాలకు అర్ధం ఒకటే! కావాలంటే దీన్నే మీరు మరొకసారి యింగ్లీషులోకూడా చెప్పొచ్చు" అన్నాడు. నేను కూడా నవ్వాను. మా యిద్దరిమధ్య వాతావరణం కొంచెం తేలికైంది.

"వస్తారుగదూ!" అని అడిగాను. "యెంతో అదృష్టముంటేగాని మంచివాళ్ళని కలుసుకోవటం అనేది జరగదు. మీ చెల్లెల్నిగూడా తీసుకునిరాగూడదూ? నేను మీయింటికికూడా వచ్చానుగదా!" అన్నాను.

"అది రాదులెండి. మగవారికైతే కోటూ, పంట్లాం వుంటే చాలు. సొసైటీలో జరిగిపోతుంది. కాని ఆడదానివేషం చీరఖరీదు, ఆ చీరనుకట్టుకునేపద్ధతి వీటివల్ల సంఘంలో ఆవిడఅంతస్తు. హోదా నిర్ణయించబడుతుంది. నా చెల్లెలు బహుశా రాదు. సంకోచిస్తుంది. వచ్చినా మీ సొసైటీలో చెల్లదుకూడాను. దానికి యింగ్లీషుకూడా రాదే! మీ సంఘంలో యింగ్లీషురానివాళ్ళను చదువుకున్నవాళ్ళకింద మర్యాదవున్న వాళ్ళకింద లెక్కగట్టరే!"

నే నతను చెప్పిందాన్ని కాదనలేకపోయాను. అతని చెల్లెలు "అక్కయ్యగారూ! చెల్లాయిగారూ," అనే సంస్కృతిలో పెరిగిన స్త్రీ. మేమో! "హల్లో! ఓకే" సంస్కృతిలో పెరిగిన వాళ్ళం. నిజంగా యీ యింగ్లీషుమూలంగా ఒకే మధ్యవర్గంలో యెన్నిరకాల తరగతు లేర్పడ్డాయి.

అతను వెళ్ళిపోయింతర్వాత నేను చాలాసేపటిదాకా ఆలోచిస్తూ కూర్చున్నాను.

రెండోరోజు మధ్యాహ్నంవేళ రాగిణి మా యింటికి వచ్చి "యేం అక్కయ్యా! రాత్రి నీమీ దేదో గొప్ప అపదవచ్చిపడిందటనే!" అన్నది.

"యేంచెప్పేది, నిజమే"

"యేం జరిగిందేమిటి?" చాలా వుబలాటంగా అడిగింది రాగిణి.

"జరగటానికేంవుంది. చచ్చేటట్టు తన్నులుతిని వెళ్ళాడు వెధవ"

"అస లదిగాదు. యేంజరిగింది, సరిగా చెప్పు."

నేను చూచేటప్పటికి రాగిణికళ్ళల్లో అతృప్తమైన విషయవాంఛ జాజ్వల్యమానంగా మండిపోతున్నది. యిదే ఆవిషయవాంఛ హిస్టీరి యాకు కారణమైన అసంతృప్తి. యిప్పు డీ మాటలతోనే తృప్తిపొందా లని తొంగిచూస్తున్నట్లుగావుంది.

రాగిణి దూరంగా యెక్కడో ఆలోచిస్తున్నట్టుగా అన్నది. "మగ వాడు మహా పశువనుకో!" యిది చెప్పతూవుండగా ఆవిడకళ్ళల్లో యేదో మంటలామండింది. "ఆ పశువు నాగరికతఅనే" ముసుగులో దాక్కొని వుంటాడు. మగవాడు మహాత్ములుపదేశాలన్నీ నిజంగా పాలించటం మొదలుపెడితే యీ ప్రపంచమే మారిపోతుందనుకో" అని మళ్ళీ తనకు నమ్మకంకుదరనట్టుగా అడిగింది. "ఏం అక్కయ్యా! భార్యాభర్తలు విషయవాంఛాపూరితమైన జీవితం గడపగూడదని, కేవలం సంతానం కోసమే పరస్పరసంబంధంపెట్టుకోవాలని మహాత్ములన్నారుగదా. అయితే మానవుడు కేవలం యంత్రంలాగా హృదయంలేనివాడు అయిపోగలడా! మనిషిమనసులోనించి ప్రేమఅనేఆకర్షణ పూర్తిగా తొలగిపోగలదా ? నిజంగా మానవుడు అంత పెద్ద జ్ఞానిఅయిపోతే పుట్టినందుకు పండగ యెందుకుచేసుకోవాలి? చచ్చినప్పుడు యెందుకు యేడ్వాలి, మొత్తుకోవాలి? మానవుడు యెప్పటికైనా యిలా యంత్రంలా తయారుకాగలడా ?" అంటూ రాగిణి నా బుజాలు పట్టుకున్నది. తీవ్రమైన ఆవేశంతో వణకి పోసాగింది. "మగవాడు పశువు. వాడు పశువుగానే వుంటాడు. పశువు కానివా డసలు మగవాడుకాడు. వాడు పశువుగనకే తనభార్యను కాపాడు కోగలుగుతున్నాడు" అన్నది రాగిణి. యింతలో ఆవిడకళ్ళు బైటకువెళ్ళు కొచ్చినట్టు వచ్చాయి. కనుపాపలు, చుట్టూవున్న తెలుపునిచూచి నిజంగా నా కెంతో భయంవేసింది. నేను చూస్తూచూస్తూవుండగానే ఆవిడ నీలుక్కు పోయి కిందకు వరిగిపోయింది, మూర్ఛవచ్చేసినట్లుంది. ఆవిడమన స్సులో ఆసమయంలో యేమున్నదో నేను తెలుసుకోలేదు. నాకు గాబరా పుట్టుకొచ్చింది. అదృష్టవశాత్తు ఆసమయానికి సరిగ్గా మావారు వచ్చారు. మిష్టర్ కటారాకూడా వెంటవున్నారు. తనభార్య యీ స్థితిలోవుండటం చూసికూడా ఆయ నేమాత్రం చలించలేదు.

"మీ రేం భయపడకండి. అలా వదిలేయండి. ఒక్కగంటఅయ్యే టప్పటికి దానంతటదే తిరిగి వచ్చేస్తుంది స్పృహ" అన్నారు నాతో. తరువాత తీరిగ్గా ఒక సిగరెట్ వెలిగించి పొగవదులుతూ అన్నారు—"డాక్టర్లు ఏం చెబుతున్నారంటే—యాజ్ సూన్ యాజ్ షి బికమ్స్ యే మదర్, షి విల్ బి అల్ రైట్"

కొన్నిమాటలు హిందీలో చెబితే మోటుగా భావించబడతాయి. వాటినే ఈనాటిసంఘంలో ఇంగ్లీషులో చెప్పి పవిజరుపుకుపోతారు. ఉదాహరణకు, ఒకటికి ఎక్కడికెళ్ళాలని ఎవరూ అడగరు. యూరినల్ ఎక్కడ అంటారు.

మిష్టర్ కటారా చెప్పింది వింటే, రాగిణి ఒక పాశవిక స్త్రీ అనిపించింది నాకు. పిల్లల్ని కనకపోతే ఈ మూర్ఛలు ఇలాగే వస్తుంటాయట. విషయవాంఛలేని తీవ్రతను పాశవికత అనకపోతే మరేమనాలి?

చాలాసేపటికి రాగిణికి స్పృహవచ్చింది.

అర్ధరాత్రిఅయిపోయినతరువాత అప్పుడు పడుకోగలిగాం మేము. అప్పటికీ నేను ఆలోచిస్తూనేఉన్నాను. పురుషుడు అడవిజంతువైతే స్త్రీలోమాత్రం పాశవికత లేదా? మూలతః విషయవాంఛ ఎక్కడికి పోతుంది? సంస్కారం, సంఘం, నీతి, మర్యాద, సిగ్గు—ఇన్ని ఉన్నప్పటికీ మన మింకా అడవిజంతువుల్లాఉన్నామంటే, బహుశా దీనికి ఒకటే కారణమైఉండవచ్చు. మనలోని ప్రాకృతికావసరం నేటివరకూ తన మూలరూపంలో పశుతుల్యమవ్వటమే ఆ కారణమైఉండాలి. దానినే మనం మతం, దర్శనం అనే వివిధరూపాలతో ఉదాత్తంచేసుకొంటూ వస్తున్నాం. అయితే-ఫ్రాయిడ్ చెప్పిందే నిజమా? మరి ఫ్రాయిడ్ తలమీద మార్క్స్‌ను తీసుకొచ్చి కూర్చోబెట్టే ఈ ఆకలో? మన పరస్పరసంబంధాలన్నీ పొట్టకూటిమీద కదా ఆధారపడిఉన్నాయి. నే నిలా ఆలోచిస్తూ ఉండగానే వారు పిలిచారు "సుశీ" అని.

నేను వారివైపు చూశాను. వారు తన గొంగడిముసుగులోంచి తొంగిచూచి—"నే నొకసంగతి చెప్పటమే మరచిపోయాను" అన్నారు.

"ఇప్పుడు చెప్పరాదూ?"

"సండేనాడు మనను టీకి పిలిచింది మిసెస్ రైనా. మిష్టర్ రైనా ఉండరు. ఆయన ఇవాళే బొంబాయి వెళ్ళారు. వారంరోజులతరవాత వస్తారు. బేబీనికూడా తీసుకువెళ్ళారు. మిసెస్ రైనా విన్నుకూడా తప్పక తీసుకురమ్మని చెప్పింది. అక్కడ ఆవిడ ఒకకుటుంబంవంటి యెట్మాస్ఫియర్ క్రియేట్‌చెయ్యాలని చూస్తున్నదట. సెక్రటరీని—అంటే శివపురీని కూడా రమ్మని పిలిచింది అక్కడికే. ఆవిడగారు నన్నుకూడా ఏదో కొంత పైకినెట్టందే ఊరుకోనట్టు కనుపించడంలేదు నాకు చూస్తే. వస్తావు గదూ ?"

"మీరు పైకివెళ్ళటం నాకుమాత్రం ఇష్టంలేదంటారా? మీరు శివపురీగారితో ఇచ్చకాలు మాట్లాడండి. నేను మిసెస్ రైనాను పొగుడుతాను"

ఆ యనకు కోపంవచ్చింది—"మళ్ళీ అవే వంకరమాటలు. ఇదేం ఎగతాళి అనుకొన్నావా? మన బ్రతుకుదెరువుసమస్య ఇది. ఇలా నీలుక్కానికూర్చుంటే, ఈరోజుల్లో మన నెవరూ అడగరు. ఇప్పటికైనా తెలుసుకో" అన్నారు.

"ఎందుకు అనవసరంగా కోప్పడతారు. నేను ఊరికే మిమ్మల్ని రెచ్చగొట్టటానికి అన్నాను" అని వారిని శాంతపరచాను.

"ఓహో, అయితే సరేలే!" అని వారు మళ్ళీ కంబళి కప్పుకని హాయిగా నిద్రపోయారు.

చెల్లీ!ఇవాళ నేను ఒంటరిగా కూర్చుని ఆలోచించి ఆలోచించి, విసుగుపుడితే నీకు ఈ ఉత్తరం రాశాను. నా భర్తకు నామీద ఉత్తుత్తి అనుమానాలేమీ కలుగలేదు. నిజంగా వారికి నామీద నమ్మకంలేకుండా పోయివున్నట్లయితే ఏంజరిగేదో?

ఆ యువకుణ్ణి మళ్ళీ కలుసుకోవాలనీ, ఒకసారి మనఃపూర్వకంగా కృతజ్ఞత తెలపాలనీ ఉంది నాకు. వీలైతే వాళ్ళఇంటికైనా వెళ్ళివద్దామని ఉంది. కాని ఇప్పుడు ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళటానికి గుండెధైర్యం చాలటంలేదు.

నేను ఇదంతా రాసి నా మనస్సును కొంత తేలికపరచుకొన్నాను. కాని నిజంచెప్పాలంటే, నా మనస్సు ఇంకా కుదటపడలేదు. ఎలా పడు

తుంది? అసలు రాగిణి ఇంటిదగ్గర ఒంటరితనం భరించలేకపోయిన ట్టుంది, ఇటే వస్తున్నది. ఇక నేను రాయటం ఆపేస్తున్నాను.

త్వరగా జవాబివ్వు.

ఇట్లు

నీ సుశీల.

పి. యస్. ఇవాళ ఈ ఉత్తరం పోస్టుచెయ్యలేకపోయాను. రేపు చేస్తాను. ఏంచేసేది? నే నీ ఉత్తరం రాస్తున్నప్పుడే రాగిణి వచ్చింది. ఇప్పటిదాకా ఏవో కబుర్లుచెప్పి ఇప్పుడే వెళ్ళింది. తనకు తనభర్తమీద కోపంవస్తోందని చెప్పింది రాగిణి. అతనిపట్ల ప్రేమతో ప్రవర్తించ టానికి ఎంతో ప్రయత్నంచేస్తోందట. అతను అలసిసొలసి ఆఫీసునుంచి వచ్చినతరువాత పలుకరించి పరిచర్యచెయ్యాలని ఉంటుందట. కాని అందులోఉన్నరహస్యమేమిటో తెలియదుగాని, అతడు ఎదురుపడగానే వెంటనే యుద్ధం ప్రారంభమైపోతుందట. దీనికి కారణం ఏమిటో ఆవి డకే అర్థంకాదట. ఎంత ఆలోచించినా తోచదట. ఒక రోజున ఆవిడ భర్తకు కోపంవచ్చి లాగి చెంపకాయ కొట్టాడట. ఆ రోజునమాత్రం తనకు కోపమే రాలేదని చెప్పింది. ఆ రోజుల్లో తను ఎంతో గౌరవంగా ఆయనచెప్పిన ప్రతిమాటను శిరసావహిస్తూ పనిచేసిందట. తనభర్త చాలా గౌరవనీయుడని తోచిందట తనకు. ఆరోజుల్లో రాగిణిమనస్సుగూడా చాలా సంతోషంగాఉన్నదట. కాని ఆతరువాత వాళ్ళఆయన ఆవిణ్ణి ఎన్నడూ కొట్టలేదు. ఆరోజుకూడా అలా చెయ్యిచేసుకొన్నందుకు తనకు చాలా మనస్తాపంకలిగిందనీ, ఆడదాన్ని ఎప్పుడూ చెయ్యిచేసుకోగూడ దనీ ఆయన తరువాత అన్నాడట. చెల్లీ:మనిషికీ మనిషికీ నిజంగా ఎంత తేడా ఉంటుంది? మాఆయన నామీద చెయ్యిచేసుకోవచ్చుననే విషయాన్ని నే నసలు ఊహించనుకూడా ఊహించలేను—సరే ఈ ఉత్తరం ఇక రేపు పోస్టుచేస్తాను నీకు. నువ్వు తప్పకుండా జవాబురాయాలి. నువ్వు మరీ ఇంత పట్టీపట్టనట్టు ఊరుకోవడం నాకేమీ బాగాలేదు. నీ ఉత్తరం కోసం నే నిక్కడ ఎంతగా ఎదురుచూస్తూఉంటానో నీకు తెలియదు.

ఎందువల్లోగాని నీవు ఒక్కదానివే ఇంతదూరాన ఉన్నప్పటికీ నా కెంతో దగ్గరదానిలాతోస్తావు. నీవట్ల నేనుచూపుతున్న ప్రేమకు నా కేమీ బదులు ఇవ్వలేవా? పెళ్ళిఅయిందికాబట్టి ఇక నీసర్వస్వమూ భర్తేనా? నేను నీ కేమీ కానా?

# 9

ప్రియమైన సోదరీ,

నీకు ఏమిరాయడం, ఏమి రాయకపోవడం!—ఏమీ తోచడంలేదు. నేను చాలా సుఖంగాఉన్నాననీ, నీ కంతా కష్టమేకష్టమనీ నువ్వు రాశావు. నువ్వలా అనుకోవద్దు. నా కెంత కష్టంగాఉందో నీ కేమితెలుసు? నీవు జీవితసంగ్రామంలో కాకలుతీరి ఆరితేరిన వీరురాలివి. నేనో, ఒక సీతా కోకచిలుకనని అందరి అభిప్రాయం, భౌతికజీవితానికి సంబంధించిన ఏ సుఖాలు తీరికలేకపోవటంవల్లా, పనిలో నిమగ్నురాలివై వుండటంవల్లా నీకు దుర్లభమయ్యాయో, అందరాని ద్రానిపండ్లయ్యాయో, ఆ సుఖాలు ఆ అవకాశాలూ నాకున్నాయి నిజమే,కాని వాటికోసం నేను ఏమి త్యాగం చేయవలసివస్తున్నదో నీకు తెలుసా? ఇది ఎంత అవమానకరమైన గాథ! నీ సుశీల ఇప్పుడు పూర్వపు సుశీలగాదు. నా ఉత్తరం చదివి బహుశా నీకు చాలా ఆశ్చర్యంకలగవచ్చు. అయినా నీవద్ద నే నేమీ దాచను. విను.

నేను బయట తిరగటానికి వెళ్ళటం మానేశాను. ఆఫీసులో కూర్చుని పనిచెయ్యాలని నిశ్చయించుకున్నాను. పగలు ఒకటి,రెండు చోట్లకు వెళ్ళానుకాని, ప్రొద్దుక్రుంకకముందే తిరిగివచ్చేశాను. కేంద్రానికి రకరకాల ఆడవాళ్లు వస్తారు. వాళ్ళలో ఉచ్ఛ మధ్యవర్గపుస్త్రీలను చూస్తే నాకు చాలా దిగజారిఉన్నట్లు కనుపించారు. కాని నిమ్న మధ్యవర్గానికి చెందిన స్త్రీలు మరీ ఇబ్బందుల్లో ఉన్నారు.

"ఇది సంక్షేమకేంద్రంకాదు."

అన్నది లేడీదాస్ నాతో. నే నావిడ కేమీ జవాబివ్వలేకపో యాను. ఇది ఈవిడ సేవాభావం. పనిచేయటమంటే ఎంత భయం.

తారాదేవి ఇటువంటిది కాదు. ఆవిడ ఎంతపనైనా నవ్వుతూ చేస్తుంది. లేడీ దాస్ విషయం తారాదేవికి చెబితే, ఆవిడ నవ్వి, "ఈ ముసలిది మూర్ఖురాలు. మనం ఇలా జనంలో చొచ్చుకుని పనిచేయందే కేంద్రంపేరు ఎన్నటికీ బయటబడదు. అసలు కేంద్రమే వృద్ధిలోకిరాక పోతే మనమంతా ఎక్కడ ఉంటాం?" అన్నది. ఆవిడమాటలు విని నా కొకవిధమైన అసహ్యంకలిగింది. అయితే, ఈవిడకుకూడా చిత్తశుద్ధి లేదన్నమాట. రాగిణి వస్తే ఆవిడతో అన్నాను—"చూశావా! ఇదీ వీళ్ళ సేవాభావం!"

"సేవకాదు, ఇదొకరకమైన వృత్తి" అన్నది రాగిణి.

మేం ఇంటికి తిరిగివెళ్లుతుంటే రాగిణి—"ఏమక్కయ్యా! నువ్వు కూడా చాలా స్వార్థపరురాలివే" అన్నది.

"ఏం, నే నేం చేశాను?" అని అడిగాను బిత్తరపోయి.

"ఆయనగారు నిన్ను అంత పెద్ద ఆపదలోంచి రక్షించారే. నీవు కనీసం కృతజ్ఞతన్నా తెలిపావా? ఒకపూట టీకి పిలిస్తే నీ సొమ్మేం పోయింది? మరీ అంత పీనాసితనమా?" అన్నది.

"పీనాసితనమా? నువ్వు చాలా ఉదారస్వభావంగలదానివి గదూ! సరే, ఇంకేం, నేను పిలుస్తాను, మీఇంట్లో టీ ఇవ్వు" అన్నాను వేళా కోళంగా.

"నువ్వు ఆపని చేయవులే!"

"ఏం?"

"అలాచేయటంవల్ల నీకు పేరురాదుగా!"

"అయితే నే నేం చేసినా పేరుకోసమే చేస్తున్నానన్నమాట, ఏం?"

"మరేమిటి లేకపోతే? నువ్వు ఇదివరకే పిలిచేదానివిగదూ?"

"అతణ్ణి?"

"సరే, ఇవాళ పిలుస్తాను, కాని అక్కడిదాకా ఎవరువెళ్తారు?"

"పద, ఇటునుంచి ఇటే వెళ్ళివద్దాం"

"చాలా చుట్టు ఔతుంది."

"అవునవును, డబ్బులు ఖర్చైపోతాయి."

మాటమాటకీ ఇలా వ్యంగ్యంగామాట్లాడటం నాకు నచ్చలేదు.

"సరే, పోదాం పద" అన్నాను. ఈమాటవినగానే రాగిణి ఏదో ఒకవిధమైన ఆవేశంతో నిండిపోయింది. కళ్ళు సంతోషంతో మెరవ సాగాయి. ఈ మార్పు చూశాను. కాని, నా కేమీ అర్థంకాలేదు.

మేం అక్కడికి వెళ్ళేటప్పటికి అతనిచెల్లెలుంది. కాని, అతను లేడు.

"మీ అన్నయ్యగారేరి?" అని రాగిణి అతనిచెల్లెల్ని అడిగింది.

"ఎక్కడికో వెళ్ళాడు."

"ఇవాళ మీరు వారిని మాయింటికి పంపించగలరా? చూడండి, ఇదీ ఎడ్రసు. మాఆయనకూడా అక్కడే ఉంటారు. ఇది కేంద్రానికి సంబంధించినపని" అని బొంకింది రాగిణి నదురూబెదురూ లేకుండా.

"తప్పకుండా పంపిస్తాను" అన్నది ఆవిడ.

బయటకు వచ్చినతర్వాత నేను కఠోరస్వరంతో నిందాపూర్వకంగా 'రాగిణీ!' అన్నాను. రాగిణి నవ్వింది.

"నీ భర్త ఇవాళసాయంత్రం ఇంటివద్ద ఉండరని నాకు తెలుసు. ఆయన ఈవిషయం నాతో నిన్నే చెప్పారు. మరి నువ్వు ఎందు కలా అబద్ధంఆడావు?"

"అక్కయ్యా! నువ్వు లోకజ్ఞానం ఎప్పుడు నేర్చుకుంటావు? నేను అలా చెప్పకపోతే ఆ పల్లెటూరుబైతు నన్నుగురించి ఏమను కొనేది?" అన్నది.

"అసలు నువ్వు మీ ఇంటిఎడ్రసు ఎందుకిచ్చావు?"

"నువ్వేగదా అన్నావు, టీ ఏర్పాట్లన్నీ నేనే చెయ్యాలని" అని అకస్మాత్తుగా కంఠంమార్చి తీక్షణస్వరంతో అన్నది. "అన లిప్పుడు ఏం మునిగిపోయిందని. నీ కెందు కింత కడుపుమంట. నువ్వుకూడా అక్కడ ఎదురుగానే కూర్చునిఉంటావుగా? నేను నీకు చెప్పకుండా అతనినేమీ లాక్కుపోనులే! అసలు నీ మనసులో ఏమనుకుంటున్నావేమిటి?"

నా మనస్సులో భరించరాని అసహ్యంవేసింది—"ఏమిటా వెధవ వాగుడు! పరాయిమగవాడిని ఇలా అబద్ధాలాడి ఇంటికి పిలుస్తారా? తప్పు గదూ!" అన్నాను.

"నువ్వు చాలా స్వార్ధపరురాలవని నాకు ముందే తెలుసు. నిమో లియా నీ కేమన్నా దగ్గరచుట్టమనా, అతన్ని వెంటబెట్టుకుని గెలార్డుకు వెళ్ళావు? " అని ఎత్తిపొడిచింది.

'రాగిణీ!' అని ఆవేశంగా అరచాను నేను.

"నడివీధిలో అలా అర్వకు. లోకు లేమనుకుంటారు?" అని రాగిణి నా వైపుతిరిగి నన్ను సవాలుచేస్తున్నట్లుగా చూచింది. నాకు చాలా కోపంవచ్చింది.

సాయంత్రం అయింది. నేను ఒంటరిగా ఇంట్లోనే కూర్చున్నాను. ఆ యువకుడురావటం నేను చూశాను. రాగిణి అతనికి వాకిలివద్దే కను పించి అక్కడనుంచే తనఇంట్లోకి తీసుకువెళ్ళినట్లుంది. నేను చూశాను చూశాను – నన్నుకూడా పిలుస్తారేమోనని చాలాసేపు నిరీక్షిం చాను. కాని నన్నెవరూ పిల్వలేదు. మసకచీకటిపడసాగింది. దీపాలుపెట్టే వేళకూడా అయింది. నే నలాగే కూర్చున్నాను. ఎందుకో నా వళ్ళంతా మండిపోసాగింది. ఈ రాగిణి కెలాగైనా మంచి పాఠం నేర్పాలి. ఎంత కులటః మరి ఆ యువకుడో, అతడుకూడా అలాంటి పతితుడేనా ? ఏం ఎందుకుకాకూడదు? పెళ్ళి-పెటాకులు కాలేదుగా! ఏమో! అయినా ఆ యువకుడు అలాంటివాడైయుండడు. ఉహుఁ —

అంతలో నాకు కిలకిల నవ్వుతున్నశబ్దం వినిపించింది-నెమ్మదిగా మురళి మ్రోగసాగింది. దానివెంటనే గజ్జెలు మ్రోగుతున్నశబ్దంకూడా వినిపించసాగింది. ఇక నేను ఆగలేకపోయాను. లేచి చప్పుడుచేయకుండా వెళ్ళాను. పర్దావేసిఉన్నది. దీపపు వెలుతురు లేదు. తలుపు తెరచిఉన్నది. నేను నిశ్శబ్దంగా లోనికి ప్రవేశించాను. చీకటిలో క్షణమాత్రం నిలబడి పోయాను. తర్వాత మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ ఆ వెనుక నున్నగదిలోకి వెళ్ళాను. చూస్తే ఆ యువకుడు వెనుకనున్న లోగిలివద్ద మురళివాయిస్తున్నాడు. వరండాలో రాగిణి గజ్జెలుకట్టుకుని మంత్రముగ్ధు రాలిలా నృత్యంచేస్తున్నది. ఆ నృత్యం చూడటానికి ఎంత బాగున్నది! చెట్లమీద అస్తమిస్తున్న సూర్యుని ఆఖరుకిరణాలు మిలమిలమని జారి పోయి, అంధకారంలో విలీనమైపోతున్నాయి. శుక్రనక్షత్రం ఆ తిన్నగా వెనుక వైపున వజ్రంలా ధగధగా ధగధగా మెరుస్తున్నది. నలువైపులా

అలముకొనిఉన్న ప్రశాంత నైస్తబ్ధ్యంలో, మధుర మురళీస్వరాలవెను వెంట నూపురాల మంజుల సరళరవళి నిండిపోతున్నది. అంతా ఒక స్వప్నంలాగా ఉన్నది.

రాగిణి అలా చాలాసేపు నాట్యంచేస్తూనేఉన్నది. అతనలా చాలా సేపు మురళివాయిస్తూనేఉన్నాడు. మురళిమ్రోగటం ఆగిపోగానే రాగిణి నృత్యంకూడా ఆగిపోయింది. "అన్నయ్యా" అన్నది రాగిణి నెమ్మదిగా. నాలో కొంచెం కదలికకలిగింది.

కాని ఆ'అన్నయ్యా!'అనే సంబోధన వట్టిమాటమాత్రమే. ఆ తర్వాత రాగిణి కొంచెం ముందుకి జరిగి అతనికాళ్ళవద్ద కూర్చుని అన్నది. 'అన్నయ్యా కృష్ణునిమురళి ఇలాగే మ్రోగేదిగదూ! ఈ స్వరా లున్నాయే, వీటికూ్కడా పురుషులకున్నట్లే అతి కఠోరమైన హస్తా లుంటాయి కాబోలు! ఎందువల్లనంటే, ఇవి హృదయంలో చొచ్చి శరీ రంలోని ప్రత్యణువునూ, రోమాన్నీ నిర్దాక్షిణ్యంగా ఊపి, నలిపి ఉక్కిరి బిక్కిరిచేస్తున్నాయి. బహుశా గోపికలు ఈ మధురస్వరాన్ని విని, ఇలాగే సిగ్గువిడిచి వెళ్ళిపోయేవారు కాబోలు!"

"అదంతా ఒక రూపకం. అందువల్లనే వైష్ణవులు ఈ సంగీతాన్ని మిలనానికి చిహ్నంగా పరిగణించారు" అన్నాడు ఆ యువకుడు.

"ఎవరి మిలనానికి?" అని అడిగింది రాగిణి ఆప్యాయంగా ఆ యువకునిచేయి పట్టుకొని. ఒకక్షణమాత్రం ఆ యువకునిశరీరం కంపించి పోయినట్లుగా తోచింది నాకు. నే నిక ఆ దృశ్యం చూడలేకపోయాను.

"ఓహో, అయితే నువ్వుకూడా నీ కృష్ణుడితో రాసక్రీడలు జరుపు తున్నావన్నమాట!" అన్నాను. అని నవ్వాను. ఆ హాస్యంలో ఎంత వ్యంగ్యం, ఎంత అసహ్యం, ఎంత చేతకాని అసహ్యత ఉన్నది.

"మీరా!" అన్నాడు యువకుడు ఉలిక్కిపడి. "నామీద—ఈ సురే శునిమీద అపనిందమోపుతున్నారా?"

"నేనా? నేను నిన్నేమీ అనలేదే అన్నయ్యా!" అన్నాను. "అన్నయ్యా"అనే శబ్దాన్ని అచ్చంగా రాగిణి ఉచ్చరించినట్లే వ్యంగ్యంగా పలికాను. సురేశ్ నావద్దకు వచ్చాడు. కొంచెంసేపు నాకళ్ళల్లోకి చూశాడు. "అయితే నేను చాలా చెడ్డవాడినన్నమాట?" అన్నాడు.

"మిమ్మల్ని ఏమనడానికైనా నా కేమధికారం ఉంది?" అన్నాను.

"అధికారం! ఈయనమీదకూడా అధికారం కావాలా నీకు?" అన్నది రాగిణి.

నేను కోపంతో బుసకొట్టాను. "నన్ను అనవసరంగా రెచ్చ గొట్టకు మిసెస్ కటారా! నీ హిస్టీరియాస కారణమేమిటో నే నెరుగు దును. అది పోగొట్టుకోవటానికి సురేశుడే కావలసివచ్చాడా ? ఇంకా చాలామంది దొరికేవాళ్లుగా?" అన్నాను.

"నువ్వలాగే అనుకొంటావులే! ఇంకెవరెవరున్నారు ? ఒకరు డాక్టర్ నిమో...."అని రాగిణి వ్యంగ్యంగా అనబోయింది. నే నిక భరించ లేకపోయాను. లెంపకాయకొడదామని వేగంగా చెయ్యిఎత్తాను. కాని వెంటనే సురేశుడు నా చెయ్యిపట్టుకున్నాడు. నువ్వుకూడా అదే అను కొంటున్నావా?" అన్నాను నేను. ఎందుకో తెలియదుగాని, నాకు ఏడుపు వచ్చేసింది.

"ఇదీ ఒకందుకు మంచిదే సుశీలా! నీవు ఇంత నీచురాలివని నేను కలలోకూడా అనుకోలేదు. అయినా నీలాంటి ఆడది ఎంతకైనా తగును!" అన్నది రాగిణి అసహ్యంగా. అని నాతో పోట్లాడటానికి ముందుకు రా బోయింది. కాని సురేశ్ అడ్డువచ్చి అన్నాడు—"నే నిక్కడికి ఎందు కొచ్చాననలు? ఇదంతా ఏమిటి? నే నసలు అలాంటిమాటలేమీ మాట్లాడ లేదే! పైగా మీరిద్దరూ పెళ్ళిఅయినవాళ్లుకూడాను. ఎవరన్నా వింటే ఏమనుకుంటారు?" అతని నోటినుంచి అకస్మాత్తుగా నవ్వుతున్నట్లు ధ్వనించసాగింది. నేను ఉలిక్కిపడ్డాను. "చూడండి, ఇది మీ ఇల్లుకాదు. అదీ మీ ఇల్లు. వెళ్ళిపొండి" అన్నాడు అతడు.

నేను అవమానంతో తలవంచుకొని తిరిగివచ్చేశాను. నావెనకే అతనుకూడా ఆ ఇంట్లోనుంచి బయటకు వచ్చేశాడు. ఇంతలో దభీమని ఎవరో క్రిందపడిపోయినట్లు శబ్దమయ్యింది. నేను వెనక్కుతిరిగి చూశాను "రాగిణికి మూర్ఛవచ్చినట్టుంది" అన్నాను.

కాని సురేశ్ ఆగలేదు. గత్యంతరంలేక నేనే తిరిగి వెళ్ళాను. లైటు వెలిగించుకుని దగ్గర కూర్చున్నాను. కటారాగారు తిరిగివచ్చే టప్పటికి 8 అయింది. రాగిణికి అప్పటి కింకా స్పృహరాలేదు.

"మూర్ఛవచ్చిందండీ" అన్నాను నేను.

"నయమవుతుందిలెండి" అన్నాడు ఆయన అతిశాపీగా.

"ఇదివరకటికంటే ఎక్కువ వస్తున్నట్లున్నాయి!"

"ఏమిటండీ? ఓహో! మూర్ఛలా! అవునండీ, వస్తున్నాయండీ!"

"మీరు మందు ఎందుకు ఇప్పించరూ?"

"దీనికి మందువుందా? అవునవును, ఉందిగదూ? ఇప్పిస్తాను" అని నవ్వా డాయన.

నాకు కోపంవచ్చింది. లేచి యింటికి వెళ్ళిపోయాను. అప్పటికి మావారుకూడా వచ్చారు. కాసేపట్లో మిష్టర్ కటారా మళ్ళీ వచ్చారు. "ఏమిటండీ" అని అడిగాను.

"నేను డాక్టరుని తీసుకురావటానికి వెళ్తున్నాను. కొంచెం మీరు శ్రమనుకోకుండా—

"నాకు తలనొప్పిగావుంది" అన్నాను.

"వెళ్ళిరారాదూ?" అన్నారు మావారు.

"యీ ఒక్కపూటకి మీరే వెళ్ళిరాగూడదా?" అన్నాను కోపంగా నేను.

"నేనా?" అని మావారు తడబడలాడారు.

"పోనీ, మీరే వచ్చి కొంచెంసేపు కూర్చోండి" అన్నాడు కటారా నవ్వి.

"వూరికే చూస్తూవుండండి చాలు. నేను రాగిణికి సరిగా మందిప్పించటంలేదని మిసెస్ రాజ్‌కి కోపంగావుంది. సరే కానివ్వండి. మీరు నా కొక పాఠంనేర్పాలని చూస్తున్నట్లున్నారు. మీ సాయంవుండటంవల్ల నేను మరింత నిర్లక్ష్యంగా తయారయ్యానని మీ వుద్దేశమనుకుంటాను. వదే కష్టమేమిటో ఒంటరిగాపడితే నేనే జాగ్రత్తపడి యేదో ఒకత్రోవ వెతుక్కుంటాననుకుంటున్నారు మీరు. నిజమేలెండి. మీరుమాత్రం యెందాకా సాయపడతారు పాపం! మీరు యింతవరకు చేశారు, అదే చాలా గొప్పవిషయం. మీ మేలు యెన్నటికి మరువలేను."

నే నలాగే కూర్చున్నాను. యేమీ మాట్లాడలేదు. వారు నావంక ఒకసారి చూసి, వెళ్ళిపోయారు. నే నింట్లో ఒంటరిగా వుండిపోయాను. డాక్టరువచ్చి వెళ్ళిపోయింతర్వాత మావారు తిరిగివచ్చారు. "అస లేం జరిగింది? నువ్వెందుకు వెళ్ళలేదు?" అని అడిగారు.

"నేను వెళ్ళనని చెప్పానుగదా" అన్నాను నేను.

"ఎందువల్ల?"

"రాగిణి సురేష్‌ని పిల్చుకొచ్చింది" అన్నాను.

"సురేష్ యెవరు?"

"అదే, ఆరోజు నన్ను రక్షించలేదూ, అతను"

"పిల్చుకొస్తే యేం ?"

"యీవిడబుద్ధి మంచిదికాదు, అతన్ని వలలోవేసుకోవాలని చూచింది. నేను వెళ్ళేటప్పటికి తనకోరిక పూర్తికాలేదు. అప్పుడే మూర్ఛ వచ్చి పడిపోయింది."

"నీ కెలా తెలుసు?"

"నేను చెప్తున్నానుగదూ!"

"జ్యోతిషం చెపుతున్నావా! లేకపోతే నువ్వే డాక్టరువనుకుంటు న్నావా?"

నేను నోరుమూసుకున్నాను.

"అస లేంజరిగిందో చెప్పు చూద్దాం"అన్నారు.

నేను రాగిణియింటికి వెళ్ళిందాకా జరిగినకథంతా చెప్పాను. విని "నీ కిలాంటి లేనిపోని అనుమానాలన్నీ వస్తుంటాయి. నీ కేదో దెయ్యం పట్టినట్టుంది. ఆరోజున రమవిషయంలో నన్నుగూడా అనుమానించావు నువ్వు. యిదంతా చూస్తుంటే, తొందర్లోనే నీగ్గూడా మూర్ఛలొస్తాయని పిస్తున్నది" అన్నారు. అని ఫకున్ననవ్వి మళ్ళీ, "యింత అనుమానమైతే బ్రతకటం యెలా ? మనం ప్రపంచంలో బ్రతకాలి. ఒకరినొకరు నమ్మ కపోతే యెట్లా ? నువ్వుగూడా నాయనమ్మలు, ముసలమ్మలు మాట్లాడి

నట్లు మాట్లాడతావేం? అసలు రాగిణి అలాంటిపని చేసివుండదు. ఒకవేళ చేసిందే అనుకో-అదిగాదు, నే చెప్పేది విను —ఒకవేళ చేసిందే అనుకో, దాంట్లో తప్పేముంది? అంతకొస్తే ఆవిడ విడాకులిచ్చేస్తుంది.లేకపోతే — అంతేలే, అంతకన్నా యేమవుతుంది?" అన్నారు.

"అయితే మీదృష్టిలో ఆవిడచేసింది మంచిపనేనా ?"

"మళ్ళీ అదేమాట! మంచీ చెడూ అంటే యేమిటనుకున్నావు? మంచివి కానివి నీలోనూ నాలోనూ సవాలక్ష వున్నాయి"

"అంటే?"

"అంటే-అంటే- అంటే యింక నే నేంచెప్పేది? యీప్రపంచం —యిందులో అన్నిరకాలవాళ్ళు వుంటారు" అని వారు నవ్వితాపీగా సిగ రెట్టు వెలిగించుకుని "మనిషి తనహృదయాన్ని యెప్పుడూ సంకుచితంగా వుంచుకోగూడదు" అన్నారు.

"అవునండీ, మగవాళ్లు యితరులభార్యలవిషయంలో యెప్పుడూ సంకుచితంగావుండరు. తన పెళ్ళాందగ్గరకొచ్చినప్పుడే గొంతుపట్టుకునేది. నేను జరిగిం దా కటారాతో చెప్పితే అతనుగూడా యిలాగే ఫిలాసఫీ మాట్లాడతాడా?" అన్నాను నేను.

"ఇదుగో, ఆయనసంగతేమీ నాకు తెలియదుగాని, నీ విషయంలో నాతో యెవడన్నా యిలాంటి చాడీలుచెప్పితే, నే నసలు పట్టించుకోనే పట్టించుకోను. నువ్వుకూడా కొంచెం వెనకా ముందు ఆలోచించాల్సింది. నిన్ను రక్షించినాయనమీదే తిరగబడి అనవసరంగా పోట్లాడివచ్చావు. అతన్ని యిన్సల్టు చేసేందుకుకూడా యేమాత్రం ఆలోచించలేదు. యింతకీ అస లతను చేసినపాపం యేమిటి? అతనిమీద అనవసరంగా నీలాప నిందలువేశావు నువ్వు. అసలు నీ బుర్రే చాలా విచిత్రంగా పనిచేస్తోంది. యేదో నే నొకణ్ణున్నాను—నీ మెదడులో యిలాంటివి యెన్ని చమత్కారాలుపుట్టినా భరించేవాణ్ణి. పైగా వాళ్లు మన పొరుగువాళ్లుగూడా! కాస్త ఆలోచించటంలేదు పెట్టటంలేదు. పోవటం—పోయి విరుచుకుపడటం, యిదెక్కడిగోలంట! ప్రపంచంలో యెవరెవరు యెక్కడెక్కడ యేమేమి

చేస్తున్నారో అన్నీ చిట్టా అవర్జాలు రాయటానికి చిత్రగుప్తుడు విన్నే వియమించాడా?"

అని ఆయన అదేవిధంగా చాలా అధికారపూర్వకంగా "వెళ్లు, వెళ్ళి తొందరగా రెండుకప్పులు కాఫీచేసి పట్టుకురా" అన్నారు.

"రెండుకప్పు లెందుకు?" అన్నాను నేను కోపంగా.

"ఒకటి నేను తాగుతాను. ఒకటి నువ్వు తాగాలి. తెలిసిందా. వెళ్లు" అన్నారు.

నే నింకేమీ మాటమాట్లాడకుండా వెళ్ళి కాఫీతయారుచేసి తీసుకొచ్చాను.

"యీ కోపంలో అసలు పంచదారవేశావా లేదా?" అని అడిగారు.

"తాగిచూడరాదూ?"

కాఫీతాగి వారు లేచి నాదగ్గరకొచ్చారు. నా జుట్టు రెండుచేతుల్తో పట్టుకుని ముఖం తనవైపుకి తిప్పుకుని కొంచెంసేపు అలా చూచి "యేవండీ పండితమ్మగారు!" అన్నారు. నాకు సిగ్గువేసింది.

మరుసటిరోజు వారు యెంతసేపటికి లేవలేదు. అలా నిద్రపోతూనేవున్నారు. "యిక యివ్వాళ లేవరా?" అని అడిగాను.

"యివ్వాళ సండేగదా! కాస్త నిద్రపోనిద్దూ"

"గుమాస్తాల్లాగా మీరుగూడా యిదెక్కడ అలవాటు డెవలప్ చేశారు? సండే వచ్చిందంటే కుంభకర్ణుడిలా పడుకుని నిద్రపోవటమేనా పని? యిటుగో చూడండి, మిసెస్ రైనాగారినౌకరు యేదో చీటీ యిచ్చి వెళ్ళాడు" అన్నాను.

వారు ఆత్రుతగా లేచి కూర్చుని, చీటీతీసి చదివారు.

"సరే, మనం సరిగ్గా ఐదున్నరకు వెళ్ళాలి" అని కూనిరాగాలు తీస్తూ లేచి నుంచున్నారు.

చెల్లీ! కొంచెం ఓపికపట్టు, యిక నేను చెప్పవలసింది యెక్కువ లేదు.

మేము మిసెస్ రైనాయింటికి వెళ్లేటప్పటికి ఆవిడ అతివయ్యారంగా మమ్మల్ని డ్రాయింగ్‌రూమ్‌లోకి తీసుకువెళ్ళి కూర్చోబెట్టి అన్నది.

"మిష్టర్ రాజ్! నిజంగా నేను చాలా చిక్కులోపడిపోయాను.

"ఏం? ఏంజరిగిందేమిటి" అన్నారు వారు.

"జరిగేదేముంది? మా సర్వెంటుకి యివ్వాళ జ్వరంవచ్చింది. చూడండి. వెధవకి యివ్వాళే జ్వరంరావాలా? మీకు మర్యాదచేయడానికి నావల్లఅయినంతవరకు యేదో నేనే తంటాలుపడుతున్నాను" అన్నది మిసెస్ రైనా.

"దానికేం,ఫరవాలేదులెండి. మేము కొత్తవాళ్ళంకాదుగా!"

"కాని నాకు మిష్టర్ శివపురిదే దిగులుపట్టుకుంది. మా కజినే నను కోండి. అయినా కొంచెం పెద్దవుద్యోగస్థుడుగదా, ఆయనకు మరియాద చెయ్యకపోతే బాగుంటుందా? ఏమంటారు? అన్నట్టు మీకు కారువుంది గదూ?"

"కారా! యెక్కడిదీ!" అన్నారు మావారు.

"చూడండి, నా హజ్బెండ్ నాకోసం ఒక కారుకూడా కొనలేక పోయారు"

మావారికి సిగ్గుతో తలతీసేసిన ట్టయింది. ఆయనవద్దకూడా కారు లేదుగదా మరి!

"ఒకపని చేద్దాం. పదండి, మీరూ నేనూ వెళ్ళి మోతీమహల్ మార్కెటునుంచి ఒకకోడిని తీసుకొద్దాం. యిక్కడినుంచి బస్సులో వెళ్ళి పోదాం. తిరిగి వచ్చేటప్పుడు టాక్సీలో రావచ్చు" అన్నది మిసెస్ రైనా.

"మీరెందుకు, మీరు వుండండి. నేను వెళ్ళి తీసుకువస్తాను" అన్నారు మావారు.

"నో! నో! మిష్టర్ రాజ్! నా గెస్టును యీవిధంగా శ్రమపెట్ట డం పెద్దపాపం! నాకుమాత్రం తెలియదా? మీరు ఒంటరిగావెళ్ళటానికి వీల్లేదు" అన్నది మిసెస్ రైనా.

వాళ్ళిద్దరూ బయలుదేరారు. అకస్మాత్తుగా మిసెస్ రైనా నా దగ్గ రకు తిరిగివచ్చి "మిష్టర్ శివపురి వస్తే నేను లేకపోయినా ఆయన్ని బాగా యెన్ టర్టైన్ చెయ్యాలిసుమా!" అని ముసిముసినవ్వులు నవ్వుతుంటూ వెళ్ళిపోయింది.

ఒక్కత్తెనే కూర్చోటానికి నాకు మహా విసుగేసింది. మంచి పార్టీయే యిది! కాని పాపం, వారుమాత్రం యేంచేస్తారు? పైఆఫీసరు పిలిస్తే రాకపోయినా యిబ్బందే! యిలా నేను యేదేదో ఆలోచిస్తూ వుండగా ఒక పెద్ద పొడుగాటి కారు పోర్టికోలో కొచ్చి నిలబడింది. దాంట్లోనుంచి మిష్టర్ శివపురి దిగారు.

నేను స్వాగతమిచ్చాను. వారు గొప్పదనం ఒలకబోస్తూ నవ్వారు. నేను వారిని డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చోబెట్టి సోఫాలో రెండోచివర కూర్చున్నాను.

చెల్లీ! ఆ నిశ్శబ్దం భరించరానిదిగావుంది. ఆ మనిషిగొప్పదనం నాకు చాలా తెచ్చిపెట్టుకొన్నదిగా కృత్రిమంగా కనిపించింది.

"మీరు యిక్కడ ఒంటరిగా వున్నారా?" అని అడిగాడు.

"అవునండీ!"

నావంక అదోలా చూస్తూ చిరునవ్వునవ్వా డతను. అతనిచూపులు నా కేమీ బాగుండలేదు.

"రాజ్ చాలా మంచివాడు. హి మస్ట్ గెట్ యె రైజ్!" అన్నాడు శివపురి. అని నావంక చూశాడు. దురాశతోనిండినదృష్టి. నేను వణికి పోయాను. అతడివంక భయంగా చూశాను. అతని వెడల్పాటిచెయ్యి లేచి నాచేతిని పట్టుకుని కప్పివేసింది. నేను చెయ్యివిసిరికొట్టి లేచి నిల బడ్డాను.

అత నలా చూస్తూనేవున్నాడు. లేచి నిల్చున్నాడు.

"మిసెస్ రాజ్! మీరు చాలా తప్పుచేస్తున్నారు" అన్నాడు.

అతని ధైర్యం చూడు!

"అలాగా?" అన్నాను నేను.

"దీంట్లో యేముంది, చాలా చిన్నసంగతి"

"మిసెస్ రైనాను రానివ్వండి. ఆ దేమిటో అడిగి చూస్తాను"

"ఆవిడ కంతా తెలుసు"

నేను నృపహతప్పి క్రిందపడిపోతానా అనిపించింది. ఒక్కసారి నలువైపులా భయంగా చూసి, ఒకే పరుగుతీశాను. యింటి కెలా చేరు

ఉన్నానో నాకే తెలియదు. నా గుండె యింకా దడదడలాడుతున్నది.

బాగా చీకటిపడినతరువాత వారు వచ్చారు. గదిలోకి రావటమే కోపంతో మండిపోతూ వచ్చారు. "యింత మొరటుతనమా? బుద్ధితక్కువకుకూడా మరీ హద్దూపద్దూవుండొద్దా?" అని కేకలువేశారు. నేను లేచి కూర్చుని నెమ్మదిగా "నేను మొరటుదానినా?" అని అడిగాను.

నా కంఠంలోని కాఠిన్యంవల్ల వా రేదో పసిగట్టారు. ఏమీ మాట్లాడలేకపోయారు.

"నేను చేసింది మొరటుదనమైతే దానివల్లే మీ గౌరవం నిలబడింది" అన్నాను నేను నా జుట్టుపీక్కుంటూ. స్తబ్ధులాగా అలాగే నిలబడి చూశారు వారు.

చెల్లీ! అప్పటినుంచీ ఆ రాక్షసుడు వారిమీద యేమి పగతీర్చుకుంటాడో అని అనుక్షణం భయంగానే వుంటూంది. యేంచెయ్యాలో యేం తోచటంలేదు. యివ్వాళ వారు నావద్దకొచ్చి, "సుశీ! నీవు నా గౌరవం కాపాడావు. నీవు చాలా మంచిదానివి. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నా కిక యెవరిభయమూ లేదు. ఆ వెధవ న న్నేంచేస్తాడు? యిక యీ వుద్యోగంపోయినా నే నేమీ లెక్కచెయ్యను" అన్నారు. నాకూడా యింకెవరిభయమూ లేదు.

ముందు యేంజరుగుతుందో తెలియదు చెల్లీ! అందువల్లే నీపని హాయిగావుందంటున్నాను. సాంఘికసంక్షేమకేంద్రానికి యిప్పుడుకూడా వెళ్తున్నాను. జీవితం అలా నడుస్తూనేవుంది, కాని అనుక్షణం గొంతుమీద యెవరో కత్తిపెట్టినట్లుగా వుంటుంది. పూర్వపు సుఖము, శాంతీ యెప్పుడు తిరిగివస్తాయో తెలియదు.

కాని నా కిప్పుడు యెలాంటిభయమూ లేదు చెల్లీ! నాకు కావలసిన అభయం లభించింది. యెటువంటి అభయం లభించిందంటే, యీ పాపం యేనాటికైనా బిడ్డలుకాక తప్పదనే నమ్మకం కలుగుతున్నది నాకు. జ్ఞాపకం వుంచుకో.